వాణీ ప్రచురణలు నెం. 3

# మత్స్య పురాణము

ఎల్లూరి నరసింగకవి ప్రణీతము



సంపాదకుడు

లవాయు లింగమూర్తి

ఉపన్యాసకుడు

శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల

పాలెం - 509 215

తిరుమల - తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సాహాయ్యముతో ముద్రింపబడినది

వాణీ ప్రచురణలు నెం. 3

# చాటుపద్య విలాసము

ఎల్లూరి నరసింగకవి ప్రణీతము



సంపాదకుడు

కపిలవాయి లింగమూర్తి

ఉపన్యాసకుడు

శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ కళాశాల

పాలెం - 509 215

తిరుమల - తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సాహాయ్యముతో

ముద్రింపబడినది

'CHUTAPURI VILASAMU' writed by Yelluru Narasinga Kavi. Edited by Sri Kapilavai Lingamurthy, Lecturer, Sri Venkateswara Govt. Oriental College, Palem - 509 215 Mahaboobnagar (Dist.)

PUBLISHED WITH THE FINANCIAL ASSISTENCE OF

TIRUMALA – TIRUPATI DEVASTANAM



ముద్రణ : ఏప్రిల్ 1980

ప్రతులు : 1000

వెల : రు. 10-00

ప్రతులకు :

1) కె. కిశోరుబాబు
15-34. వాణీసదనం, విద్యానగర్ కాలనీ,
నాగర్‌కర్నూలు - (ఆం. ప్ర.) Pin. 509 209

2) కాకతి పబ్లికేషన్స్
నారాయణగూడ, హైదరాబాదు.

ముద్రణ :
పద్మా పవర్ ప్రెస్
కాచిగూడ, హైదరాబాద్ - 27.

# విషయ సూచిక

# కృతజ్ఞతలు

ప్రాచీన గ్రంథాలు సంపాదించటం, సంపాదించిన వాటిని పరిష్కరించటం, పరిష్కరించినవాటిని చక్కగా అచ్చొత్తించటం ఒక్కొక్కటి ఒక్కొక్క యాగం.

రచయిత అయిన వానికి నూతనంగా కృతి వ్రాయటం ఎంత కష్టమో ఒకరు వ్రాసిన దాన్ని పరిష్కరించటం గూడ అంతే కష్టం. ఒకందుకు యింకా స్వయంగా వ్రాయటం మేలు. తన వస్తువును తానేవిధంగానైనా రూపు దిద్దుకో వచ్చును గాని యితరుల వస్తువును చూపినపుడు వారి హృదయాన్నెరిగి న్యాయం చేయటం చాలా కష్టం. అందువల్ల నేను నా కృషిలో ఎంతవరకు సఫలత చెంది నానో పాఠకులే నిర్ణయించాలి.

ఇక ఈ కృతి ముద్రణకు దయతో అంగీకరించి ఆర్థిక సహాయం చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గం వారికి -

నాకీ కృతి పరిశీలనకు, పరిష్కరణకు తగిన సాహిత్య సహాయం చేసి అడగగానే తన అభిప్రాయాన్ని గూడ అందించిన ఆత్మీయులు "శ్రీరంగాచార్య గారికి" -

దీనిలోని దరువులకు రాగ తాళాలు ఓపికతో నిర్ణయించి యిచ్చిన మిత్రులు పాలమూరి నివాసులు ప్రస్తుతం బిజనపల్లి బ్లాకులో V. D. O. గా పని చేస్తున్న శ్రీ పాలకొండ గురుమూర్తి గారికి" -

కృతజ్ఞతలు తెలుపుకుంటూ నాకు వ్రాతకు ముద్రణ వ్యవహారానికి చేదోడు వాదోడుగా నున్న మా చిరంజీవులు కిశోర్‌బాబు అశోక్‌బాబులను ఆశీర్వదిస్తున్నాను.

— సంపాదకుడు

యం. శ్రీనివాసరావు  ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యుడు (MLA)
B A; LL B.  నాగర్‌కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా.

# ఆశంస

ప్రపంచంలో మానవ సంఘం నుండి చరిత్ర, చరిత్ర నుండి మానవునికి ఆదర్శం ఉద్భవించాయి.

మన ప్రాంతంలో ఓ ప్రత్యేకమైన నైసర్గిక, ఆధ్యాత్మిక పరిస్థితులలో ఒక విశిష్టమైన చరిత్ర సృజన జరిగింది. ఏ కాలంలోనైనా ప్రత్యేకమైన చరిత్ర నుండే సంస్కృతి వికసిస్తుంది. మానవ జీవిత లక్ష్యాలు, వాని క్రమం దైనిక జీవితం ఏ విధంగా ఉండవలసింది విదేశాలలోని వేదాంతులు వివరించలేని విధంగా మన పూర్వులు తమ తమ ప్రాంతానికేగాక యావత్ప్రపంచాని కంతటికీ ఆదర్శంగా వేదాంతాన్ని, జీవిత లక్ష్యాలను, వెలుగు బాటలను తమ రచనల్లో చూపించారు.

ఈ భూగోళం దీనిపైగల సమస్త పదార్థాలు అశాశ్వతం. ఆత్మ ఒక్కటే శాశ్వతం. ఇది భారతీయ సిద్ధాంతం.

దైహిక సుఖాలు మానవునే విధంగా దిగజార్చుతాయో జ్ఞానియైనవాడు కాలవశానవానిలో తగిలినప్పటికి ఏ విధంగా వానినుండి పునరుత్థానం పొందుతాడో, తన జీవితం సర్వాన్ని భగవత్సమర్పణ జేసి కాలం గడిపిన విప్రనారాయణుని జీవితాన్ని గ్రహించి ఎల్లూరి నరసింగకవి చూతపురీవిలాసమనే ఈ కృతిలో చక్కగా ప్రదర్శించాడు. సామాన్యుని జీవితం వేరు. విప్రనారాయణుని జీవితం వేరు.

ఈ గ్రంథంలో కొల్లాపురం, నాగర్‌కర్నూలు, అచ్చంపేట తాలూకాల సాంఘిక జీవితం అందునా మామిళ్లపల్లి విశిష్టత కవి కనులకు కట్టించాడు.

గ్రంథ సంపాదకులు కపిలవాయి లింగమూర్తిగారు మిక్కిలి శ్రమతో దీన్ని సంపాదించి పరిష్కరించి పాలమూరి జిల్లాకేగాక తెలుగు దేశానికి గూడ సేవ జేశారు. భవిష్యత్తులో ఇదే విధంగా మన జిల్లాలో అణగారిన చరిత్రను,

సంస్కృతిని, ప్రాచీన రచనలను పరిశీలించి వెలుగుకు తెచ్చి మన రాష్ట్ర ప్రజలకు తమ పరిశోధనతో కనువిప్పు కలిగిస్తారని, వారికి సాహితీపరు లందరి తోడ్పాటు అండదండలు సర్వదా ఉండవలెనని ఆశిస్తున్నాను.

---

ఈ గ్రంధావిష్కరణ కార్యక్రమానికి అడగగానే అంగీకరించి అభిప్రాయాన్ని ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ శాసన సభ సభ్యులు శ్రీ శ్రీనివాస రావు గారికి, ముఖ్య అతిథిగా వచ్చిన శ్రీ పి. మారుతీరావు గారికి కృతజ్ఞతలు

ఇట్లు
కపిలవాయి లింగమూర్తి

# శ్రీ వచనము

'చరిత్ర పరిశోధకులకు తెలంగాణము బంగారు గని వంటిది'-అని త్రికాలాబాధితమైన ఒక సత్య వాక్యాన్ని - పరిశోధనలతో తలపండిన ఒక మహావ్యక్తి అన్నాడు

శేషాద్రి రమణ కవులు తెలంగాణాన్ని గాలించి ఎన్నో తాటాకు పుస్తకాలను శాసనాలను, నాణాలను సంపాదించి సంస్థల హస్తగతం చేసినారు. వారి తర్వాత ఈ ప్రాంతంలో అంత పెద్ద అన్వేషణ కృషి మాత్రం జరగలేదు. ఇప్పటికీ మారుమూల పల్లెల్లో ఉండి అభిమానంతో వీని విషయమై ఎవరన్నా పరిశోధన సాగచేసినా వారికి రాణింపు కలగకపోవడం బాధాకరమైన విషయం.

చూతపురీ విలాసమనే ఈ యక్షగాన ప్రబంధం నేటికీ ఎవ్వరికి తెలియని తాళ పత్ర గ్రంధం శ్రీ లింగమూర్తిగారు దీన్ని సంపాదించి - తిరగవ్రాసి - పరిచేసి నేడు మన కందిస్తున్నారు. ఒక తాటాకు పుస్తకానికి ముద్రణ రూపం కలిగించాలంటే ఎంత కష్టమో అనుభవించిన వారికే తెలుస్తుంది.

ఈ గ్రంధకర్త సింగపట్నం నరసింహస్వామి భక్తుడైన వెల్లూరి నరసింహ కవి కృతి భర్త తరణికంటి నరసారాయుడు. ఈయన మామిళ్ళపల్లి నరసింహస్వామికి భక్తుడు. కృతి భర్త అభీష్టాన్ననుసరించి కవి దీనిని మామిళ్ళపల్లి స్వామి పేర రచించినాడు. ఈ కవిదే రాజకన్యా పరిణయమనే మరో రచన ఉన్నదని పరిష్కర్తలు తెలుపుతున్నారు.

చూతపురీ విలాసమనే ఈ యక్షగానాన్ని కవి ''యక్షగాన ప్రబంధము'' అన్నాడు దీనిలో ..

కవిత్వము - వివిధచ్ఛందములు, వర్ణనలు - కధాకథన పద్ధతి - వీనన్నింటి వలన ''ప్రబంధ'' నామము సార్థకమైనది.

దీనిలో పద్యాలు - దరువులు - ద్విపదలు - మొదలైనవి కలిపి మొత్తము 915 ఉన్నవి

ఈ గ్రంధకర్త చక్కని కవితాధార కలవాడు. నాటి సాంఘిక పరిస్థితులను ఆచార వ్యవహారాలను చక్కగా ఆకళింపు చేసుకొని సందర్భాను గుణంగా వాటిని

ప్రవేశపెట్టినారు ఈ కవి అంత ప్రాచీనుడు కాకున్నా - ప్రాచీన కవితా గౌరవం మిక్కుటంగా ఉంది, ఆ ప్రభావం నుంచి తప్పించుకోలేక పోయినాడు - ఇది అసాధ్యం కూడా।

చూడండి 103 వ పద్యం.

"కలకంఠినూగారు గాంచిన జాలదే
శేషాచలంబు వీక్షింపనేల" - అన్నాడు.

దీనిలో నూగారు - శేషాచలము, ఉన్నవి. నూగారు కవి సమయంలో కాలాహి అందుకే 'శేషాచలము' అని ప్రయోగించినాడు. (శేషుడు - సర్పము) నూగారు సర్పాకృతి అనడానికి ఈనిరమైన చమత్కృతి. వైష్ణవ భక్తుడు కాబట్టి భక్తునితో శేషాచలమును చెప్పించినాడు ఈ రకమైన రచన ప్రస్తుత గ్రంథంలో విశేషంగా కన్పిస్తుంది. ఇట్టి కొన్ని సొగసులను పరిష్కర్త పీఠికలో ప్రవచించినారు.

ఈ గ్రంథానికి మరొక విశిష్టత నిచ్చేది - పన్నిద్ద రాళ్వారులలో ఒకరైన తొండరడిప్పొడి యాళ్వారు (విప్రనారాయణ) చరిత్ర చెప్పబడటం. ఈయననే భక్తాంఘ్రి రేణువు అంటారు. ఈకథ మిక్కిలి ప్రచురమైంది. ద్రావిడ వాఙ్మయం నుండి తెలుగువారు గ్రహించి చక్కగా తీర్చిదిద్దిన రచనల్లో ఈ విప్రనారాయణ చరిత్ర ఒకటి. శైవసాహిత్యాన్ని గూర్చి పరిశోధన జరిగింది. ఈ వైష్ణవ వాఙ్మయాన్ని గూర్చి విస్తృత పరిశోధన జరగవలెను. ఆశాఖలో చూతపురీ విలాసం ప్రముఖంగా నిలుస్తుంది.

"శ్రీ వైష్ణవులు - ఒక వ్యక్తిని "తొండరడిప్పొడియాళ్వారు" అని అంటారు - అంటే రసికుడు వేశ్యాలోలుడు అని. అట్లాగే తిరుమంగ యాళ్వారు- దొంగ, మధురకవి యాళ్వారు - చక్కగా శ్రావ్యంగా పాడేవాడు -' అని వారి పరిభాష. తత్సంప్రదాయాభిజ్ఞులకు ఈ విషయం తెలుస్తుంది. పీఠికలో ఆళ్వారులను - వారి కాలములను గూర్చి వివరింపబడింది. ప్రసిద్ధమైన- 'భూతం సరశ్చ మహదాహ్వయ-' ఇత్యాది శ్లోకం దీనిలో చోటు చేసుకోకపోవటం లోటుగా కనబడుతున్నది

గ్రంథ సంపాదకులు పీఠికలో శ్రీవైష్ణవ కుటుంబాలను గూర్చి వ్రాసినారు. అందులో సముద్రాల వారిని గూర్చి కలదు. ఇది అనుగ్రహంగానే ఉన్నది. కందాళ, భట్టరు, మరింగంటి, సముద్రాల వారిని పెద్ద ఆచార్య పీఠాలు. వీరిని

గూర్చేగాదు నేడు తెలంగాణంలోవున్న శ్రీ వైష్ణవ కుటుంబాలు ఎప్పుడు - ఎక్కడ నుండి - ఎందుకు వచ్చి స్థిరపడినవి ? వాటి చరిత్ర ఏమి ? పరిశోధించి, నిగ్గు తేల్చవలసిన విషయం. ఈ పీఠికలో ఇది అప్రస్తుతమని వీరు వదిలినట్లున్నారు. అయితే పరిష్కర్త ఈ గ్రంథంలో వచ్చిన శ్రీ వైష్ణవ పరిభాషా పదాలను తెల్పి వీలయినంతవరకు వివరణ లిచ్చినారు. ఇది మంచిపద్ధతి. పీఠికలోని శీర్షికలు కూడ విశిష్టాద్వైత వాసనా వాసితాలు కావడం ఒక విశేషం. వీటన్నిటిని చూస్తే గ్రంథ సంపాదకులు విశిష్టాద్వైత సంబంధమైన గ్రంథాలను తిరగవేసినట్లు పీఠిక సాక్ష్యమిస్తున్నది. 1941 వృష సంవత్సరాది సంచికయగు ఆంధ్రపత్రికలో జలసూత్రం వారు వైదిక పరిభాషను గూర్చి చక్కని వ్యాసం వ్రాసినారు. అలాగే శ్రీవైష్ణవ పరిభాషను గూర్చి సంప్రదాయాభిజ్ఞులైన భాగవతోత్తములు ఒక వ్యాసాన్ని ప్రకటిస్తే చాలా విషయాలు తెలిసేవి.

లింగమూర్తిగారి పీఠిక నిజంగా చూతపురి నరసింహస్వామికి పీఠం వంటి దనవచ్చు.

ఈ గ్రంథ పీఠికలో ఒక మామిళ్ళపల్లేగాదు (ఇదే చూతపురి) నాగర కర్నూలు, కొల్లాపురం, అచ్చంపేట కల్వకుర్తి తాలూకాల్లోని గ్రామాల చరిత్ర, దేవతల గూర్చి తెల్పబడింది. ఇది మిక్కిలి శ్రమతో కూడినపని. ఆకరాలను సేకరించడం ఒక ఎత్తు - వాటిని సమన్వయ పరిచి పాఠకునికి తెలిసే రీతిలో చరిత్రను చక్కగా వివరించడం ఒక ఎత్తు. దీన్ని లింగమూర్తిగారు చరిత్రవలె గాక కథవలె వ్రాసినారు. ఇదొక పద్ధతి చరిత్ర పరిశోధనలో రాళ్ళు రప్పలు - రత్నాలు - మాణిక్యాలే కాదు అపూర్వ విషయాలు చేజిక్కుతాయి. అవే అభినవ మయూర సూరి గ్రామం, కొల్లాపురం ప్రాచీననామం మొదలైనవి. ఇవి ఇప్పుడెందరికి తెలుసు ? ఈ పీఠికలో రాకున్నా ఒక విషయం తెల్పుతాను. లక్ష్మణ సార సంగ్రహాన్ని వ్రాసిన చిత్రకవి పెద్దన వెలలూరి పురాంజనేయుణ్ణి స్తుతించి నాడు. ఆయనకే గ్రంథం అంకితం. 1961 లో ఆంధ్రసాహిత్య పరిషత్ వారు దీన్ని ప్రచురించి వెంపరాల వారిచే పీఠిక వ్రాయించినారు. ఈ వెల్లలూరు ఎక్కడిది ? అని వారు సంశయంగా వదిలినారు. ఇది వెలలూరు కాదు, వెలటూరు. ఈ గ్రామాలు వనపర్తి కొల్లాపురం తాలూకాల్లో ఉన్నాయి. ఈ కవి కొల్లాపురం తాలూకాలోని వెలటూరి వాడే ! అక్కడ అంజనేయస్వామి దేవళం ప్రాచీనమైనది కలదు. ఈ వంశంవారు ఆ ప్రాంతంలో ఉన్నారని అక్కడివారు చెపుతుంటారు. ఇట్లాంటి విషయాలను బాగా పరిశోధించి తెలివిడి చేయడం నేడు అవసరం.

పీఠిక అపూర్వం విషయ సంభరితం. దాన్ని గూర్చి ఇంకా వ్రాయడం బాగుండదు. చవి చూచి ఆనందించడం సహృదయ పాఠక లక్షణం గదా !

శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు చేయి తిరిగిన కవి. చక్కని పద్యరచన చేస్తారు. వచన రచన గూర్చి చెప్పవలసిన అవసరమేలేదు. వీరింతకు పూర్వం మనోహరమైన శైలిలో కొన్ని శతకాలను వ్రాసినారు. వాటిలో ఆర్యాశతకం చిత్రపది; ఇది ఒక నూతన మార్గాని ప్రవేశపెట్టింది. కొద్ది నెలల క్రితం నాగర్ కర్నూలు తాలూకాలోని బుగ్గబావి క్షేత్రకథను సేకరించి, చక్రతీర్థ మాహాత్మ్యం అనే పేరుతో మూడాశ్వాసాల పద్యకృతిగా రచించి ప్రకటించినారు. దీనికి కూడా తిరుపతి దేవస్థానం వారు ఆర్థికసాయం చేసినారు. ఇది చక్కని కృతిగా బహు పండిత జనాదర ప్రశంసల పొందింది. లింగమూర్తిగారు తెనుగు సాహిత్యము లోని లోతులను తెలిసి ఆయా పద్ధతులపై అభినివేశమున్న వారు. నిత్య జీవిత మునందు ఎంత నిరాడంబరులో కవితా జీవితమున అంతే। పట్టుదలగల మనిషి, శ్రమను లెక్కచేయని సాహిత్య కృషీవలుడు. వీరిని చిదిమినచో మహబూబ్‌నగర్ జిల్లాలోని సాహిత్య చారిత్రక విశేషాలు గడగడా వినిపిస్తవి వాటిల్లో ఏ కొంచెమో చిత్తు కాగితాలపై పడింది. నేటి ఆడంబరాలు - ఆర్భాటాలు ప్రచారాలు లేనివాడు కాబట్టి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ చేతనయానంత మేరకు చదువుల తల్లికి ఊడిగం చేస్తున్నాడు. వీరివద్ద ఎన్నో ప్రాచీన అముద్రిత కృతులున్నాయి. అవి ఆలయ మందముద్రితములై తెరచాటున దాగియున్న బిబ్బీలు" - ఈయన.

'ఈనాపదార్పిత క్షోణినే రాజు.

ధర్మాసనంబుండి స్మృత్యర్థమనెనో" – అనుకుంటూ ఆయా చారిత్రక ప్రదేశాల్లో తిరగడం స్వయంగా తెలిసిన వాణ్ణి.

కవిత్వం వ్రాసేవారికి స్వేచ్ఛ ఉంటుంది. కాని ఎప్పుడో ఎవరో వ్రాసిన ఒక తాటాకు పుస్తకాన్ని తిరగ వ్రాసి పరిష్కరించి ప్రకటించడం మాత్రం చాలా తలనొప్పి పని. అయినా కవిత్వం వ్రాసే వానికి వచ్చేవి భూషణలు జరిగేవి సన్మానాలు పరిష్కర్తకు వచ్చేవి దూషణలు - నిసమానాలు. ఇది మన సాహిత్యంలోని ఒక ప్రత్యేకత.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు దీని ప్రకాశానికి ఆర్థికసాయం చేసి చక్కని కృతిని లోకాని కందించే వీలు కల్పించినారు. వారికి ధన్యవాదాలు తెల్పు తున్నాను.

శ్రీలింగమూర్తి గారికి నాపై సుహృద్భావమున్నది. ఇద్దరం "ఏకపంథాలో ప్రయాణిస్తున్న వారం కాబట్టి ఈ "శ్రీవచనం" వ్రాయమన్నారు." వారి మాటను కాదన జాలను గదా !

దుర్మతి చైత్ర ౧౫ ఆదివారం
19-4-81 పాలెం 509215.

"శ్రీరంగాచార్య"

# ప్రారంభోన్మీలనము

కోదండే జ్యేష్ఠనక్షత్రే మండంగుడి పురోద్భవమ్
చోళోర్వ్యాం వనమాలాంశం, భక్తపద్రేణు మాశ్రయే

ఇది విప్రనారాయణుని చరిత్ర. ఇతడు వైష్ణవ మతమునకు జెందిన పన్నిద్ద రాళ్వారులలో నెనిమిదవవాడు. ఈ మహనీయుడు ద్రావిడ దేశమున కావేరీ తీర మునగల మండంగుడి యను గ్రామమున లక్ష్మినారాయణు లను దంపతులకు కలిశకము 298 కి సరియగు ప్రభవ సంవత్సర ధనుర్మాసమున కృష్ణచతుర్దశీ జ్యేష్ఠా నక్షత్రమున జనించెను. తలిదండ్రులు లితనికి పెట్టుకొనిన పేరు నారాయణుడు. కాని యాళ్వారులలో వివిధ వర్ణములకు జెందిన వారుండుట చేత జను లితనిని విప్ర నారాయణుడని పిలిచిరి. ఇతడు బాల్యము నుండియే ప్రహ్లాదునివలె భక్తుడై శ్రీరంగ పట్టణము జేరి యచట రంగనికి మాలాకైంకర్యము జేయుచు జీవిత మును గడపెను. భక్తులను గాంచినపుడు నేను మీ పాదరేణువునని చెప్పుకొనుచు వారికి నమస్కరించుచుండెను. కనుక ద్రావిడు లితనిని తొండరడిప్పొడి యాళ్వా రని పిలిచిరి. ఆళ్వారనగా జ్ఞాని యని యర్థము. భక్తాంఘ్రిరేణువనునది దానికి సంస్కృతీకరణము. ఈ భక్తవరేణ్యుని హృదయమును మాధుర్యతరంగితము చేసిన "దేవదేవి" యను వేశ్య ఆనాటి చోళ రాజాస్థాన నర్తకి. "ఉరైయూర్" అను గ్రామవాసిని. ఇటుల వీరు పురాణ పురుషులు గాక చారిత్రక వ్యక్తులు.

మానవుని యందు భక్తిమనోధర్మము, కామము దేహధర్మము. ఆ రెంటి కితని జీవితమున తీవ్రమైన ఘర్షణ మరియు పోటిగనుపించును. తాత్కాలికముగ కామము జయించినను అతడు తరువాత తన తప్పును దెలిసికొని భగవంతుని స్తుతించెను. అవి నేడు మొదలాయిరమున ఏడు, ఎనిమిది ప్రబంధములుగా, తిరు మాలై, "తిరుప్పళ్లి యెళుచ్చి" యను వ్యవహారములతో భగవంతునకే ప్రాతి ధిక గీతికలుగా నున్నవి. వైష్ణవాలయములందు గర్భాలయములు దెఱచుటకు ముందు నేటికిని వానిని జదువుదురు.

ఇతని జీవితమున భక్తి రక్తి రెండు సమపాళ్లలో చోటు చేసికొనుట చేత గాబోలు నాళ్వారులం దెవరిపైని లేనంత సాహిత్యసృష్టి యితనిపై జరిగినది. అంతేగాక యక్షగాన ప్రపంచమున మొదట కాలుపెట్టిన ఘనత గూడ నీతనికే దక్కుచున్నది. ఇది యితని విశిష్టత.

ఈ కృతి చూతపురీ విలాసము. దీని కర్త వెల్లూరి నరసింగ కవి. కృతి భర్త తరణికంటి నరసారాయడు. నరసింగ కవి సింగపట్టణ నృసింహస్వామి భక్తుడు. నరసారాయడు మామిళ్ళపల్లి నృసింహస్వామి భక్తుడు. ఈ కృతి మామిళ్ళపల్లి నృసింహునికి అంకితము. ఇటు లిది యంతయు నృసింహమయము.

గత శతాబ్దమున పాలమూరు జిల్లాలోని సంస్థానములందు పెక్కురు ప్రసిద్ధులైన కవి పుంగవులుండిరి. అట్టివారిలో గద్వాల సంస్థానమందలి పేరందిన కవులలో లక్ష్మీనరసయ్య యొకడు. ఈయన నందవరీకుడు. కౌశికస గోత్రుడు. వీరి యింటి పేరు ముత్యాలవారు. ఈ కవి జన్మగ్రామము నేటి కొల్లాపుర గ్రామ సమీపమందలి వెల్లూరు. ఈ కృతికర్తయగు నరసింగయ్య ఈ లక్ష్మీనరసయ్యకు సోదరుడు. వీరిద్దరు నరసింహస్వామి భక్తులు. ప్రౌఢులైన జంటకవులు. వీరికి గద్వాలలో ప్రత్యేక గౌరవ మర్యాద లుండెనట.

లక్ష్మీనరసయ్య నృసింహ విలాసమను కృతి రచించినట్లు గోలకొండ కవుల సంచిక వలన తెలియును. కాని అందే క్షేత్రమందలి నృసింహుని ఆయన కీర్తించెనో తెలియదు. ఈయన సోదరుడగు నరసింగయ్య మాత్రము సింగపట్టణ నృసింహస్వామి భక్తుడు.

ఈ కవి జటప్రోలు సీమను పాలించిన రాజా వెంకట లక్ష్మారావుగారి ఆస్థాన కవి. ఈయనకు పురుష సంతానము లేదు. ఒక కూతురు మాత్రము కలిగెను. ఆమె నవ్వుంపేటకు యిచ్చిరి. ఆ శాఖ నే దవ్వంపేటలో నున్నది. వెల్లూరిలో ఈయన అన్నగారగు లక్ష్మీనరసయ్యగారి వంశమున్నది. వీరి వంశ వృక్షము చివరి పేజీలో యిచ్చితిని.

వెల్లూరు నేడు కొల్లాపుర సమీపమందలి యొక పల్లె. అది జటప్రోలు సీమకు నాల్గవ రాజధాని. దీని పిమ్మటనే సురభివారికి కొల్లాపురము రాజధానియైనది. వెల్లూరి కా పేరెట్లు వచ్చెనో తెలియదు. కాని అది ప్రాచీన గ్రామము. నే దచట

వేంకటేశ్వ రాలయమున్నది. దానిని "రంగప్ప" అను నతడు స్థాపించినట్లీ క్రింది చాటు కావ్యము వలన దెలియును.

సీ. .... .... .... .... .... ....
.... .... .... .... .... ....
.... .... .... కళావాప్తి చేతల వన
.... హీన భుక్తురగాంబ యెల్లమాంబ
పతిహిత దృఢభక్తి భావనచే పరా
శరజనకాంబ శ్రీశరభమాంబ
యను కళత్రత్రయం బత్యంత ముదమున
వివిధ బాంధవులతో వెంటరాగ

అపరిమిత ధనముల గొని విపుణులైన
హితులు పరివార యుతముగా నేగుదేర
వేంకటేశ్వరు దర్శించు వేడ్కతోడ
పురము వెడలెను రంగప్ప బుధులు వొగడ.

వ. ఆ విధంబున జని యాదివనంబున కృష్ణానదీ సమీపంబున బొల్లి వరంబను నగరు జేరి, ఆ రాత్రియందు వసించి మరునా డరుణోదయంబున కృష్ణా స్నానం బొనర్చి, గోహిరణ్య కన్యా భూదానంబు లపరిమితంబుగా భూసురుల కొసంగి నది తరించి యుషఃకాలంబున నొక్కగజిగని బుధజనుల రావించి యిట్లని చెప్ప దొడంగె.

సీ. నవరత్న ఖచిత సుందర కిరీటమువాడు
కౌస్తుభోల్లసిత వక్షంబువాడు
అపరంజి వన్నె సొంపగు శాలుగలవాడు
కంకణాంగదములు గలుగువాడు
కుండలమండిత గండభాగమువాడు
తొగలరాయని నగుమొగమువాడు
వాలుగ బెక్కెము వానికం బెను చక్క
దనము వాడసురుల దునుమువాడు

సురభిచందన చర్చిత సుందరాంగు
డంబుజ రథాంగ శంఖగదాయుధములు
వెలగు హస్తములందు భాసిల్లువాడు
కన్నుదోయికి నెదుట సాక్షాత్కరించె.

వ. అపు డిటువంటి శుభలక్షణంబు లితరులకు గల్గునే? (గ్రంథ పాతము) ధన్యుండనైతినని వలగొని నమస్కారం బొనర్చు మేలుకొంటిని. ఇది యేమి వింతయని యడిగిన వారసదు లద్భుత స్వాంతులై, సాక్షాచ్ఛ్రీ వేంకటాచల రమణుం డీ విధంబున బయ్కాట నీ పురాకృత మహిమం బేమని గొనియాడను. నీవు దేవాంశ సంభవుండవు. రయంబున దేవాలయ ప్రయత్నంబు వేయుమని పల్కిన సపరివారంబుగా నగరంబునకుం జనుదెంచి,

తే. మూలబేరంబు వసురత్న జాలఖచిత
మంటపము హోమశాలయు మావికముల
నందమౌ వాహనపుశాల యాదిగాగ
మేలుగా కోవెలయును నిర్మించెనపుడు.

వ. ఆ కోవెల యందు

సీ. అఖిల జగన్మాతయగు లక్ష్మి యలమేలు
మంగ రూపమున మెలంగి వామ
భాగంబునం దెడబాయకుండగ శంఖ
చక్రగదా పద్మసాధనములు
పరగ హస్తములందు భాసిల్ల ముందట
పన్నిద్దరాళ్వార్లు భక్తితోడ
గొలువగా నెదురుగా కూర్మితోడ ఖగేంద్రు
డంజలి హస్తుడై యమరియుండ
కనక కోటీర కేయూర కంకణాది
భూషణంబులు ధరియించి పొంకముగను
అరయ వెల్లూరి దేవాలయమున నిలిచె
శాశ్వతంబుగ శ్రీ వేంకటేశ్వరుండు.

వ. ఈ విధంబున వివసించి యందు వితోృత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవంబు లంగనా సహితుండై యానందవారధి నోలాడె (గ్రంథపాతము)

ఈ రంగప్ప నరసింగకవి వంశమునకు చెందినవాడేయని తెలియునుగాని ఎన్ని తరముల పూర్వుడో అతనికి ఈ కవికిగల సంబంధ మెట్టిదో తెలిసిరాలేదు. నరసింగకవి తమ పూర్వుడు స్థాపించిన వెంకటేశ్వరుని అంకితముగా భర్తృహరి సుభాషితములను కందములుగా నాంధ్రీకరించెను. వానిని కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు క్రీ.శ. 1931 యందు ప్రకటించిన శతక సముచ్చయ మందలి ప్రథమ భాగమున 289 పద్యములు కనిపించినవని శ్రీ ఎమ్. సదాశివరావుగారు తెలిపిరి. వాని నామాంకిత పద్య మిట్లున్నది.

కం. ధర భర్తృహరి కృతంబై
బరగిన శ్లోకములు కంద పద్యంబులుగా
నరసింగకవి రచించెను
నరుదుగ వెల్లూరి వెంకటాచల రమణా

తరిగొండ వెంకమాంబపై పరిశోధన చేసిన శ్రీ కె. జె. కృష్ణమూర్తిగారు ఎలకూచి బాలసరస్వతి వాడిన పదముల బిగువుకంటె నరసింగయ్యవే ఎంతో గొప్పగా ఉన్నవని శ్లాఘించినట్లు సదాశివరావుగారే తెలిపిరి.

శతక కవుల చరిత్రయందు [1] భర్తృహరి సుభాషితములు వెల్లాల నరసింగయ్య ఆంధ్రీకరించినట్లు చెప్పబడినది. వానికి వెల్లూరి వెంకటాచల రమణా అను మకుటమున్నది. కాని వెల్లాల వంశము కవి పండిత వంశమైనప్పటికి ఆ వంశమున ఈ పేరు గలవారు లేరు. వెల్లూరు లేఖక ప్రమాదమున ఎటులో వెల్లాలమైనది.

వెల్లూరును రాజా వెంకటలక్ష్మణరావుగా రేలుచుండగా వారిపై మగతల సుండి (నేటి మక్తల్) నాగన గౌడు దండెత్తెను. అపుడు రాజావా రతని నోడించెను. ఈ విజయము హోసదుర్గము కృష్ణమాచార్యుల వారి నృసింహవిలాసమున.

పరిహృత్య నాగబంధం
లక్ష్మణరాయ న్ప రామ ఏష విభుః

1. రచన వంగూరి సుబ్బారావు అనుబంధము పుట 795.

రురుచే లంకా పురుషాన్
సర్వాన్ నిర్ధూయ సకల బుధ వినుతః

అని మనోహరముగా వర్ణింపబడినది. ఈ విజయానంతరము లక్ష్మణ రావుగారు నేటి కొల్లాపురము కోటను గట్టించిరి. అంతవర కచట "కొలిముల పల్లె" యను గ్రామముండెను. లక్ష్మారాయని పూర్వు లొకరు ఒకప్పుడు కొల్హాపురి యాత్ర జేసిరి. అది నేడు మహారాష్ట్రమున నున్న లక్ష్మీ క్షేత్రము. వారచటి నుండి లక్ష్మీదేవిని గొనివచ్చి కొలిములపల్లె సమీపమందలి గుట్టపై ప్రతిష్ఠించు కొనిరి. కోట గట్టిన పిమ్మట లక్ష్మారాయ దచటవెలసిన గ్రామమున కాదేవి పేర చిహ్నముగా కొల్లాపురమని నామకరణము జేసెను. ఈ ప్రభువులు కూడ పింగ పట్టణ నృసింహస్వామి భక్తులు.

పింగపట్టణము సురభి వంశీయుడైన పింగమనాయని పేర వెలసిన గ్రామము. ప్రస్తుత మది కొల్లాపురము కోడేరు రోడ్డుపై నున్నది. అది నేడొక నృసింహక్షేత్రము. అచట సాలగ్రామ నృసింహప్రతిష్ఠ యున్నది. ఆ మూర్తి మున్నూరు వెంకయ్య అను వ్యక్తికి పొలము దున్నుకొనుచుండగా లభించి, అతని నావేశించి తాను నృసింహుడనని, ప్రతిష్ఠించి పూజించవలసినదని చెప్పు కొనెనట. అంత గ్రామస్థు లా స్వామికి చిన్న గుడిగట్టి పూజించుచుండగా చంద్రికా పరిణయకర్త యగు మాధవరాయ లా స్వామికి నేడున్న ఆలయము గట్టించి యుత్సవాదు లేర్పాటు జేయించెను.[1]

ఈ స్వామి కీ ప్రాంతమున పెక్కు భక్తులున్నారు. సముద్రాల వారను యింటి పేరుగల ప్రసిద్ధులైన వైష్ణవు లీ స్వామి భక్తులు. వారి పూర్వనివాసము నాగర్ కర్నూలు తాలూకాయందలి శ్రీపురము. మద్రాసునందు నేడు చలనచిత్ర

1. ఈ జిల్లాయందు "బొరిగడపల" యను మరియొక నృసింహక్షేత్ర మున్నది. బొరిగడుపులయ్య బొరి గడుపులరావు అనుపేర్లు గల వ్యక్తులు, బొరిగడపల అను యింటిపేరు గల వారీ ప్రాంతమున అక్కడక్కడనున్నారు. ఆ క్షేత్ర మును పేర్కొన్న కవులు గూడ నున్నారుగాని అది యింతవర కెచటనున్నదో తెలిసి రాలేదు. కొందరు పింగపట్టణమునే "బొరిగడపల" అని భావించు చున్నారట. నేడు పింగపట్టణమున బొరిగడపల బొరయ్య అను కర్నూలు నివాసి యగు వైశ్యుడు ఆ దేవాలయమున సత్రము గట్టించి నట్లొక శిలపై నున్నదట.

రంగమున స్థిరపడిన నముద్రాలవారీ స్వామి భక్తకోటిలోని వారు. హొసదుర్గం కృష్ణమాచార్యుల వారి నృసింహ విలాసకృతి ఈ స్వామిపైననే రచింపబడినది. వెల్లూరి నరసింగకవి ఈ స్వామికరుణా కటాక్షమున కవితాశక్తి నందినవాడు గనుక నృసింహ విలాసానంతరము మామిళ్ళపల్లి నృసింహుని కంకితముగా ఈ చూతపురీ విలాసము రచించెను.

నరసింగ కవిచేత ఈ రచన చేయించినవాడు తరణికంటి నరసారాయుడు. తరణికల్లు నేడు కలువకుర్తి తాలూకాలోని గ్రామము. పూర్వ మది గోదల పరగణాలోనిది. ప్రాచీనమైన గ్రామములం దొకటి. వర్ధమాన పురమును పాలించిన మల్యాలగుండయ యాస్థానమందలి శాసన కవులగు అభినవ మయూరసూరి కుటుంబ మీ గ్రామమునకు జెందినది. నేడా పండితుని వీరగల్లు వర్ధమానపురమున గ్రామము ముందు చింతల క్రింద నున్నది.

నరసారాయుడు రేచెర్ల పిల్లలమర్రి భేతాళనాయని వంశమునకు జెందినవాడు. వీరి యింటి పేరు సురభివారు. ఆ గ్రామపు టడుగు నేడు తెలకపల్లె సమీపమున కారువంగ, తాళ్ళపల్లె, నడిగడ్డ గ్రామముల నడుమ వ్యాపించియున్నది. భేతాళ నాయని వంశీయుడగు అనితి వతాల సింగమనాయనికి మాదానాయుడు అనపోత నాయుడు అనునిద్దరు కుమారులు గలిగిరి. వారియం దనపోతానాయుడు రాచకొండ నేలెను. అతనికి పెద్ద సింగమనాయుడు, ధర్మారాయడను విద్దరు కుమారులు గలిగిరి. పెద్ద సింగమనాయుడు తండ్రికి చేదోడువాదోడుగా నుండగా ధర్మారాయు డచటినుండి కదలి తమ రాజ్యమందలి గోదల పరగణాయం దొకకాలు మోపెను. దానితో క్రమముగా నతని వంశ మచట విస్తరించెను. అనంతర కాలమున నీశాఖ నుండియే వెలుగోడు, జటప్రోలు శాఖ లేర్పడెను. ఈ ధర్మారాయని కారవతర మున ఎఱ్ఱసూరానాయుడు జనించెను. అతని కుమారుడు మాదానాయకుడు గోద లను పాలించెను. ఇతని కుమారుడు కుమార మాధవరాయలు ఇతని కాలమున వీరికి విజయనగర పాలకుడగు నళియ రామరాజుగారిచే జటప్రోలు లిఖితపూర్వక ముగా లభించెను. ఈ మాధవ రాయలకు మల్లానాయడనియు వ్యవహారము. అతనికి పెద్దినాయుడు, మల్లినాయుడు, నాగినేడు, చిట్టినాగినేడు అను నలుగురు కుమారులు గలిగిరి. వారియందు పెద్దినాయుడు మిక్కిలి ధర్మాత్ముడు. నేడు మామిళ్ళపల్లి సమీపమునగల పెద్దాపుర మితనిపేర వెలసినది. అంతవర కచట రాజనగరమను పల్లె యుండెడిది. ఈ పెద్దినాయుడు గోదల పరగణా యందలి

లింగాల పెద్దపల్లి పట్టీలను తన తమ్ముల కప్పగించి తాను జటప్రోలు సీమకు వెళ్ళిపోయెను. అతని పిమ్మట మల్లినాయడు లింగాల పట్టికి, నాగినేడు పెద్దపల్లి పట్టికి వెళ్ళిపోయిరి. చిట్టినాగినేడు నిస్సంతుగా గతించెను.

పెద్దపల్లికి వెళ్ళిన నాగినేని వంశమున ఆరవతరమున మరియొక మల్లినాయడు పుట్టెను. అతనికి నరసన్న, మల్లన్న, తిమ్మన్న, అను సుతులు గలిగిరి. ఈ కాలమున వీరు గొలకొండ నవాబులకు తాము కట్టవలసిన పన్ను బాకీపడి వారి వృత్తిడికి గురికాగా జటప్రోలు ప్రభువు బారిగడుపులరావు వారి నాదుకొని కిస్తు చెల్లించెను ఈ తరువాత వారు తమ పట్టీలను పంచుకొని నరసన్న ఆలేరుపట్టికి, తిమ్మన్న తెలక పల్లె పట్టికి వెళ్ళిపోయిరి.

తెలకపల్లె గూడ ప్రాచీన గ్రామములం దొకటి. అది తెలకడను మాదిగవాని పేర వెలసెనట. నేటి తెలకపల్లె ప్రాంతము పూర్వము సురభివారి సేరీ భూమి. అక్కడన్నీ చింతలుండెను. ఆ చింతలలో నుండి శ్రీశైలమునకు వెళ్ళు పెద్ద రస్తా యొకటుండెను. ఆ దారిని రాత్రింబవళ్ళు హైదీయక జనము నడుచుచుండిరి. అటులుండ శ్రీశైల ప్రాంతమునుండి యొకప్పు డొక సాధువు వచ్చి యట నివసించెను. జనులతనిని "దాసు" అని పిలుచుచుండిరి అతడెల్లపుడు గుఱ్ఱము నెక్కి తిరుగుచుండెను ఒక చేత కమండలమును ఒక చేత కోదండమును ధరించుచుండెను ఆ కాలమున మహమ్మదీయుల దాడుల నెదుర్కొనుటకు పెక్కుమంది ఇట్టి ఆయుధములు ధరించుచుండిరి. క్రమముగా నతనికి భక్తులేర్పడిరి అట్టి వారిలో తెలక డొకడు అతడు నేటి తెలకపల్లె ప్రాంతమున దారి ప్రక్కగా నొక గుడిసె వేసుకొని నివసించెను క్రమముగా ఆ గురు శిష్యులు నివసించిన ప్రదేశములం దనుయాయులు చేరి గుడిసెలు వేసుకొనిరి. అంత అవి గ్రామములుగా రూపు దిద్దుకొని వారి పేరనే దాసు పల్లె తెలక పల్లె అని పిలువబడెను. తెలక పల్లెకు మొదట "తెలకని పేట" అని పేరుండెను. అచట నివసించిన దాసు అంతమున శివ సాయుజ్యమందెను అతని యీ వృత్తాంతమును దెలుపు వీరగల్లు నేడు తెలకపల్లెలో ఊరి వెలుపలగల శివాలయము ముందున్నది. నేడు తెలక పల్లెలో పెద్ద చెఱువున్నది. దానికి సోమిరెడ్డి చెఱువని ప్రాచీన వ్యవహారము. దాని పేరు క్రీ.శ. 1 17 నాటి సామిళ్ళపల్లి శాసనమున పేర్కొనబడినది. ఈ సోమిరెడ్డి పాపన్న పేట సంస్థాన ప్రభువుల మూల పురుషుడని చెప్పుదురు. పూర్వము నేటి యచ్చంపేట రమపతిపేట ప్రాంతములను గద్వాల ప్రభువుల

మూల పురుషుడగు తిమ్మారెడ్డి పాలించెనట.[1] ఇతని భార్యపేరు కేశమ్మ. నేటి కేశంపేట ఈమె పేరనే వెలసెనని చెప్పుదురు. ఈ ప్రాంతమందలి గ్రామ చరిత్రలు ద్రవ్వచుపోయిన యెడల యేకసూత్రమున గ్రథించలేని యిట్టి విషయము లెన్నియో బయలుపడుచుండును

తెలకపల్లె పట్టియందు తిమ్మనకు నలుబది గ్రామములు వచ్చెను. అనిచె గ్రామములందు వారి సేరీలుండెను. అతని పౌత్రుడు రెండవ తిమ్మన.[2] అతని దత్తు కృష్ణారాయడు ఫసిలి 1193 నందు గోలకొండ ప్రభువు సుల్తాన్ కుతుబ్‌షా వారు తరణి కంటిలోని వీరిసేరీ భూములు వీరికే యుంచి గ్రామమును రాజా నేమంతు వారికి జాగీరుగా నిచ్చినట్లు మామిళ్ళపల్లి భూముల సన్నదులను బట్టి తెలియును. ఈ కృష్ణా రాయని భార్య వెంకట లక్ష్మమ్మ దేశముఖినిగారు. వీరి కాలమున మామిళ్ళపల్లి మంచి దశ ననుభవించినది. వెంకట లక్ష్మమ్మ గారచట అంతవరకుండిన నంబిపూజారులను తొలగించి కుశ తర్పణము నుండి పరవస్తు శ్రీనివాసాచార్యులను శ్రీ వైష్ణవుని దెచ్చి యచట పూజారిగా నిలిపినది. అహోబలమును దర్శించి యపుడచటి పీఠాధిపతియగు శ్రీమాన్ పరాంకుశ రామానుజాచార్యుల శ్రీముఖముచే శ్రీనివాసాచార్యులచేత మామిళ్ళపల్లియందు తీర్థ పరిగ్రహోత్సవము జరిపించినది. వీరి దత్త పుత్రుడు నరసారాయడు. ఇతడే చూతపురీ విలాసమును వెల్లూరి నరసింగ కవిని పిలిపించి వ్రాయించెను. ఇతడెక్కువగా తరణికంటియందే నివసించుచుండెను గనుక జనులితనిని తరణి కంటి నరసారాయడనుచుండిరి. ఇతని వంశమును గూడ చివర నిచ్చితిని

చూతపురి యనగా మామిళ్ళపల్లి. ఈ ప్రాంతమున నిది పేరు చెందిన నృసింహక్షేత్రము పదునొకండవ శతాబ్దినుండి చరిత్రయందు దీని యునికి కనిపించును. ఇది దుందుభీ నదికి రెండు క్రోశముల దూరమున నుండును కనుక ప్రాచీనులు దీనిని దుందుభీ తీరస్థ క్షేత్రమని వ్యవహరించిరి. నేడిది యచ్చంపేట

1. ఆంధ్రవీరులు భాగము 2. పేజీ 161 శేషాద్రి రమణ కవులు.

2. జటప్రోలు శాఖయందు బారిగడుపులరావుగారి నుండి తెలకపల్లె శాఖయందు రెండవ తిమ్మనగారి నుండి వంశాభివృద్ధి ఆగిపోయినది. వారు వెలుగోడు శాఖనుండి వీరు పెద్దపల్లి శాఖనుండి జ్ఞాతి కుమారులను దత్తు తెచ్చుకొనసాగిరి.

తాలూకా యందు జిల్లా కేంద్రమగు పాలమూరునుండి యమరాబాద రోడ్డుపై గల రాకొండ గ్రామమున కై దకిలోమీటర్ల దూరమున నున్నది. ప్రస్తుత మిచటికి జినుకుంట దగ్గరినుండి బస్సుగూడ వెళ్ళి వచ్చుచున్నది.

ఈ గ్రామమునకు శాసనము లందు చూతఘోషపురము, చూతపోషపుర మని నామము లున్నవి. పూర్వమిది రాఘవయ్య యను నొక స్మార్తుని యగ్రహారపు భూమియని చెప్పుదురు. అందొక పెద్ద మామిడితోట యుండి. దానియందు రాఘవయ్య శ్యామలాదేవి భక్తుడై తన యిష్టదైవమును ప్రతిష్ఠించుకొని పూజించుకొను చుండెనట. అటులుండగా నాదేవి ప్రక్కనే యొక పెద్ద మామిడిచెట్టు క్రింద యొక పెద్ద కృష్ణశిలయుండగా నా ప్రక్క పొలమునుజేయు రైతొక పర్యాయ మా శిలను కదలింపబోగా నతనికి పైనిండి నేను నృసింహుడను నన్ను పూజింపుడని చెప్పుకొనెనట. ఇక నాటినుండి ఆ క్షేత్రాధిపతి శ్యామలాదేవితో పాటు నృసింహుని గూడ పూజింప మొదలుపెట్టెను. అంతవర కా తోటయందు దానిని పోషించు కొందరు గొల్లలు గుడిసెలు వేసుకొని యుండిరి. అచ్చట స్వామి వెలసిన తరువాత క్రమముగా నది గ్రామముగా మారి నేటి మామిళ్ళపల్లె యయ్యెను.

అనంతర కాలమున నిక నిచట నేడున్న యాలయము నెవరు గట్టించిరో అందలి స్వామి నెవ్వరు ప్రతిష్ఠించిరో తెలియదుగాని ఈ ప్రాంతమునగల గట్టు తుమ్మెన, రామగిరి, మామిళ్ళపల్లి ఆలయము లొకే ప్రభువు యేక కాలముననే గట్టించెనని ప్రాచీనులు జెప్పుకొనుచుండిరి.

మామిళ్ళపల్లి స్వామి నీ ప్రాంతమున పెక్కు ప్రభుకుటుంబములవారు గొలిచిరి. వారియందు మొదట జెప్పదగిన వారేరువ చోళులు. వారు మూడు తరములవరకు స్వామిని గొలిచిరి. ఆ తరువాత చెప్పదగిన ప్రసిద్ధులు సురభివారు. నరసారాయని భార్య వెంకమ్మదేశాయి గారు భర్త యనంతర మీ స్వామికి నేడున్న ప్రాకార గోపురములు గట్టించెను. వీరి దత్తపుత్రుడు రామారాయడు, అతని పత్ని జానాయిగారు. ఆమె వెంకమ్మగారి పిమ్మట పెత్తనమునకు వచ్చి తమ మామగారు రచింపించిన ఈకృతిని రాకొండ నివాసియగు దరూరి లక్ష్మణాచార్యుల వారిచేత పరిశీలింపజేసెను.

రాకొండ ఈ ప్రాంతమున గల మరియొక ప్రాచీన గ్రామము. అచటగల కుంటల పేర్లుగూడ మామిళ్ళపల్లి శాసనమున పేర్కొనబడినవి. ఈ ప్రాంతము

నకు పర్వతాపురము, రాకొండ ఈ రెండు గ్రామములు శిలాక్షేత్రములు. పర్వతాపురమందలి రాయి, త్రాచురాయి. రాకొండరాయి జెట్టిపోతురాయియని వడ్డెరులు జెప్పుదురు. నేటికి తెలకపల్లె యందలి యిండ్లకు పర్వతాపురము రాయియే శరణ్యముగా నున్నది. రాకొండయం దొక పెద్దరాతికొండ యున్నది. దానిపై చోళుల నాటి యాలయమున్నది. అది మొదట లక్ష్మీనారాయణాలయమని చెప్పుదురు. గ్రామ మీ గుట్ట సమీపమున నుండుటచేత కాబోలు దాని నా కొండపేరుననే "రాకొండ" యని పిలిచిరి. ఆ గ్రామము పూర్వము జటప్రోలు సంస్థానమునకు జెంది యుండెను.

రాకొండ లక్ష్మణాచార్యుల వంశీయులు గున్న సీతారామరెడ్డిగారి కాలమున బాలానగరమునుండి వైద్యముపై వచ్చి స్థిరపడిరి. వారి పూర్తియింటి పేరు కిడాంబి దరూరివారు. వారు ఆత్రేయ సగోత్రులు. లక్ష్మణాచార్యుల తండ్రిగారి పేరు కస్తూరి రంగాచార్యులు. వారికి లక్ష్మణాచార్యులు తిరువెంగళాచార్యులు అను విద్దరు కుమారులు గలిగిరి. ఈ సోదరులిద్దరును కవులు. లక్ష్మణాచార్యు లీ కృతిని పరిశీలించి దానికి పీఠికా ప్రాయముగా నీ క్రింది విషయమును వ్రాసిరి.

## సీసార్థాలు

1. శ్రీమించు గోల్కొండ సీమలో నాగర
   కర్నూలు తాలూక గలదు, నందు
   తెలకపల్లీ పురం బిలను సత్కీర్తిచే
   చెన్నొందుచుండు మహోన్నతముగ
   ఆ పురియందు సౌధాగ్రంబు లంబర
   చుంబితంబై యొప్పు చోద్యముగను
   ఏ తట్టు జూచిన వింపొందు వీధులు - ఎంతో శృంగారముగను
   గన్పట్టు సరిరా దేపురమైనగాని - పంతాముతో నైన
   ఫణి పాతికైనాను, గో
   రంతవర్ణన జేయనలవి యౌనె తత్పుర - మెంతో శృంగారముగను

2. మరియు నప్పురమందు సురభి వంశోత్తముల్
   రేచర్ల గోత్రాబ్ధి రేవిభులును

రహిమీరగా ధరారమణులలో హరి
శ్చంద్రుని మాడ్కి-ని జెలగిరపుడు
సకల యాచక జనాళా పూర్తికిని కల్ప
తరువు చందమున నిద్ధరణీ వెలసి
రట్టి వంశంబున నతివ జానమ్మగా-రనెడు దేశాయిగారూ
కీర్తిల్లిరీ కైంకర్య సన్మనోవిచారీ
వనజాక్షుపైపై భక్తి వదలాక విప్రనారా
యణ చారితంబు నాటక
మను ప్రకటనము నొనరించెదనని
మనమూన సంకల్పించేను-జీర్ణోద్ధరణ
మును జేతునని పూనెను.

3. శ్రీమదిత్యాది భాసిత బిరుదాంకితుం
డును దరూరి కులాబ్ధి జనిత సోము
డాత్రేయ గోత్రజుండగు లక్ష్మణాచార్య
కవివరునను బిల్చి కడుముదమున
శ్రీరామచంద్రుని శ్రీ కటాక్షంబుచే
బిల్హణీయం బతులిత నాట
కము జేసితిరిగాన కడువేడ్క- మిము బిలి
పించితి మిపుడింపుగా-ఒక వార్త విని
పించేదా, కడు సొంపుగా

అంచితముగ నరసరాయక్షితీంద్రు
డంచితముగ విప్రనారాయణ నాటకంబూను, జె
ప్పించె మును ముదము జనించి, యెంచిచూచి, యో
చించి పరిశీలించవలెనంచు-పిలిపించితి-మిపుడింపుగా.

ద్విపద : ఆదిగాన నీ గ్రంథమందునే వైన
విదిత దోషములు భావింపగా నుండ
వచ్చును మీరు సద్భావంబు చేత
మచ్చికతో జూచి మాన్యత కెక్కు-

దరువులు పద్యముల్ దగ దాని యందు
సరసంబుతో గూర్చి సద్బిల్హణీయ
మను గూర్చినట్టు లిమ్ముగ దీనిజేయు
దని జెప్ప తాంబూల మా గ్రంథమీయ
గను దాని జూచి సక్రమముగ జేసి
మునుపె శ్రీ మామిళ్ళపురి శౌరి కర్పి
తముగ నుండుటచేత తగ మోద మంది
తమర శ్రీ నృహరికై యర్పించి యుంట.

ఈయన దీనిని సక్రమముగ జేసితినని చెప్పెనుగాని అట్టిదేది యిందు గనిపించదు. ఇతని కృతి బిల్హణీయము సింగరాచార్యుని కృతిలోని పద్యములకు నడుమనడుమ దరువులు రచించుచు కూర్చిన యక్షగానము. ఇటులే కృష్ణలీలా తరంగిణీ యను మరియొక దానిని పోతనగారి పద్యములకు నడుమ నడుమ దరువులు గూర్చుచు సంధానించెను. ఇవిగాక ప్రద్యుమ్నోపాఖ్యానము, పరకాల విజయము అనునవి స్వతంత్రరచనలు. కవిగారు బిల్హణీయమును తన కభిమాన రచనగా జెప్పుకొనెను గాని యది యతనికి పేరు దెచ్చునంతటి ప్రతిష్ఠ రచనగాదు. రచించిన వానియందు పరకాల విజయము కొంత మెరుగు. ఏది యెట్లున్నను ఈయన రచన నరసింగకవి రచనకు తీసికట్టుగాని ఆనాడు జానమ్మగారు వీరి కీకృతి పరిశీలనకై యిచ్చుట వారిపైగల గౌరవముచేత గావచ్చును. దీనినేగాక ఈయన అచ్చంపేట నివాసియగు పర్వతాపురము భోగము బలరాములు రచించిన యయాతి చరిత్రమను యక్షగానమునుగూడ సరి చూచెను. సదరు కవిగారి కృతులు కలువకుర్తి నారాయణాధ్వరి గారు సరిచూచిరి.

లక్ష్మణాచార్యులవారీ కృతిని సంస్కరించకున్నను దాని వింత కాలము తమ యింట భద్రపరచి నందులకు మనము వారి నభినందింపవలెను. దీని మూలమైన తాళ ప్రతి విరోధినామ సంవత్సర ఆషాఢ బహుళ త్రయోదశి వరకు వ్రాయనైనది అని గ్రంథాంతమున వ్రాయబడినదిగాన కాల చక్రమున నీ విరోధి యెప్పటిదో!

ఈ ప్రతి లేఖక ప్రమాద భూయిష్ఠముగా నున్నది గనుక కవిగారి హస్త మాతృక యనలేము. ఈ ప్రతి నాకు పురాతన గ్రంథాన్వేషణయందు క్రీ. శ.

1971 యందు రాకొండలో లక్ష్మణాచార్యుల వారి కుమారుడు కృష్ణమాచార్యుల యింట లభించినది. నేనచటనే దానిని కొంత పరిశీలించి రచన చక్కగా కనిపించుటచే వింటికి తెచ్చుకొని 12-3-1971 నాటికి యథాతథముగా నకలు వ్రాసికొని మూలప్రతి మరల వారి కిచ్చివేసితిని. తరువాత దానిని 79యందు పునఃపరిశీలించి సంస్కరించు కొనుచు 17-1-1979నాటికి మరియొక ప్రతిని వ్రాసికొంటిని. దానిని 9-6-1980 నాడు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి పంపుకొనగా వారి యామోదమును పొంది యిపు డీ రూపమున నీ కృతి మీ చేతులలోనికి వచ్చినది.

## సంఘమున యక్షగానమున స్థానము

ఇది దేశిరచన. రామాయణ భారతముల పిమ్మట సామాన్య ప్రజలందు మన సంస్కృతిని లోపింపకుండ నిలిపిన కీర్తి ప్రౌఢమైన వసుచరిత్రాది ప్రబంధములకంటె యక్షగానములకు హరికథలకే యెక్కువ దక్కవలసి యున్నది. తంజావూరు యుగమునందువలె తెలంగాణము మహమ్మదీయుల పాలనయందు క్రుగ్గుకాలమున నిచట సామాన్యజనుల నుద్దేశించి యక్షగాన రచన హరికథా రచన విరివిగా సాగినది.

పాలమూరు జిల్లాకు సంస్థానముల జిల్లాయని వాడుక. తెలంగాణమందలి సంస్థానములు చాలావర కీ జిల్లాయందుండి యిచట శిష్టసాహిత్య సృష్టి చెప్పదగినట్లుగనే జరిగినది. అయిన కవులు కేవలము పండితులను మాత్రమే దృష్టియందుంచుకొని పామరులను విస్మరింపలేదు. వారికి కావలసిన హరికథలను, యక్షగానములను, భజనకీర్తలను గూడ మిక్కిలిగనే రచించిరి.

నా గోలు సీమ (నాగర్‌కర్నూలు తాలుక) యందు పేరు చెందిన వట్టెము పాపకవి 4. యక్షగానములు, 2. హరి కథలు, అచ్చంపేట బంగారుశాస్త్రి గారు సరసమైన శైలియందు 12 యక్షగానములు, వంగూరు లక్ష్మణాచార్యులు 12 యక్షగానములు, సుమారు 75. హరికథలు, మంగునూరు నివాసులైన దొడ్డవరము రామలక్ష్మణులు 10 యక్షగానములు, వెల్లగొండ జ్ఞానదేవుగారు 6 నాటకములు 3. హరికథలు, గంగవరం నరసింహాచార్యులు 12 నాటకములు రచించిరి.

పూర్వ మీ ప్రాంతమున యక్షగానమేళములు ఎక్కువగానే యుండెను. వాని నగ్రజాతులవారు గూడ ప్రదర్శించుచుండిరి. ఒక్కొక్క మేళమునకు సంగీత సాహిత్యము లెరిగిన యొక్కొక్క కవియుండెను. ఆ కాలమున వేశ్యలు గూడ నీ మేళములు గట్టుచుండిరి. వెలిదండ ప్రాంతమున "బొల్లంపల్లి బుద్ధకాళమ్మ" అను నామె మేళమొకటి యుండెను. దానికి తెలకపల్లె రామలింగమను స్మార్తుడు "సముద్ర మథనము" కృష్ణలీలలు, దేవయాన కథ అను యక్షగానములు గూర్చి యిచ్చెను. ఆయన కౌశికసగోత్రుడు. ఆ యక్షగానములందు మొదటి రెండింటి యందు పోతనగారి పద్యములకు, చివరి దానియందు నన్నయగారి పద్యములకు నడుమ నడుమ దరువులు గూర్చి యక్షగాన రూప మిచ్చియుండెను. ప్రదర్శన కొఱకు వానిని కాళమ్మ మేళమునకు వెలిదండ చిన్న నరసయ్య వ్రాసి యిచ్చెను. నరసింగ కవి దీనియందు సముద్ర మథన కథను రామలింగయ్య వలెనే శుక మహర్షి పరీక్షిత్తునకు జెప్పినట్లు ప్రవేశపెట్టుట, రాకొండ లక్ష్మణాచార్యులు బిల్హణీయ, కృష్ణలీలా తరంగిణి యక్షగానములను బిల్హణీయ, భాగవత పద్యములు గ్రహించి కూర్చుట జూడగా వారిపై నితని ప్రభావము గలదనవచ్చును. గత శతాబ్దమున నచ్చంపేట యందు తారామతి యను నట్టువకత్తె యుండెను. ఆమె మేళము గూడ ప్రసిద్ధి కెక్కినది. బంగారు శాస్త్రిగారు తమ యక్షగానములా మేళము కొరకే వ్రాసిరి. అంతేగాక ఆయన అపుడపు డందు నాయికాపాత్రను గూడ ధరించుచుండెనని, వారి స్త్రీ పాత్ర పురుషులను గూడ నిభ్రమ పరచుచుండెనని జెప్పుదురు. పీరచ్చంపేట నరసింగయ్య శాస్త్రిగారికి కవితా గురువు. తాటికొండ ప్రాంతమున మరియొక మేళముండెను. దొడ్డవరము వారు తమ యక్షగానములను వారికొఱకే వ్రాయుటగాక, వానికి సూత్ర ధారత్వము వహించి యందు పాత్రధారణ గూడ జేయుచుండిరి. మా చిన్నతనమున నీ ప్రాంతమందలి యక్షగానపు జట్టులలో వెన్నచర్లవారు సాత్వికాభినయమునకు, రాకొండవారు వాచికాభినయమునకు మాయూరివారు (జినుకుంట) ఆహార్యమునకు పేరు జెందియుండిరి. ఇటు లీ ప్రాంతమున యక్షగానములకు పెద్ద చరిత్ర యున్నది.

ఆనా డీ ప్రదర్శనలు రచ్చకట్ట చెంతనో దొరగారి దేవిడీ ముందో జరిగెడివి. ప్రదర్శకులు నాలుగు గడలు పాతి వానిపై చాందినీ వంటిది గట్టుకొని ముందు గడలకొక తెర వ్రేలాడ దీసి. ప్రదర్శనకు రెండు వైపులందు సంక్రాంతి దీపకంబములందు పెద్ద పెద్ద దీపములు వెలిగించుకొని తమ ప్రదర్శన నిర్వహించు

చుండిరి. దానికెవరో ఒక కళా పోషకుడు చమురు ఖర్చు భరించగా మరియొకదాత తెల్లవారిన పిమ్మట వారికి పదియో పరకనో యిచ్చుచుండెను. ప్రదర్శన విషయము తెలియగనే గ్రామస్థులందరు దీపారాధన కాగనే యచటికి వెళ్ళి చాపలు పరుచుకొని తమ తమ స్థలము కాపాడుకొనుచుండిరి. ఆట ఏ తొమ్మిది ప్రాంతముననో ఆరంభమయ్యేదిది. అప్పటివారు విమ్మళముగా భోజనములు ముగించుకొని వచ్చి తమ తమ చాపలపై గూర్చుని పైసా ఖర్చు లేకుండ తెల్లవారు వరకు ప్రదర్శన జూచుచుండిరి. గ్రామాధికారులు హంగుదారులు మద్దెల వగైరా శృతి చేసికొని బాలకృష్ణ వేషం వచ్చి వెళ్ళిన తరువాతగాని వచ్చేది వారు గాదు. అది యక్ష గానమునకు నాంది వంటిది. ఒక్కొక్కపుడు రంగముపైకి రావలసిన పాత్ర గ్రామాధికారుల రాకకై నిరీక్షణము జేయుచు తెర వెనకనే నిలిచిపోవుచుండెను మొత్తముపై ఆనాటి ప్రదర్శనలు రక్తిగనే సాగుచుండెను.

## వనమాలికామోదము

ఇది ప్రకరణ సదృశమైన యాతివృత్తము. ఇందలి కథా నాయకుడు విప్రుడు మరియు భక్తుడు. నాయిక స్వాత్మ ప్రత్యయము, స్త్రీత్వాభిమానముగల వేశ్య. అంతియేగాక ఆమె అనురక్త గూడ. కావ్య లక్షణములందు స్వీయతోపా టన్య సామాన్యలకు గూడ స్థానమున్నను తంజావూరు యుగమువరకు అహల్య తారవంటి యన్యోఢలు ప్రబంధ ప్రపంచమున కాలుబెట్టలేదు. ఇక వేశ్యలు సంస్కృత సాహిత్యమున భాణ ప్రహసనములకే పరిమితమై యున్నను మాలతి వసంతసేన వంటి గౌరవనీయులు గూడ నా సాహిత్యమున క్వాచిత్కముగ గనిపింతురు. ఆంధ్ర సాహిత్యమున దేవదేవి యాకోవకు చెందును.

ఈ కథా నాయకుడు వనమాలాంశ జనితుడు గనుక దాని గుణమగు జారు పాటు, భక్తాంఘ్రి రేణువు గనుక రేణు లక్షణమగు రజోగుణదోష మితని కాజన్మసిద్ధ ముగుమనే వచ్చినవి. ఇతడొక ధనుర్మాస మందలి జ్యేష్ఠా నక్షత్రమున జనించెను. ఆ నక్షత్రమున బుట్టినవాడు శ్రమకోర్చువాడు. సత్యమునకు భయపడు వాడు. కామాధిక్యత గలవాడు, జాగరూకతతో సంచరించు వాడగునని నక్షత్ర ఫలము జెప్పును. ఆ లక్షణములన్నితనియందు సంపూర్ణముగా నున్నవి. అంతియే గాక కోదండమాస సంజాతుడు గనుక,

రసికులైనవారు రమణుల కొకవేళ
వంగుచుంట ధర్మవర్తనంబు
ఈ రసమున విల్లు నారికి వంగదా !—

అను సహజ పండితుని సూక్తి యతని యెడ నిజమైనది. ఈశ్వరుడు దప్ప లోకమున నెవడును పూర్ణపురుషుడు గాడు గనుక పొరపాటు మానవ నైజము. అయిన జ్ఞానియైన వాడది యెరిగి దిద్దుకొనును. మూర్ఖు డందే మునిగి తేలుచుండును. మానవునకుండు అరిషడ్వర్గములందు కామము మొదటిది. తన్మూలకమైన గ్రామ్యధర్మము షడూర్ములందు నాల్గవది కనుక దాని నరికట్టుట దుస్సాధ్యము. అందులకు వ్యాసజైమిన్యాదులే సాక్షి. "బల వా నింద్రియ గ్రామో విద్వాంస మపికర్షతి" అని గదా! మన్వాదు లీ తత్వమును బాగుగా తరచి చూచిరి. గనుకనే మానవ జాతికి గృహస్థ ధర్మమును విధించిరి. దాని నుపేక్షించి సన్యాసమునకు వెళ్ళువారి సంగతి వేరుగాని యది పరిత్యజించినపు డతని పురుషార్థము లందొకటి లోపించినటులే లెక్క. స్త్రీ సాహచర్యము లేకున్న పురుషునకు పూర్ణత్వము లేకుండుటగూడ ప్రకృతి ధర్మముగా గనిపించును. ఈ సత్యమునే శివ పార్వతు లేకశరీరులై లోకమునకు బోధించిరి. కనుక దానిని త్రోపి రాజని తార్తీయ పురుషార్థమునకు కారణమైన సౌత్రామణి యజ్ఞకవాటమును బంధించి నపుడు మహర్షుల జీవితములందు కామము దొడ్డిదారిని ప్రవేశించి వారిని వ్రత భ్రష్టుల జేయుట గనిపించును. ఇచట విప్రనారాయణుని జీవితమున నదియే జరిగినది.

కళంక మెవరికైనను కళంకమే యైనను కొందరి కది పెండ్లినాటి బుగ్గపై చుక్కవలె శోభించును. మరి కొందరికి ముక్కుపై యంటిన మసివలె వెక్కిరింప జేయును. కొందరి జీవితమున మాసిపోవును. కొందరి జీవితమున స్థిరపడి పోవును. మరికొందరి జీవితమున "ఏకోహి దోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అని కాళిదాసు చెప్పినట్లు మరుగుపడి పోవును.

ఇచట పరమ భక్తుడైన విప్రనారాయణుని జీవితమున దేవదేవిసంపర్కము హైన్యము నాపాదింపలేదు, సరిగదా నారాయణుని కంఠమున వైజయంతీ మాలవలె ప్రకాశించి, పురుషునకు స్త్రీ సాహచర్యము మెడలొ పూదండవంటిదేగాని గుదిబండవంటిది గాదని భక్తునకు కామబంధము ప్రతిబంధకమేమియుగాదని వస్తు

రూపమున ధ్వనించుచున్నది. అతడు నారాయణుడు. ఆమె దేవదేవి. వారి ప్రణయము లక్ష్మీనారాయణుల ప్రణయమువంటిదేగాని యన్యము గాదనుట కాపేరులే యొక సాక్ష్యము. లక్ష్మీదేవి స్వయంవర వేళ తనను వలచి వచ్చిన దేవ పుంగవులెందరో యుండగ, తనవైపు కన్నైన యెత్తిచూడక శేష తల్పమున యోగ నిద్రా ముద్రితుడై యున్న నారాయణుని జేరి యతని మెడయందు వరమాల వైచెనట. అటులే ఈ దేవదేవి గూడ దినదినము తనను వలచి వచ్చు వారెందరో యుండగా వారి నందరినిగాదని తనవైపు కన్నైనా యెత్తి చూడని యతనిపై ప్రతిజ్ఞ పట్టుటయేమి? అతనిని వలపించి తన జీవితమును చరితార్థము జేసికొనుట యేమి?

వైకుంఠమున లక్ష్మీనారాయణుల ప్రణయమునకు విరజానది భూలోకమున కావేరీ నది సాక్షులు. మన ప్రాచీనులకే వియమమునకైనను సూర్యచంద్రులు పంచ భూతములు తప్ప మానవమాత్రులు సాక్షులుగారు. ఆనాటి వారపు పత్రములు గూడ సూర్యచంద్రుల సాక్షిగ నవియే వ్రాసికొనుచుండిరి. అట్టి వానిని నేను జూచితిని. పూర్వులకు ప్రకృతి శక్తులపైగల నమ్మకమట్టిది. అందుచేతనే గాబోలు భవభూతి యుత్తర రామ చరితమున సీతారాముల ప్రణయమునకు సాక్షులనుగా వాసంతీ తమసలను సృజించెను. ఆ సంప్రదాయము ననుసరించియే మీ కథయందు వారికి ప్రణయ సంధానకర్తగా, సాక్షిగా కవులు కావేరీ పాత్రను ప్రవేశపెట్టి యుందురు.

ఈ కథయందు శ్రీలు ప్రయత్నించిన యెంతటి [illegible] సంపన్నుడైనను కరగకపోదను దేవదేవి వలన, తనకెంతటి భక్తి [illegible]కి దేవదేవిచే యేకాంత పావనమువంటి [illegible] సమయములందరి [illegible] పాడలేకపోయినదే? భాగవతులైనవారైన అపుడు నా కండగా నున్న నన్ని [illegible] కుండ కాపాడి యుందురేయని సజ్జన సాంగత్యమును గురించి యావేదన బడిన విప్రనారాయణుని వలన బాహ్య జగత్తునకు స్థూలముగా ప్రయత్నాధీనమని కనిపించినను పారమార్థిక దృష్టితో జూచిన మొదట వ్యక్తికేది జరిగినను అతడు నిమిత్తమాత్రుడే. అది యంతయు భగవంతుని లీలయే. ఇచట దేవదేవి ప్రజ్ఞగాని విప్రనారాయణుని యసమర్థతగానిలేదు. అందుచేత నీ సత్యము నావిష్కరించుటకే కావ్యకారులు కథాంతమున శ్రీమన్నారాయణునిచే లక్ష్మీదేవికి తానే విప్రనారాయణుని దేవదేవికి పలువిగా జేసినట్లు జెప్పించిరి.

కామినీ కాంచనములు లోకమున పురుషుని నిగ్రహమును పరీక్షించుటకు భగవంతుడేర్పరచిన పరీక్షలు. అవి సక్రమ మార్గమున నుపయోగపడినపుడు కర్త యున్నత పదము నందుకొనును. లేకున్న పతితుడగును.

లోకమున ముక్తికి రెండు మార్గములున్నవి. ఒకటి మనస్సును నిగ్రహించుట. రెండవది దానిని భగవదాయత్తము చేయుట, వీనియందు భక్తిమార్గము రెండవదానినే జెప్పును. కేవలము మనస్సేగాదు. కామాది మనోవికారమేది యైనను భగవదాయత్తమైనపుడది ముక్తిదాయకమేనని భాగవతము మతము. ఈ రహస్యమును నారదుడు ధర్మజునితో

> ''కామోత్కంఠత గోపికల్ భయమునన్ కంసుండు వైరక్రియా
> సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులున్,
> ప్రేమన్ మీరలు భక్తినే మునిదె చక్రింగంటి మెట్లైన,ను
> ద్దామ ధ్యాన గరిష్ఠతన్ హరిని జెందెన్ వచ్చు నుర్వీశ్వరా!''
>
> భాగవతము 7 - 18

అని చెప్పెను. గీతయందు శ్రీకృష్ణ పరమాత్మ.

> ''అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
> తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం''

అని చెప్పెనుగదా! ఇక ఈ కథయందలి నాయకు డట్టివాడే ఇతర చింతలన్ని విడిచి కేవలము రంగని నమ్మినవాడు. అట్టి తరియైనడు దేవదేవి మూలమున కామార్తుడయ్యెను ఆయార్తి పరాకాష్ఠనందెను. అది ప్రాణములు తోడివేయునట్లుండెను. గీతయందు శ్రీకృష్ణుడు తనను జేరువారిని జెప్పుచు ''ఆర్తోజిజ్ఞా సురర్థార్థీ జ్ఞానీచ. భరతర్షభ'' అని యార్తునకే ప్రథమస్థాన మిచ్చెను గనుక నిపుడీ భక్తునియార్తిని దీర్చవలసిన భారము తనపై బడెను. నిజమైన యార్తితో పిలిచిన యెడల భగవంతుడు పలుకునని యీ యుగము వాడైన వివేకానందుడు జెప్పెను గదా! ఇక మాహాత్మ్యములకు నిలయమైన ప్రాచీన కాలమును గురించి సందేహమేమి?

అందులకు కావలసినదెల్ల హృదయమున నిజమైన యార్తి. అట్టి యార్తితో ''లావొక్కింతయు లేదు'' అని మొరపెట్టిన గజరాజును రక్షించలేదా! ద్రౌపదికి

వలువ లీయలేదా? ఆ దృష్టితో జూచినపు డిక విప్రనారాయణునికై వేశ్యమాతకు బంగరుగిన్నె యిచ్చుటకుగాని, పరకాలుని కొరకు ధనవంతుని వేషమున వచ్చుటకు గాని, రామదాసును విడిపించుటకు తానీషాకు డబ్బు చెల్లించుటకు గాని సంభవమే గదా!

ఎమెస్కో వారి వైజయంతీ విలాసమునకు ప్రవేశికను రచించుచు స్వామి శివశంకరుల వారీ కథాసందేశము నిటు లుద్ఘాటించిరి.

లోకమున కవికి వేశ్యాసంగమము సంభవించునను నానుడి యున్నది. అది యాతివిపట్ల పూర్ణముగా వర్తించినది. విప్రనారాయణుడు దోషిగాడు. దుష్టులకు దూరముగా నుండి ఏ విధమగు చాంచల్యము లేక భగవత్సేవలో జీవితము గడుపు నమాయకుడగు నీ బ్రహ్మచారి లోకము నెరుగక మోసపోయినాడు. అది సహజమే. దేవదేవి సామాన్య వనిత యగుటగూడ కొంతవర కీతని జారుపాటుకు కారణమైనది. తెలిసిగాని తెలియకగాని చేసినను కర్మము ననుభవింపక తప్పదు. కావున నతనికి పరిభవము దప్పలేదు. పశ్చాత్తాపము వలన పాపము దొలగునను ధర్మసూత్రప్రకార మితడు నిర్మలుడైనాడు. జీవితమున పెద్ద గండము దప్పిన పిదప మానవంతులగువారు సామాన్య విషయముల విడనాడి యుదాత్త చరిత్రలకై యుద్యమింతురు. విప్రనారాయణు డిందులకు తార్కాణము.

ప్రపంచ జ్ఞానమునకు దూరముగా నున్నచో ప్రమాదముల కవకాశమున్నది. అందుచే లోకవృత్తమును గ్రహించుట మేలు. ఎవ్వి తీయని మాటలు జెప్పినను దుష్టులను దూరముంచినచో దోషారోపణ కవకాశ ముండదు. చతురాశ్రమములు చక్కగా నడుచునపుడు మానవునకు జీవితమున జారుపాటున కవకాశము తక్కువ.

విప్రనారాయణుని చరిత్రనుబట్టి చూచినచో మానవుడు- అందును సాధకుడు భ్రష్టుడైపోవుట ప్రధానము గాదు. పురాణ వాఙ్మయమున తపోధను డెవ్వడైనను ఘోరముగా తపస్సు జేయునపు డింద్రునకు బెదురుబుట్టును. అత డా తపస్వి ప్రతిభను నడలించుటకై తన పరివారములోని యచ్చర నొకదానిని బంపి భ్రష్టుని జేయుమని కోరుచుండును. జితేంద్రియులను చెడగొట్టుట- లోకమున- అనూచాన విధముగా గానవచ్చుచున్నది.

విప్రనారాయణుడు భక్తుడేగాని మహాసాధకుడు గాడు. అయినను బహుకాలమున కంగనా సాహచర్యమున జావయయినాడు. ఇందు మానదర్పితయైన

ఒక సామాన్య విష్కారణముగా ప్రతిజ్ఞచేసి తమ దీనావస్థకు లోనై చచ్చి చెడి తుదకొక విధమైన విజయము గాంచినది. అదియేపాటి విజయము? దేహాభిమానము నివేదన జేయుటచే కలిగిన తాత్కాలిక జయము. ఈ స్థితిలో సాధకుని లేక భక్తుని జీవితములో మలుపు తిరుగని పక్షమున నతడు మరింత భ్రష్టుడగును. అట్టియెడ యేదో ప్రోద్బలము- ప్రధానముగా దైవికమైనది- వాని యుద్ధరణకై యుద్భూతమగును. పారమేశ్వరకమగు నా ప్రభావము జైవమాంద్యమును ఛిన్నాభిన్నము గావించి వ్యక్తి నుద్ధరించును. తత్పూర్వమే జీవికి ఆవేదన, ఆక్రోశము, భగవద్గుణానుసంధానము మొదలగు క్రియావిశేషములు రేకెత్తును. అనంతర మాత్మోద్ధరణ జరుగును. ఈ సత్యమును వివరించుటకే మీకావ్యము గల్పింపబడి నట్లు దోచును.

ఇందు భగనంతుడు నభలో సాక్షాత్కరించుటకన్న స్వప్న సందర్శన మిచ్చి సత్యము బోధించుట శ్లాఘ్యమని, సహజమని కొందరందురు కాని భగవల్లీలా విలాసమున నీ నాటకము జరుగుచున్నపు డతడు ప్రత్యక్షమైనాడన్న నేమి? స్వప్నగతుడైనా డన్నచో చాలావరకది సంభావ్య శ్రేణిలోని సంఘటనగా దోచవచ్చును గనుక ప్రత్యక్షమగుటయే యద్భుత రసపోషకముగా నుండును.

## ఆళ్వారు లెప్పటివారు?

శూరుల జన్మంబు, ఏఱుల జన్మంబు నెఱుగనగునే? అని నన్నయగారు చెప్పియుండిరి. శూరులవలెనే మహాపురుషులు గూడ పూర్వులు. వారెంత ప్రాచీనులైన మహత్త్వమంత పెరుగునని వెనుకకు లాగజూడ నవీనులెంత ఆధునికులైనంతగా లోకమునకు సన్నిహితులగుదురని ముందునకు లాగజూతురు. గనుక వైష్ణవ వాఙ్మయమున యాళ్వారుల సమయ నిర్ణయమొక సుపరిష్కారము లేని సమస్య.

ఈ కృతికర్త పొయిఘ, పూదత్త, పేయాళ్వారులు కృతయుగమునకు, తిరుముడి, కులశేఖర, కూరత్తాళ్వారు త్రేతాయుగమునకు, పరకాల తిరుప్పాణి తొండరడిప్పొడి యాళ్వారులు ద్వాపరమునకు, భాష్యకార, మధురకవి, శఠరిపు ఆళ్వార్లు కలియుగమునకు జెందినవారని యుగమునకు ముగ్గురి చొప్పున బంచెను (చూ. ప. 42)

ఆళ్వారులందు దేవదేవి విప్రనారాయణుల ప్రణయము గోపికా కృష్ణుల లీలవంటిదని శ్రీ రంగడు జెప్పెను. అతని జీవితమున భక్తి రక్తి చెరియొక తెక్కపట్టుకొన్నవి. ఆ కారణమున గాటోలు నతని కథ పలువురు కవుల నాకర్షించినది.

## సాహితీ ప్రపంచమున భక్తాంఘ్రి రేణుపటల వ్యాప్తి

### కా వ్య ము లు

1. విప్రనారాయణ చరిత్ర — చదలువాడ మల్లన
   క్రీ. శ. 1600 ఆ (5)
2. వైజయంతీ విలాసము సారంగు తమ్మయ్య
   క్రీ. శ. 1580 - 11 ఆ (3)
3. విప్రనారాయణ చరిత్ర పిడుగు వెంకటకవి
   క్రీ. శ. * ఆ (3)

### య క్ష గా న ము లు

1. విప్రనారాయణ చరిత్ర — చక్రపురి రాఘవాచార్యులు
   క్రీ. శ. 1545
2. విప్రనారాయణ చరిత్ర — విజయరాఘవ నాయకుడు
   క్రీ. శ. 1652
3. భక్తాంఘ్రిరేణు చరిత్ర — ఉత్తర రంగకవి
   క్రీ.శ. 1772 పూర్వము
4. విప్రనారాయణ చరిత్ర — గద్ద రామదాసు
   క్రీ. శ. 1878 - 30

---

* ఇతని గురించి శ్రీ విడుదవోలు వేంకటరావుగారు విప్రనారాయణ చరిత్ర పీఠికలో తెల్పి ఈ కృతి యముద్రితమని కవి ఆధునికుడని, ప్రతి తంజావూరు లైబ్రరీ యందు గలదని తెలిపిరి.

## నా ట క ము లు

1. విప్రనారాయణ చరిత్ర — పానుగంటి లక్ష్మీనరసింహరావు. క్రీ.శ. 1865-40.
2. కనక పాత్రిక — తిరుపతి వెంకట కవులు. క్రీ.శ. 18[illegible]1-60.
3. విప్రనారాయణీయము — బి. ఎల్. ఎన్. ఆచార్య

## న వ ల లు

హేమ పాత్ర — శ్రీ పిలకా గణపతి శాస్త్రి
ఎమెస్కో పాకెట్ బుక్స్ — ప్రథమ ముద్రణ 1980.

## చ ల న చి త్ర ము లు

1. విప్రనారాయణ — అరోరా ఫిలింస్ దర్శకత్వం అహీంద్ర చౌదరి 1937 సం॥ నటీనటులు: కాంచనమాల కస్తూరి నరసింహారావు గారలు.
2. విప్రనారాయణ-భరణీ పిక్చర్స్. దర్శకత్వం: రామకృష్ణ 1954 సం॥ నటీనటులు: భానుమతి, అక్కినేని నాగేశ్వరరావు.

నా పరిశీలనలో ఇవి యింతవరకితనిపై వచ్చిన వివిధ విధములగు కృతులు, చిత్రములు. పై కావ్యములందు మల్లన చిన్నన్నను అనగా పరోక్షముగా ద్రావిడ ప్రబంధము ననుసరింపగా తమ్మయ్య ప్రపన్నామృతము ననుసరించెనని స్వామి శివశంకరుల వారు చెప్పిరి. దానిని బట్టి యాంధ్ర ప్రాంతమున ద్రావిడ ప్రబంధ ప్రచార మెక్కువగా నుండగా తెలంగాణా ప్రాంతమున ప్రపన్నామృతమున కెక్కువ ప్రచారముండెనని తలపవచ్చును*.

---

* ప్రపన్నామృతకర్త భగవద్రామానుజుల శిష్యుడగు వడుగ నంబి వంశీయుడిది చెదలు వాడ మల్లన సమకాలికుడని శ్రీ విడుదవోలు సుందరేశ్వర రావు గారు తెలిపిరి.

గత శతాబ్దమున బిజనపల్లెలో నివసించిన B. K. వెంకటాచార్యులు, వారి వంశమునకు జెందిన వారు.

వైష్ణవ మతమున వర్ధిల్లిన యాళ్వారులందరు శ్రీమన్నారాయణుని యలంకారములు మరియు నాయుధములు. వానియందీతడు వైజయంతీమాల ఇతడు తమ్మయ్య దృష్టి యందెంత నవీనుడో నరసింగకవి దృష్టి యందంత ప్రాచీనుడు.

ఇతని కథను చెప్పిన వారియందు మల్లన తమ్మయ్య లిద్దరు ప్రసిద్ధులు. వారు సమకాలీనులైనను వారి వారి స్వభావములు వేరు. మల్లన గంభీరుడు. తమ్మయ్య పరిహాస ప్రియుడు. అందువలన యిద్దరి కావ్యవస్తు వొకటేయైనను అతడు జెప్పినది చరిత్ర. ఇతడు జెప్పినది విలాసము కనుక మల్లనగారి నాయకుడు గంభీరుడు. తమ్మయ్యగారి నాయకుడు మెత్తనివాడు.

మల్లనగారి కథయందు వనమాలిక నేరుగా విప్రవనిత గర్భమున ప్రవేశింప నితని కథయందు దానిని శ్రీహరి యామెకు స్వప్నమున నొసంగెను. ఆ నాయకుని యందు మొదట దైవాంశ పిమ్మట మానవాంశ కనిపించగా నితనియందు మొదట మానవాంశ పిమ్మట దైవాంశ గనిపించును. అతడు దేవదేవి తన పంచన యున్నప్పటికి నొకవత్సరము వరకు కరుగలేదు. ఇతడో యామె పలకరింపున కన్న మొదటనే కరిగెను. అతని నామెచే మరులుకొనవలసి వచ్చెను. ఇతడామెనే బలవంతపరచదలచెను

అటులే మల్లనగారి దేవదేవియందు పెద్దలయిన భీతియున్నది. ఈమె యటు గాక సూదివలె చొచ్చుకొనిపోవు స్వభావముగల వగలాడి. ఇటుల వీరిద్దరి స్వభావమున గొప్ప భేదము గనిపించును.

ప్రసిద్దేతి వృత్తములను స్వీకరించిన కవులు స్వాతంత్ర్య ప్రియులు. మూలానుసరణ ప్రియులు. ఉభయమార్గానుయాయులు అని మూడు విధములుగా గనిపింతురు. శకుంతల కథా విషయమున కాళిదాసు స్వతంత్ర కల్పనలతో తీర్చిదిద్దగా నన్నయగారనౌచిత్యమునుపరిహరించుచు మూలమునే యనుసరించెను. అనంతరీయుడగు పిల్లలమర్రి పినవీరన వారినిద్దరి నొకచో గలిపెను. అటులే వెల్లూరి నరసింగకవి తన కథయందు మల్లన తమ్మయ్యల నిరువురను సమావేశ పరచెను. అయినను ఒకే యితి వృత్తమును పలువురు స్వీకరించినపుడనంతరీయు లపై స్థల కాలములచేత నమీపస్థులగువారి ప్రభావముపడుట లోక సహజముకనుక నితడెక్కువగా తమ్మయ్య ననుకరించి యతని కథను విస్తరించుటకు యత్నించెను. దానినీ కవి కవితా కళయందు జూపి అంతమున యిద్దరి సంవాద పట్టిక నిచ్చితిని.

## నరసింగ కవి కథా ప్రణాళిక

ఇతని కాలము నాటికి దేశమున ప్రబంధ ప్రక్రియ వెనుకబట్టి యక్షగానములు వ్యాప్తికి వచ్చినవి. అయినను యితనికి ప్రబంధ రచనపై మక్కువ తరగకదీనిని యక్షగాన ప్రబంధముగ రూపొందించియున్నాడు. అనగా నా రెండు లక్షణములందు జోడించెననుట. దానికితో డితనికి తన యితివృత్తమునకు సమగ్రత గలిగించి యది యొక వైష్ణవ ప్రబంధముగ దిద్దు దృష్టికూడ నితని కుండెను. అందువలన కథను పంతానార్థమై మండం గుడి యందలి విప్రదంపతులు చింతించుట మొదలుకొని శ్రీరంగడు లక్ష్మీదేవిచే విప్రనారాయణుని పూర్వజన్మమును జెప్పువరకు కథను లాగుకొని వెళ్ళెను.

కథా విస్తృతి కిట్ల దవలంబించిన పద్ధతి పాత్రోచితముగా నున్నది.

| | |
|---|---|
| లక్ష్మీదేవిచే | - పతివ్రతా ధర్మములు |
| ఎఱుకసానిచే | - అష్టోత్తర శతదివ్య దేశస్తోత్రము<br>అష్టాదశ శక్తిపీఠ స్తోత్రము |
| విప్రనారాయణునిచే | - పన్నిద్దరాళ్వారుల వివరము |
| మధురవాణి దేవదేవిచే | - సముద్ర మథన వృత్తాంతము |
| దేవదేవిచే | - వారకాంతా లక్షణము |
| సూత్రధారునిచే | - విష్కంభ ప్రవేశక సన్నివేశములు<br>వర్షర్తు వర్ణనము |
| శ్రీరంగనిచే | - శ్రీరంగావతరణము<br>విప్రనారాయణుని పూర్వజన్మ వత్తాంతము |

ఇటుల నొక్కొక్క పాత్రచే నొక్కొక్క సందర్భోచిత విషయమును జెప్పించుచు కథకు తగిన సిరిని గల్పించెను.

## చూత సౌందర్యము - సింహావలోకనము

ఇతడు సంస్కృతాంధ్రము లందును సంగీత సాహిత్యము లందును ప్రౌఢుడు. ఇదిగాక ఏతనిది రాజకన్యా పరిణయమను నొక ప్రబంధము గూడ.

నున్నది. అది రెండవ పారిజాతాపహరణము. శ్రీకృష్ణుడు నరకుని సంహరించి యతడు చెఱబెట్టిన కన్యలను వివాహమాడుట యందలి యితివృత్తము. అది త్ర్యా శ్వాసకృతి. ఇతని రచనలందు చూతపురీ విలాసము మొదటిగా రాజకన్యా పరిణయము చివరదిగా కనిపించును. వీని గాక మరే యే రచనలు చేసెనో తెలిసి రాలేదు.

ఇతనికి సంగీతాభిమానము మెండు. దాని లక్షణముగూడ నెఱిగినవాడు. అందువలన నన్నయాది సాహిత్యవేత్తలతోపాటు భరతశాస్త్రజ్ఞులను గూడ కవి స్తుతియందు పేర్కొనెను.

"ఓంకారంచ పరబ్రహ్మం యావదోంకార సంభవమ్
అకారోకార మాకారం ఏతే సంగీత సంభవమ్
అకారో విష్ణురూపంచ ఉకారో బ్రహ్మరూపకమ్
మకారో భర్గరూపంచ, యావదోంకార సంభవమ్"

అని సంగీత ప్రపంచమంతయు ప్రణవము నుండి యుద్భవించినట్లు సంగీత లక్షణము జెప్పును. నరసింగ కవి యీ రహస్య మెఱిగినవాడు. అందు వలన తన కృతిని అకార, ఉకార, మకార రూపకములైన విష్ణు బ్రహ్మ శివస్తుతులచే నారంభించెను. కృతి మామిళ్ళపల్లి లక్ష్మీనృసింహున కంకితము గనుక "శ్రీకాంతా కుచకుంభ యుగ్మ విలసత్త"ని లక్ష్మీస్మరణ పూర్వకముగా నారంభించి యంకితము గొన్న దైవము నృసింహుడు గనుక సింహమునకు సజాతీయమైన శార్దూలవృత్తమును మొదట ప్రయోగించెను.

కృతిభర్త తరణికంటివాడు గనుక నచట వారు ప్రతిష్ఠించిన యంజనేయుని సూత్రధారునిచే, మామిళ్ళపల్లి శ్యామలాపీఠము గాబట్టి యచటి శ్యామలా దేవిని, తాను కొల్లాపుర సంస్థానమునకు చెందినవాడు గనుక ఎఱుకసానిచే నచటి లక్ష్మీదేవిని స్తుతింపజేసెను.

దైవస్తుతులకు గాని ఆశీర్వచనములకు గాని యుత్తమమైన భాష యుదాత్తమైన ఛందమును వాడుట ప్రాచీనకవి సంప్రదాయము. ఇతడు దాని ననుసరించి ప్రాచీనకవి, కృత్యాదిని జేసిన త్రిమూర్తుల స్తుతులకు, గణపతి అంజనేయనుతులకు, విప్రనారాయణుడు రంగ ప్రవేశము జేసిన రంగనిస్తుతికి, సంస్కృత మందలి

విశేష వృత్తములు వాడుటేగాక, నాందీ పాత్ర నిర్వహించెడు బాలరంగస్వామి చేత మామిళ్ళపల్లి నృసింహుని స్తుతిని, సంతానార్థమై నారాయణుడు విష్ణువును స్తుతించిన దరువులను గూడ సంస్కృతముననే రచించి వృత్తౌచిత్యమును భాషౌచిత్యమును పాటించెను. సంస్కృత నాటకములందువలె తెలుగు నాటకములందు పాత్రోచిత భాష గనిపింపదు. దాని రూపము తంజాపూరు యక్షగానములందు కొంత దర్శనమిచ్చును. ఇతడు ఎఱుకసాని గద్దె జెప్పునప్పుడు జాతీయపు మాటల పేరనచట పాత్రోచిత భాష - నుపయోగించి చూపెను.

కృతి కర్త నామమును జెప్పునప్పుడు నామగర్భిత సమస్యాసీసమును రచించి చిత్రకవితా విధానమును జూపెను. ఇక కథయందు విప్రనారాయణుని జనన సందర్భమున లాలిజోలపాటలు, అతడు దేవదేవి యింటికి వెళ్ళినపుడు తలుపుదగ్గర పాట, తలారి బంగారు గిన్నెను వెదకు సందర్భమున ఏలలు, శ్రీ రంగడు ప్రత్యక్షమైనపుడు విప్రనారాయణుడు స్తుతించిన సందర్భమున చూర్ణిక - మధురవాణి దేవదేవి లక్ష్మీనారాయణులను పొగడునపుడు ఓలలు, అంతమున మంగళహారతీ - యిటుల సంగీతమున గూడ సందర్భోచితమైన రీతులుప యోగించి తన సంగీతజ్ఞతను చూపెను. ఆయా సందర్భము లందితడు దరువుల కుపయోగించిన రాగములు గూడ కొన్ని సందర్భోచితముగా నున్నవి.

ఇతని యక్షగానమందాహార్య వర్ణన మొక ప్రత్యేకత. సాధారణముగా యక్షగానములందిది యుండదు గాని యితడు వెల్లూరియందలి రాజాస్థాన కవి గనుక నాయాస్థానమునకు వచ్చిపోవు పలువిధములైన వ్యక్తులను వారి వేషములను బాగుగా జూచి యుండును. వెలమ దొరలు వేషప్రియులు. అంతేగాక వారికి పనివారి బలగమెక్కువ. ఆ కారణమున నితడానాడు తమకోట యందు జూచిన వారి వేషముల నతిశయోక్తి పొంతబోక సూత్రధారునిచే నాయాపాత్రల ప్రవేశ సందర్భమున వారి రూపము కన్నులకు గట్టించెను. ఈయన రాజ కన్యాపరిణయమందలి నారదుడూర్ధ్వ పుండ్రములతో తులసీ మాలలతో నచ్చముగా నానాటి వైష్ణవాచార్యునివలెనే యుండును

యక్షగానములందు ఎఱుకత ప్రాధాన్యమున్న వానికి ''కొరవంజి'' యని సవతుల కలహము ప్రధానమైన దానికి ''పారిజాతమ''ని వ్యవహారము. నరసింగకవి కాలమున నీ ప్రాంతమున కొన్ని కొరవంజులు గూడ వచ్చినవి గనుక

షావి ప్రభావముచేత కాబోలు నితడిందు ఎఱుకసానివి ప్రవేశపెట్టి విప్రనారాయణుని జననము మొదలు శ్రీరంగని ప్రత్యక్షమువరకు లక్ష్మీదేవి కెఱుక జెప్పించెను. ఇతవి నాటికి తెలకపల్లె రామలింగకవి నముద్రమునకు మంచి పలుకుబడి యుండె నేమో! లేకున్న బాదరాయణ సంబంధమున నాయితివృత్తము నతడు రచించి నటులే శుకుడు పరీక్షితునకు జెప్పినటులెందుల కిందు గూర్చునవిపించును. దావి నితడు సందర్భోచితముగా మెరుగుదిద్ది గూర్చెను.

ఈ కథయందు రెండు స్వప్న సన్నివేశములున్నవి. మొదట శ్రీరంగడు విప్రపత్నికి గనిపించి వైజయంతీమాల విచ్చెను. రెండవతడవ విప్రనారాయణుని వలపించుట కసమర్థురాలై చింతిల్లు దేవదేవికి గనిపించి యోదార్చెను. నరసింగ కవి వీనియందు మొదటి దానిని పరిహరించి యుచట నెఱుక సానివి ప్రవేశపెట్టి కథకొక లోకమర్యాదను కృతికొక కావ్య మర్యాదను చేకూర్చెను.

ఎఱుక తరంగమునకు వచ్చిన పిమ్మట అంగవంగ కళింగములతో పాటష్టోత్తర శతదివ్య దేశములను కీర్తించెను. నరసింగకవి వీనిని పరమయోగి విలాసము నుండి గ్రహించెను. అందిది తంజాపురముచే నారంభమై శ్రీరంగముచే ముగిసినది ఇందలి నాయకుడగు విప్రనారాయణుడు వనమాలికాంశము గనుక వైకుంఠము నుండి యవతరించినవాడు. నాయికయగు దేవదేవి యతవిని వలపించు టకు వచ్చి మధురాపురియందు నిలిచినది. అందువలన నరసింగకవి తిన స్తుతివి వైకుంఠముచే నారంభించి మధురాపురిచే ముగించి యారంభోప సంహారములను కథా సూచకములుగా నిర్వహించెను.

విప్ర నారాయణుడు రంగమునకు వచ్చిన పిదప పన్నిద్దరాళ్వారుల వివరములు జెప్పును. దీనిని గూడ నరసింగకవి పరమయోగి విలాసము నుండియే గ్రహించినను, వైష్ణవుల కాళ్వారుల తిరునక్షత్రములు ముఖ్యము గనుకవానినిందు గూర్చెను.

తమ్మయకవి దేవదేవి జనన సందర్భమును జెప్పించుచు నచ్చరలలోగల పదునాలుగు జాతుల పేర్లను బేర్కొని యందునే నొకవంశమున బుట్టితినని చెప్పించెను. ఇచట నరసింగకవి యుద్దేశమదిగాదు. అతడు నారాయణుడు గనుక నతని ప్రియురాలైన దేవదేవి సముద్రము నుండియే జనింపవలెను. అంతేగాక

నతని మత ప్రకారము వారు ద్వాపరయుగము వారు గనుక సముద్రము నుండియే జనింపజేసి తాను చెప్పదలచిన కథా పరమార్థమును నిరూపించెను.

రస ప్రబుద్ధులగు కవులు స్వస్థాన వేష భాషాభిమానులై యుందురని చింతామణి వాక్కు. నన్నయగారు అర్జునుని తీర్థ యాత్రల సందర్భమున వేంగీ దేశమునకు గొనివచ్చెను గదా! ఈ కథా నాయకుడు శ్రీరంగని భక్తుడు. అయినను తంజాపూరి విజయ రాఘవుడతనిని మన్నారుస్వామి భక్తునిజేసి యీ కథను గూడ తన కాలమునకు తన యాలయమునకు మార్చుకొనెను. అటులే నరసింగకవి యితని కృతి భర్త యిష్ట దైవమగు మామిళ్ళపల్లి నృసింహస్వామి భక్తుని జేసెను.

దేవదేవి విప్రనారాయణుని సమీపించుటకు దాసరిసాని వేషము బూనెనని తమ్మయ్య కథనము నరసింగకవి దాని నటులే గ్రహించెను. నేడు మన సంఘమున గల నష్టా దశ వర్ణములకు తోడు ఆరాధ్యులు, జంగములు, తంబళులు, బలిజెలు, శైవము, అయ్యవార్లు, నంబులు, సాతానులు, దాసర్లు, వైష్ణవము సృజించిన జాతులు.

కాకతీయుల కాలమున వేశ్యలు గూడ జాతుల వారీగా నుండిరట కనుక వేశ్యయైన దేవదేవి విప్రనారాయణుని దరియుటకు దాసరిసాని వేషము బూనుట యొకనాటి యాచారమును దెల్పును. దాసరియనగా దాస్యముజేయువాడని యర్థము.

దేవదేవి తన విరక్తికి "పింగళ" యను వేశ్య కథ వినుట, ఆమెను గురువుగా గ్రహించుటను చెప్పించినవాడు తమ్మయ్య. ఇది యతడౌచిత్యమెరిగి చేసిన పని, దానినే యితడు స్వీకరించెను.

కవులు సాధారణముగా తమ యభిమాన విషయములను దాచుకొనరు. ఎచటనో యొకచోట బయటబడుదురు. దేవదేవి దాసరిసాని వేషము పూని వచ్చునపుడు శుభ శకునము గాంచుట కవిగారికి దానిపై యభిమానమేగాక భావి కథను గూడ తెలుపునదిగా నుపయోగపడినది.

తమ్మయ పరిహాస ప్రియుడేగాని సంగీత ప్రియుడుగా గనిపించడు. నరసింగకవి సంగీతాభిమాని అందువలన చిన్నన్న ననుసరించి విప్రనారాయణుని

రంజించు వేళ నామెచే సంగీతము పాడించెను. అంతేగాక చందన చర్చ మున్నగు శృంగారోపచారములుగూడ జేయించెను.

విటకంటకి విప్రనారాయణుని యిల్లు వెడల నడచగా నతడచటనే యామె వాకిట తిన్నెపై బరుండి యుండెనని చిన్నన్న కథనము. తమ్మయయులు గాక నతని నాత్మాభిమానము గలిగిన వానినిగా జేసి మరల తన తోటకు వెళ్ళినటుల జూపెను. నరసింగకవి దీనినిటులే గ్రహించెను. ఈ సందర్భమున వచ్చిన కావేరీ పాత్రము తమ్మయ్యగారిదే. దానిని గూడ నితడు మార్చలేదు. ఇవన్నియు నితడు కథా సందర్భమున వహించిన మెళుకువలు.

ప్రాచీన కాలమున నాటకములకు నేటివలె రంగాలంకరణ హంగులుగాని భావ ప్రదర్శనకు నేటి చలన చిత్రములందు వలె "క్లోజప్పులు"గాని లేవు. అందు వలన నాటివారు దృశ్యమును, భావమును, సన్నివేశమును ప్రేక్షకుల మనస్సునకు నాటించవలసి వచ్చినపుడు కావ్య పద్ధతినే యాశ్రయించుచుండిరి. అది మన నరసింగ కవికిని తప్పలేదు. పైగా నితనిది యక్షగానమేగాక యక్షగానప్రబంధము. అందువలన నితడు ప్రబంధ విషయమంతయు సూత్రధారుని కప్పగించెను. ఈ సందర్భమున నితడానాటి ప్రజాభి రుచి ననుసరించి ద్విపదనే వాడినను అటనట చక్కని పద్యములు గూడ నుపయోగించెను. ఇతని సీసములపై పోతనగారి ముద్ర స్పష్టముగా గనిపించును.

ఈ కృతియందితడు గావించిన వర్ణనలందు విప్ర పత్ని దౌహృదము, దేవ దేవి విలాస చేష్టలు, వర్ష విజృంభణము, విప్రనారాయణుని విరహ భ్రాంతి, అతని విరహావస్థ మున్నగు ఘట్టములు స్వభావ సుందరములై యుత్తమ ప్రబంధమును దలపించును. దేవ దేవి ఈ విలాస చేష్ట పరికింపుడు.

"...........సోయగంబున హావ
భావముల్ కొంత యేర్పడ తిన్నగాను
కులుకు గుబ్బల పై టకొంగు జారగను
తొలగించు నొకవేళ తొక తొక ముద్దు
గులుకంగ విని విన కుండంగ దేనె
జిలుకంగ బలుకును చిత్తముప్పొంగ"—ద్వి. దేవదేవి ఈ విలాసములు

గని యతని మతిపోయినది. అంత నతడు.

హల్లకపాణి ధమ్మిల్లమ్ము గాంచి శ్రీ
కృష్ణ నామంబు కీర్తించ మరచె.
శుకవాణి నడుము తప్పక జూచి శ్రీహరి
ధ్యానంబు మదిలోన దలచ మరచె — ప-86

ఇటుల నరుడై పోయెను. ఆతనికి మతి బోవుటే గాదు మదన పరవశమున భ్రాంతి గూడ గలిగినది. అపుడు

పుష్పాలు గోయుచో పొలతిమోవి దలంచి
పల్లవంబులు చేతబట్టి త్రెంచు
చిగురాకులేల దెంచితినని యాచెలి
రదనాలినెంచి కోరకము దునుము — ప-87

పుష్పమాలా కైంకర్యమునకై పూతకు వచ్చిన యాతని భ్రాంతి కారణమాలయై తుద కతనిని యొకటి జేయకుండ జేసినది. ఇది కాముక స్వభావమైన చిత్రణము. విట కంటకి యిలు వెడల నడచినపుడతడు తోటకు వచ్చి, దేవదేవిని గుఱించి

కలకంఠినూ గారు గాంచిన జాలదే
శేషాచలంబు వీక్షింపనేల — ప-103
అతివ తోడుత మాటలాడ గల్గిన శౌరి
కెంపగా చక్కెర బంచి పెడుదు — ప-104

అవి పలవించిన తీరున మనోహరమైన వ్యంగ వైభవము వెల్లివిరియుచున్నది. ఇది యక్షగానమైనను పీ దృశ్య వర్ణనలచే పాఠకులకు ప్రబంధ తృప్తినిచ్చును.

మన జాతి యందొక్కొక్క మతమునకొక భాష, యొక పారిభాషిక పద జాలమున్నది. వైదికులు సంస్కృతమును, జైన బౌద్ధులు పాళిని, శైవులు కన్నడమును, వైష్ణవులు తమిళమును నాదరించిరి.[1] కనుక కవులు దేశీయ మహా పురుషుల యతి వృత్తములు గ్రహించినపుడు వారి మత సంప్రదాయములను గూడ నెరిగి కథయందా పారిభాషికముల నుపయోగించిన రచనా శిల్పమునకు

1. వైష్ణవాచార్యులందరు తమిళ దేశమునుండి వచ్చినవారు. వారి తమిళ ప్రీతికి ఇది గూడ నొక కారణము.

జీవము చేకూరును. తమ్మయకవి దాని నెరిగినవాడు కనుక నతని ననుసరించిన యితడు గూడ వైష్ణవ పారిభాషికములను వాడెను. వాని నిందు పట్టికగా నిచ్చితిని.

ఈ కథయందు రంగడు విప్రకాంతకు స్వప్నమున తెలుపు నలుపు గల దండనిచ్చినట్లు తమ్మయ్య జెప్పుట కథానాయకుని జీవితమున కర్థవంతమైన సంకేతము కాని నరసింగకవి దానిని గమనింపలేదు. చిన్నన్న దేవదేవి విప్రనారాయణుని మొదట జూచినపు డొక యెలమావి క్రింద నిలిచియుండెనని, మల్లన యత డామెను జూచునపుడు మాకందముల కంట్లుడింప నాలోచించుచుండెనని చెప్పిరి. దానివిబట్టి యతని వనమున చూతములున్నట్లు దెలియునుగాని నరసింగకవి వాని ప్రసక్తి యెచ్చటను దేలేదు. తెచ్చిన యెడల నది యతని కృతినామమునకొక దోహదమై యుండును. చిన్నన్న విప్రనారాయణుడు వర్షమున దేవదేవిని జూచి నపుడామె రావిచెట్టు క్రింద నిలిచియుండెనని చెప్పెను. రావిసంసార వృక్షమునకు సంకేతము గనుక నది కథాపరమార్థమునకు సూచకముగా నుండెడిదిగాని నరసింగకవి దానినిగూడ గమనింపలేదు. తమ్మయ్య ననుసరించి యతడామె విప్రనారాయణుని కుటీరపు పంచననే నిలిచియుండెనని చెప్పెను. కథావిషయమున నితడు తమ్మయ్యనే యెక్కువగా ననుకరించెనని మొదటనే జెప్పితిని. ఆ విషయముననే గాక నతని సామెతలనుగూడ నరసింగకవి సొంతము జేసికొనెను.

ఒక కవి మరియొక కవి వాక్యములను వాడుట యతని ప్రతిభా లోపమునకు చిహ్నముగాదు. సమర్థుల యెడ నది వారిపై గల యభిమానమునకు తార్కాణమగును. అందుచేతనే యతడు తిమ్మయ్యనుండి సామెతలేవేవి గ్రహించెనో వానిని గూడ పట్టికగా ప్రదర్శించితిని.

ఇతని రచనయందు చదువదగినది. విశేష వృత్తములతోపాటు అష్ట పద్య రచన యొక ప్రత్యేకత. ఈ ప్రక్రియ కావ్యసజాతులందు మాత్రమే యున్నది. అది మూడు పాదములవరకు పద్యము వలెనే సాగి నాలుగవ పాదము నుండి, యేదియో యొక దరువుగా మారి యొకటి రెండు చరణాల పిమ్మట ఒక చిన్న సంబోధనాంతమైన ముక్తాయింపుచే ముగియును. తెలుగు సాహిత్యమున నింత వరకు కందార్థములకే కొంత ప్రాచుర్యమున్నదిగాని యతడు వానితో పాటుత్ప లార్థములు, ద్విపదార్థములు, సీసార్థములు, గీతార్థములు గూడ వాడెను. వీని యందు కొన్ని యున్నట్లు నేడు తెలియదేమొ గూడ.

మన సాహిత్యమున దండకము, మంజరి, రగడవంటి వివిధ ఛందో ప్రక్రియలందు కృతులు వచ్చినప్పటికి కేవలమీయర్థ పద్యములచే కృతులు రాలేదనియే చెప్పవలె. కందార్థములందు మాత్రము శివరామ దీక్షితులవారి "శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములను నొక ప్రామాణిక కృతి వచ్చినది మరియేవో యొండు రెండు కందార్థ తారావళులు వచ్చినవి. సీసార్థములందు కవి సింహా భిరుదాంచితులైన పోకూరి కాశీ పత్యవధానుల వారు శివ దూషణ భూషణియను నొక లఘు కృతి రచించితినని చెప్పి యుండిరి. ఇక తక్కినవిక్వాచిత్కముగా యక్షగానములందు గనిపించుటే తప్ప స్వతంత్ర కృతులుగా వచ్చినటులలేదు. ఇది పద్య గేయ ప్రియులెవరైన, నవశ్య మాదరించదగిన ప్రక్రియ.

ఈ కృతి యందు మొత్తము విశేష వృత్తములు 9, పద్యములు 145. అర్థ పద్యములు 29. దరువులు 102, ద్విపదలు 639 యుపయోగించెను. విశేష వృత్తములందు గాథా, క్షమా, రథోద్ధతము, విభావరి, పంచచామరము, మత్త కోకిలావృత్తములున్నవి. ఇక తక్కిన పద్యములందు సీసములు తేట గీతులు లెక్కువ.

దరువులు ఆది, అట, ఏక, త్రిపుట, రూపక, జంపె, కురుచ జంపె అను తాళములందు నిబంధింపబడినవి. వానికి మొత్త మిరువది నాలుగు రాగము లుపయోగింపబడినవి. తాళములందాట తాళములు, రాగములందు కల్యాణి రాగము లెక్కువగా నున్నవి.



# పట్టిక - 1

## చూతపురీ విలాస వైజయంతీ విలాసాదుల సంవాదములు

| చూతపురి | వైజయంతి | చూతపురి | వైజయంతి |
|---|---|---|---|
| పద్య-9 | అవతా-32 | ద్వి-28 | 109 |
| ప 22 | శ్రీనాథుని చాటు-61 | ద్వి-29 | 120 |
| ద్విప-7 | పరమ V 495 530 | ద-82 | 126 |
| ద్విప-10 | ప్రథమ-38 | ద్వి-33 | 134-36 |
| ద్వి-13 | భాగ 8-192 | కందా-86 | తృ-7 |
| ప-51 | భాగ 8-195 | కందా-87 | 8 |
| ద్వి-14 | భాగ 8-202 | ద్వి-36 | 14, 21 |
| ద్వి-15 | భాగ 8-216-64 | ప 86 | విజయ 2-148 |
| ప-57 | మను 2-43 | ప-90 | 16 |
| ప-59 | ద్వితీ-5 | ప-92 | 51 |
| ద్వి-18 | 12 | ద్వి 38 | 55-56 |
| | | ప-94 | 59 |
| ద్వి 20 | 19 | ప-95 | 66 |
| ప-67 | 20 | ద్వి-40 | 65 |
| దరు-60 | 23, 25 | ద్వి-42 | 70 |
| ద్వి-21 | 54 | ద్వి-44 | 90, 91 |
| ద్వి 23 | 67 | పద్య-100 | 98 |
| ద్వి-24 | 77 | పద్య-102 | 107, 110 |
| ద్వి-25 | 90 | పద్య 103 | విజయ 2-111 |
| ద్వి-26 | 98, 99 | ద్వి-46 | 118, 112 |
| ద్వి-27 | 105, 106 | ద-104 | 121 |
| ద-74 | 111 | ద్వి-47 | 136 |

| చూతపురి | వైజయంతి | చూతపురి | వైజయంతి |
|---|---|---|---|
| పద్య-109 | చతుర్థ-9 | ద్వి-53 | 78, 87 |
| పద్య-111 | 11 | ద్వి-54 | 89 |
| ద్వి-48 | 12, 13, 14 | పద్య-134 | 93 |
| పద్య-112 | 17 | పద్య-135 | 95 |
| పద్య-115 | 20 | పద్య-137 | 94 |
| పద్య-116 | 22 | దరు 128<br>పద్య 40 | 101 |
| ద్వి-50 | 26 | | |
| దరు-112 | 40 | ద్వి-56 | పరమ V 532-40 |
| పద్య-120 | 45 | ద్వి-57 | 125-126 |
| పద్య-121 | 47 | పద్య-148 | 131 |
| పద్య-123 | 55 | పద్య-154 | 137 |

## సంకేతములు

అవ = అవతారిక

ద్వి = ద్విపద

ప = పద్యము

ద = దరువు

పర = పరమయోగి విలాసము

భాగ = భాగవతము

మను = మనుచరిత్ర

విజయ — విజయ విలాసము

శ్రీనాథుని చాటువు ఎమెస్కో వారి క్రీడాభిరామము

సామాన్యమైన అంకెలు వైజయంతీ విలాసంలోని పద్యాలవి. ఆశ్వాస సూచన వాని మొదట ఉన్నది.



# పట్టిక - 2

## వైజయంతీవిలాస, చూతపురీవిలాసముల సామెతల సామ్యములు

1. ఆట :- తల్లిదండ్రి నన్నదమ్ము లెవ్వడులేక
యొంటి మింటినుండి యుట్టిపడితె — వైజ. 2 - 61

దరు :- కీరవాణి నీకెవ్వారు లేరంటివి మింటినుండి
ధారుణిలో నుట్టిపడిన దానవె నీవు — చూత. ద - 88

2. కంద :- ధాత్రీమండలి పాలు విరిగితే పెరుగగునే ? — వైజ. 2 - 103

తేట :- పాలు విరిగిన పెరుగగునా - భ్రాంతిగాక — చూత. 88

3. సహించునె క్రక్కిన కూడుక్రమ్మరన్ — వైజ. 2 - 99

క్రక్కిన కూటిపై క్రమ్మరవాంఛ, జనియించునా — చూత. ద్వి 26-9

4. కంద :- తన మనసు పదిలమైన లంజె మంచిరమునసై
నను, కాపురముండగనగు — వైజ. 2 - 103

సీస :- చక్కగా మానసము పదిలంబైన
కులట యింటనైన కూర్మితోడ
కాపుర మొనరించగా కొదవయే — చూత. వ. 77

5. ఉత్ప :- .... .... .... సజ్జన చిత్తవృత్తియ
వ్యాకులలీల రాతిగుడి వంటిది లోకములోన వేశ్యలున్
కాకులవంటి వారలు—— — వైజ. 2 - 98

ద్విప :- లతాంగి కాకము బోలు, యోగి
జనము శిలాదేవ సదనంబు వంటివారు — చూత. ద్వి - 26

6. చల్లకు వచ్చి ముంతదాచనేల — వైజ. 3 - 7

చల్లకు వచ్చి ముంత దాచఫలమేమి — చూత. కందా - 86

7. ఉత్ప :- అల్లుడుగారి యమ్మకిపు డాకలి గాదొకొ వై జ. 3 - 102
ద్విప :- ధరణిలో వినుగన్న తల్లి కెంచగను ఆకలిగాదొ! చూత. ద్వి - 45

8. కంద :- విడమేటికి, మాకు సదావటువులకును మహినిది మీరల్
మాకొసగ రాదు మేమున్, గైకొనగరాదు వై జ. 4 - 8
తేట :- బ్రహ్మచారికి మీరలీ వస్తువులను
నీయగారాదు మేము గ్రహించరాదు చూత. పద్య - 108

9. కంద :- ఇన్నాళ్లెరుగము
బోడడు బంగారుపిట్ట పోపరికిరపన్ వై జ. 4 - 24
కంద :- తెలియక నాతవి నీచుగ
బలికితి బంగారుపిట్ట బాపడు దలపన్ చూత. పద్య - 117

10. చంప :- తెరవల మేమెరుంగుదుము
తెల్లవివెల్లను పాలటందుము వై జ. 4 - 95
ద్విప :- నల్లవివి నీళ్ళు తెల్లవివెల్ల పాలటంచు
నుండితి మిన్నాళ్ళు చూత. ద్వి - 61

# పత్రిక - 3

## వైష్ణవ పరిభాష

అడియేన్ = పాదసేవకుడు

కరియ = శాకము

కోవెల = ఆలయము

తిరునామము = ఊర్ధ్వపుండ్రము (పేరు, నామము)

తిరుపగూడ = చంకను తగిలించుకొను తాటిబుట్ట

తిరుపణ్యారము = గారెలు

తిరుకణ్ణామధు = తీపి పదార్థములు

తిరుమజ్జనము = స్నానము

తిరుమణి = వైష్ణవులు ధరించు శ్వేతమృత్తిక

తిరుమంత్రము = అష్టాక్షరీ మంత్రము

తిరుమాళిగ = ఆచార్యుని యిల్లు, పవిత్ర గృహము

తిరువడిఘళ్ = శ్రీపాదములు

తిరువళ్కు = అర్చనావసరమందలి విశేషవస్త్రము (శేషవస్త్రము)

తిరువళ్యము = సన్నిధి

దివ్యప్రబంధము = తిరువాయిముడి

పళ్ళెరము = భోజనపాత్ర (భోజనము)

పుళి = చారు



# కొన్ని వ్యాకరణ విశేషములు

## సంధులు

*1.* త్వార్థేకార సంధులు :

క్రొమ్మెక్కి అడుగు = క్రొమ్మెక్కడుగు, కలిగి + ఉండు = కలిగుండు, కాచి + ఉన్న = కాచున్న. చిన్నబోయి + ఉండకు = చిన్నబోయుండకు, కొలిచి + ఉందు = కొలుచుందు, ఉండి + ఉండి = ఉండుండి.

*2.* ఏత్వ సంధులు :

గిన్నె + అంపె = గిన్నంపె

ఇట్టి రూపములు యక్షగానములందు సర్వసామాన్యములు

3. వడాగమము - తమిళమున తిరుశబ్దమున కచ్చువరమైనపుడు వడాగమము గనిపించును.

తిరు + అడిఘళ్ = తిరువడిఘళ్

తిరు + ఆరాధనము = తిరువారాధనము

## సమాసములు

తిరు శబ్దముతోగూడిన మిశ్రమ సమాసములు వైష్ణవ పరిభాష యందు పెక్కున్నవి. అందు కొన్ని ఉదా :—

1) 1. తిరునామము, 2. తిరుమంత్రము, 3. తిరుమజ్జనము.

2) ఈ క్రింది వానికి విఘంటువు లీ రూపములు జూపినవి

తిరుపణ్యారము = శ్రీ + పణ్యాహారః

తిరుమణి = శ్రీ + మృణ్

తిరువళ్క = శ్రీ + వల్కలమ్

3) తిరిపకోల, తిరిపగూడ ఈ సమాసములందు పూర్వపదము తిరిపమని సూర్యరాయాంధ్ర నిఘంటు మతము. "తిరు" అని శబ్ద రత్నాకర మతము. మొదటి మతమున చతుర్థి యందు మువర్ణక లోపము, రెండవ మతమున సగాగము అని చెప్పినవి.

తిరిపము = భిక్షము, తిరు = పవిత్రము, గూడ = తాటి, లేక వెదురుతో నల్లు ఒక విధమైన బుట్ట.

## త ద్ధి త ము లు

ఈ క్రింది వానియందు "అరి" ప్రత్యయము మతుబర్థముననే గాక కర్త్రర్థకమున గనిపించును.

దాస + అరి = దాసరి (దాసుని పని జేయువాడు)

పూజ + అరి = పూజ చేయువాడు

కమ్మి + అరి = కమ్మరి. (పూర్వ మినుప తునకలకు కమ్మీలని వాడుక. వాని పనిని చేయువాడు కమ్మరి )

ఉప్పు + అరి = ఉప్పరి (పూర్వము గ్రామీణులు తమ గ్రామములందే ఉప్పుగుంతలు ద్రవ్వి నాటు ఉప్పు తయారుచేయుచుండిరి కనుక అట్టి పని చేయువాడు.

దొమ్మి + అరి = దొమ్మరి (దొమ్మి యనగా యిద్దరిద్దరు కలియ బడుట. దానిని ప్రదర్శించువాడు దొమ్మరి.)

వండు + అరి = వడ్డెరి (వండు అనగా బురద. పూర్వము వడ్డెరులు మట్టిగోడలు కట్టుచు జీవించెడువారు.)

వెదురు + అరి = మేదరి (వెదురు పని జేయువాడు)

[వడ్డెరి, మేదరిలో పూర్వపదములు మారి కనిపించుచున్నవి. ఇవి వీనికి నాటు దోచిన రూపములు.]

## ప ద ము లు

నడినడుమ అజ్లోపము గలిగిన రూపములు.

ఎరువు = ఎర్వు   తిరుపతి = తిర్పతి

నరవ = నర్వ   మనవి = మన్వి

కొన్ని తమిళ పదములు

అడియేన్ = అడియాన్ దీని తమిళ రూపము

అడి = పాదము, అడియాన్ అనగా పాదసేవకుడు

తిరుమాళిగ = తిరుమాళిహై దీని తమిళ రూపము

మాళిగ = ఇల్లు, ఇదే నేడు మాడువు, మడిగె అను రూపము లందినవి.

యక్షగానము లందిట్టి భాషాప్రయోగ విశేషము లింకను పెక్కులు గనిపించును. ఇందు నరసింగకవి కవితా విశేషములను, కావ్యసౌందర్యమును నా శక్తి కొలది కొంత జూపుటకు యత్నించితిని. విమర్శకులకు ఇందింకను క్రొత్త విశేషము లనేకము గనిపింపవచ్చును అట్టివారిందేవేని దొసగులున్న మన్నించి తెలిపినచో వానిని కృతజ్ఞతా పూర్వకముగా మలిముద్రణయందు సవరింతును.

త్వమేవమత్వా పరవాసుదేవం
రంగేశయం రాజ వదర్హణీయం
ప్రాబోధకీం యోఽకృతసూక్తి మాలాం
భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే

రౌద్రి పుష్య బహుళ ఏకాదశి
జ్యేష్ఠా నక్షత్రయుక్త
శనివారం 31-1-1981

—కపిలవాయి లింగమూర్తి

"వాణీ సదనం"

విద్యానగర్ కాలనీ, నాగర్‌కర్నూలు 509 209

మహబూబ్‌నగర్ జిల్లా

# నరసింగ కవి వంశము



లక్ష్మీనరసయ్య
నరసింగయ్య (కృతికర్త)
అనంతరామయ్య
వెంకటాచలమయ్య
వెంకటసుబ్బమ్మ
నరసింహారావు
సుబ్బారావు
రామసుబ్బయ్య
హన్మంతరావు (అచ్చంపేట)
మహాదేవరావు
గోపాలరావు
కృష్ణమూర్తి
సదాశివరావు
నరసింహారావు
ప్రసాదరావు
నరసింహారావు
సుబ్బారావు

# "సురభి వంశము"

## తెలకపల్లె శాఖ




[మిగతా ప్రక్క పేజీలో]

మాధవరాయలు

పెద్దినాయడు (జటప్రోలు) | మల్లినాయడు (లింగాల) | నాగినేడు (పెద్దపల్లి) | చిట్టినాగినేడు

నాగినేడు (పెద్దపల్లి)
వెన్నమనేడు
రంగినేడు
మల్లపనేడు
జగ్గన్న
మల్లన్న

నరసన్న (ఆలేరు) | మల్లన్న | తిమ్మన్న (తెలకపల్లె)

తిమ్మన్న (తెలకపల్లె)
బారన్న
తిమ్మన్న
కృష్ణారాయడు × వెంకటలక్ష్మమ్మ (భార్య)
కృతి భర్త = నరసారాయడు × వెంకమ్మ (భార్య)
రామారావు × జానమ్మ (భార్య)
రంగారావు × వేణమ్మ (భార్య)
రఘురాంరావు × ప్రణయమ్మ (భార్య)

వేంకటేశ్వర్ | నందకిశోర్ | రంగారావు

(ప్రస్తుతం వీరున్నారు)

# చూతపురీ విలాసము
# యక్షగాన ప్రబంధము

సూత్ర: విష్ణు ప్రార్థన - శార్దూలం - కల్యాణి రాగం

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ విలసత్కాశ్మీర పంకాంకిత
శ్రీవక్షోంచిత నక్షసమ్ భవహారమ్ కారుణ్యపాథోనిధిమ్
పాకారి ప్రముఖాఖిలామరనుతమ్ కంజాత పత్రేక్షణమ్
శ్రీమామిళ్లపురీ నిశాంత మహిరాట్తల్పమ్ నృసింహం భజే ౧

బ్రహ్మ ప్రార్థన - గాథావృత్తం

భారతీ హృదయాంభోజమ్
భాస్కరమ్ భువనేశ్వరమ్
కంజాత సంభవం దేవమ్
వందే శ్రీ చతురాననమ్ ౨

శివ ప్రార్థన - రథోద్ధతం

శ్రీసతీ హృదయ కంజభాస్కరమ్
శీతభాను శిఖావతంసకమ్
శంకరం తరణికంటి మందిరమ్
భావయామి హృది మల్లికార్జునమ్ ౩

౧. దరువు - ఆదితాళం - హంసధ్వని రాగం

నందివాహనా నమోనమో - శ్రీ - నాగాభరణా నమోనమో
కందనిభాగళ సుందర! - సనకస - నందన వందిత! నమోనమో
నగవర సదన జలధి నిషంగ! నగకార్ముకధర నమోనమో
అగణిత వైభవ! హరిసుత మదహర! అగజాధీశ్వర! నమోనమో!

శూలకరా జినచేల! దళిత శుండాల! దనుజ! తే నమోనమో
కీలలోచనా! ప్రమథాధిప! సుగుణాలవాల! తే నమోనమో
పురహార! భవహార! పురుహూతార్చిత! నరవరదాయక! నమోనమో
తరణికంటిపుర పరిపాలక! కిన్నరనాయకసఖ! నమోనమో

## ౨. కీర్తన - ఆదితాళం - హిందోళరాగం

నరహరి విగ్రహా! నమోనమో శ్రీ నారద సన్నుత! నమోనమో
పురుహూత సన్నుత చరణ సరోరుహా! నరసఖ! భవతే నమోనమో
సరసిజ లోచన జగదీశ్వర! మందరధర! తే నమోనమో
కరుణా సాగర ఘననిభవర్ణ! నరవర! సన్నుత నమోనమో
గరుడ గమన శ్రీ కౌస్తుభ మణికంధర! హార! తే నమోనమో
శ్రీ రమణీశ్వర! సేవిత జనమందార ధరారుహా! నమోనమో
మరుధీర! మా మిళ్ళపల్లి శ్రీ నారాయణ! తే నమోనమో

## గణపతి స్తుతి - పంచచామరం

ఉమాకుమార మేకదంత మాఖురాజ వాహనమ్
భుజంగ యజ్ఞసూత్ర మిందు ఖండమౌళి భూషణమ్
అనేకపాధి పాననమ్ షడాన నాగ్రజమ్ ముదా
నిరంతరాయదాయకమ్ భజామి శ్రీ వినాయకమ్ ౪

## ఆంజనేయస్తోత్రం - రథోద్ధతాలు

శ్రీ రఘూత్తమ పదాబ్జ బంభరమ్
జానకీ హృదయ శోక భంజనమ్
ధీనిధిమ్ తరణికంటి మందిరమ్
భావయామి హృది వాయునందనమ్ ౫

అంజనా జఠరశుక్తి మౌక్తికమ్!
సింధు లంఘన వితండ జాంఘికమ్!

ఉల్లస త్తరణికంటి పాలకమ్!
నౌమి వాయుసుత మిష్ట దాయకమ్ ౬

కృతిపతి నామగర్భిత ప్రహేళిక - సీసం

సీ. శ్రీరమ్య ముగవిప్ర నారాయణ చరిత్ర
మెవరు జెప్పించిరి యిష్టముగను పోతము
తగదెల్పు మనినవా ధన్యుని నామంబు సీరము
నేర్పుతో వివరింతు నిక్కముగను తూణీరం
నావ హాలంబు బాణంబుల పొది యొంటి ఒకండు
చూస్తిమి కోరిక జ్యోత్స్న, తూడు కంటిమి
కర్మంది మరియును, కల్కి వాహనమును చనవు
సమయ మివెల్లను చతురమతిని కైరవి
అక్షరంబుల మూడింట నమర వ్రాసి బిసము
నడిమి యక్షర ములుదీయ నయము గాను విరాగి
కర్త పేరగు చుండునీ క్ష్మాతలమున హయము
సూక్ష్మ బుద్ధి గ్రహించుడీ సుచిర మతులు గడువు ౭

# అవతారిక

ద్వి. :—శ్రీ రమణీశుని సేవించి శివుని ౧
కూరిమి తోడుత గొలిచి పద్మజుని
సన్నుతి గావించి జలనిధి కన్య
నెన్ని శాంకరి భజియించి యుమ్రొక్కి
భారతీ దేవిని ప్రార్థన జేసి
వారణ ముఖుని సద్భక్తి భజించి

వ్యాస వాల్మీకుల వర్ణించి కాళి
దాసాదులకును వందన మాచరించి
నన్నయ్యభట్టు ననంతు పెద్దన్న
చిన్నను నుతించి శ్రీనాథు బొగడి
సరససంగీత విచార కోవిదుల
భరత శాస్త్రజ్ఞుల ప్రౌఢిమ దలచి
అవనిలో నేనొక్క యాళ్వారు చరిత
కవులెన్న గా యక్ష గానంబు జేయ
దలచి యున్నంతన ధర్మ శీలుండు
జలజాక్ష భక్తుండు సత్యవ్రతుండు
సురభి వంశాభోధి సోముండు కృష్ణ
నరవరు నకుకూర్మి నందమందైన
నరస రాయక్షితి నాథ చంద్రుండు
పరమోత్స వమున న భాసీను డగుచు ౧౦

నను సింగపట్టణ నరసింహ దేవ
ఘన వినతాలబ్ధ కవితా ప్రవీణ
నయశాలి వెల్లూరి నరసింగ కవిని
ప్రియము తో దుత బిలిపించి రమ్యముగ
నీవు గల్పింప బూనిన యాళువారు
పావన చరితంబు భవ్యంబు గాను
మామిళ్ళ పల్లి నృసింహ స్వామి దివ్య
నామాంకి తముగ నొనర్పు మటంచు
జాంబూనద మణిభూషణ యుత దివ్య
తాంబూల మొసగ నుత్సాహంబు తోడ
అలరి నామది యందు నంతట నేను
పలికెద విబుధు లేర్పడగ వినుండు ౧౬

# 2 ద్వి. బాలరంగస్వామి వేషం

సూత్రధారుడు - ద్విపద - 2

శ్రీమహితుండు నాశ్రిత రక్షకుండు
మామిళ్ళ పల్లిశ్రీ మందిర స్థితుడు
నారసింహుడు మహోన్నత భుజాంతరుడు
శ్రీరంగ ధాముడై శృంగార మగను
కరకంక ణంబులు కంఠ మాలికలు
సురుచిర నవరత్న శోభిత దివ్య
హారముల్పుష్య రాగాంగు ళీయములు
హీరాంగ దంబులు హేమాంబ రంబు
గరిమ ముత్యాల చౌకట్ల పోగులును
పిరిమించు చుండు మంజీరముల్ హొయలు
గులుకగా ధరియించి కోటి కందర్ప
విలసిత సుందర విగ్రహంబు నను
కలపంబు నలది వేడ్కలు రంజిలంగ
పలుకుల నమృత మేర్పడ గుల్కుచుండ
బంగారు దుప్పటి వలెవాటు వైచి
రంగుగా నవరత్న రవణంపు వేత్ర
నాళము బూని విన్నాణంబు తోడ
నాళీక ముఖభవ్య నానామ రేంద్రు
లెన్నుచు నుండ మౌనీంద్రులు బొగడ
-చిన్నారి రంగడు చెలువుగా వచ్చె ౧౨

(రంగడు తెరవెడలి)

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి
మంగళాశాసనము - శార్దూలం

శ్రీమామిళ్ళ పురీ నిశాంతుడగు లక్ష్మీ నారసింహాఖ్యుండు ని
త్యా మోదంబుగ బ్రోచు శ్రీ సురభి వంశాంబోధి రాకానిశా
సోముణ్ కృష్ణనృపాలు కూర్మి తనయున్ సుజ్ఞాన రత్నాకరున్
రామానూతన పంచబాణు నరసా రాయ క్షమాకాంతునిన్ 8

కృత్యంకిత స్వామి స్తుతి

సీ. శ్రీమించు జలధర శ్యామ లాంగము వాడు
కౌస్తుభ మణి పథకంబు వాడు
తొగల రాయని జిగి నగుమోము గలవాడు
కంబు నిభంబైన గళము వాడు
నవరత్న ఖచిత సుందర కిరీటము వాడు
రాజీవ పత్ర నేత్రముల వాడు
క్రొన్నన విల్తుని గన్న చక్కని వాడు
జిలుగు బంగారు దువ్వలువ వాడు

తే. కరములను శంఖు చక్రముల్ గలుగు వాడు
కరుణ గలవాడు శ్రీరంగ దురము వాడు
మేలు మామిళ్లపల్లి పుర మేలువాడు
స్థిరతర సుకీర్తి శ్రీ నారసింహ మూర్తి ౯

౩. చెణుకు - ఏకతాళం - ఆనందభైరవిరాగం

పాహి శ్రీరమా మనోహరా - మామిళ్ల పల్లి
పాల ధృత వసుంధరా ధరా! —పాహి
పాహి గరుడవాహా! శే, షాహిశయన
మోహనాంగ దైత్యరాట్సమూహ జలద గంధవాహా —పాహి

వారిజాత పత్రలోచనా! తపనీయ వసన
భూరికలుష జాల మోచనా!
ధీర భక్తలోక మందార భూరుహా సుమేరు
ధీర వారినిధి గభీర, తారహార కీర్తిసార! —పాహి

కాండచర లలామ భేదకా! వైకుంఠ వే
దండ వాంఛితాహి సూదకా!
కాండజాత సంభవాండ భాండగణ పిచండ రత్న
కుండలాంశు కాండలసిత గండమండల ప్రకాండ —పాహి

నీలమేఘ వర్ణసుందరా! శీతాంశు శకల
ఫాల దివ్యకంబు కంధరా!
శైలజా నతాంఘ్రి పద్మ, పాలితా మరా కృపాల
వాల భవ్యశీల రిపువిఫాల సామగాన లోల —పాహి

# లక్ష్మీదేవి వేషం

*శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి*

*శ్రీ మామిళ్ల పురీ నిశాంతుడు — పునరావృత్తి*

*౪ తెరవెళ్ళే దరువు - ఆదితాళం - భూపాలరాగం*

లక్ష్మీదేవి వచ్చెను, ముద్దుల గుమ్మ, లక్ష్మీదేవి వచ్చెను
లక్ష్మీదేవి వచ్చె లక్షణ వతులాది
లక్ష్మికి సరియాని లక్షించి చూడగ! —లక్ష్మి

పతి పాదము తనమతి లోన దలచుచు
అతిభక్తి తోడుత వ్రతము సల్పుచు నుండు —లక్ష్మి

క్షితిలోన యిటువంటి సతిగల్గు నేయని
సతతంబు బుధులెల్ల నుతియించు చుండగ —లక్ష్మి

ప్రతి:- వ. మీరెవరో వృత్తాంతమంతా చెప్పక రావే అమ్మయ్యా!

లక్ష్మి - దరువు - అటతాళం - సారంగ రాగం.

దేవినే - లక్ష్మి - దేవినే

భావాము లోపల పతికంటె నన్య
దైవాము లేదాని తలచూచు నుండేటి —దేవి

పతియాజ్ఞ మీరిన యతివాల కెల్ల, దు
ర్గతి గలుగు నంచు వక్కాణించు చుండేటి —దేవి

మామిళ్ల పల్లి శ్రీ స్వామిని నమ్మిన
క్షేమాము గలుగును సిద్ధమను చుండేటి —దేవి

3 ద్వి ఎలనాగ వినవమ్మ ఏక చిత్తమున
తెలిపెద నీకును తేట తెల్లముగ
ఆది యందున స్వయం వ్యక్తంబు లైన
వేదంబు లవి ధాత్రి వెలయింప జేసి
తలచుగా ధర్మ శాస్త్రముల చందమున
చరియించు చుండెటి జగతీ సురులును
మానక పాలు మున్మారు నొసంగు
ధేను గణంబులు త్రికరణంబు గను
దాన మొసంగుచు ధర్మాత్ము లైన
మానవుల్ లోభంబు మానిన వారు
సతతంబు పతిభక్తి పలుపుచు నుండు
సతులు నేవేళను సత్య వాక్యములు
పలుకుచు నుండెడు వారు పూజితులు

ఇల వీరి మహిమచే నింపొందు చుండు
వారిలోపల పతి వ్రతలను మేము
ఆరూఢిగా లక్ష్మి యందురు నన్ను 8

ప్రతి:- వ. పుణ్యా సతుల మహిమ యెట్టిదో తెలుపవే అమ్మయ్యా

౯. లక్ష్మిసతీ మహిమ - దరువు - అటతాళం - కానడ రాగం.

సతుల మహిమ చేతను, ఈరేడు, జగమూలు విలసిల్లును
మతిలోన నూహించి నుతియించ తరమౌనె —సతు
వానాలు గురియూట - పంటాలు బండూట
దానాము సేయూట - ధర్మాము నిలుచుట —సతు
తరులు ఫలించుట - గిరులు గదలకుంట
ధరణీ సురులు విద్య - పరిపూర్ణు లై యుంట —సతు
పఱూల తోపాల - నీరాము లుండూట
వారి రాసులెల్ల మేరదప్పక యుంట —సతు

వ. ఇంకా చెప్పెదను వినవే తల్లీ!

౧౦ దరువు — అటతాళం - దర్బారీ కానడ రాగం

పతియె దైవమాని భావించ రమ్మ!
సతుల మహిమ లెన్న శక్యామె కొమ్మ!
జలరాసు లెల్లాను చెలిమె లౌనమ్మా!
పులిని జూచిన జింకవలె దోచు నమ్మా!
ఎలనాగ లకునెల్ల నిది ధర్మమమ్మా!
అనిలా సాఖుడు చల్లనై యుండు నమ్మా!
జనులెల్లా భృత్యూలై చరియింతు రమ్మా!
ఫణులు పూదండాల వలె నుండు నమ్మా!

అనుమాన మేల చయ్యాన నమ్మ వమ్మా!
గరళాము అమృతమై కనుపట్టు నమ్మ!
సురగిరి శిలవోలె జూపట్టు నమ్మ!
సురలు మౌనులెల్ల స్తుతియింతు రమ్మ!

ప్రతీ:- వ. ఇంక పతివ్రతా ధర్మాలు తెలుపవే అమ్మయ్యా.

## పతివ్రతా ధర్మము

4 ద్వి. అనుదిన మత్తకు ననుకూల ముగను
కనుసన్న జరియింప గావలె నమ్మ
మామకు బదులొక్క మాటాడ రాదు
వేమరు గురువుల వినుతింప వలయు
ఇరుగిండ్ల కేవేళ నేగగ రాదు
పొరుగు వారికి మర్మములు జెప్పరాదు
పతి సమ్మతిని గొని పదిలంబు గాను
వ్రతములు సల్పగా వలె వేడ్క తోడ
కలహ మెవ్వరి తోడ గావింప రాదు
కలనైన సత్య వాక్యము దప్ప రాదు
అతిథి గృహంబున కరుగు దెంచినను
అతడు సాక్షాద్విష్ణు డని భక్తి తోడ
కడుకొద్ది భుజియింప గాజేయ వలయు
కొలిచిన వారికి కొదువ లేకుండ
నడిపించ వలెను మన్నన యుండ వలయు
జడత యుండగ రాదు సకల కార్యముల
చుట్టాల ప్రేమతో జూడంగ వలయు
గట్టువాయిని కురంగట నుంచ రాదు
వినవమ్మ నేను జెప్పిన రీతిగాక

ఘనమైన గుణము లింకను కొన్ని గలవు
ఇంత సద్గుణవతి యెందు లేదనుచు
కాంత లెన్నగ కీర్తి గాంచంగ వలయు

సీ. ఇంటికి తనపతి యేతెంచు చుండగ
నల్లంత టను జూచి యతిము దముచ
ఎదురుగా బోయి తత్పదములు గడిగియు
జలములు శిరమున జల్లు కొనియు
తడియొత్తి యటమీద స్నానంబు జేయించి
ఇష్ట భోజనముః సేయించి పిదప
ఆకులు మడచి చయ్యన చేతి కందించి
కనుసన్న దెలిసి చందన మలంది

తే. సురటి చేకొని విసరి భాసురము గాను
అతడె దైవంబ టంచును మతి దలంచి
మెల్లన పదంబు లొత్తుచు నుల్లమలర
వలసి నటువంటి సేవలు సలుప వలయు ౧౦

# అతిథి వేషం

(తెరలో)

*శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి*

*శ్రీ మామిళ్ళ పురీ నిశాంతుడు — పునరావృత్తి*

సతి:- వ. ఇప్పుడు వేంచేసిన వారెవ్వరయ్యా స్వామీ!

అతి:- తే. అతిథి భూసురుడను నేను అవని యందు
వచ్చితిని నేటి దివసమీ పట్టణ మున
పుణ్యవతి యింట భిక్షను బుచ్చు కొందు
చెప్పు మాయొక్క సతిపేరు శీఘ్ర ముగను ౧౧

పతి:-సీ. పతియె దైవంబని బహుభక్తి తోడుత
సతతంబు మదిలోన సంస్మరించు
అభ్యాగ తులకెల్ల నను దినంబును వాంఛ
తీర భోజనమిడి గారవించు
నియమంబు తోడుత నిఖిల వ్రతంబులు
సలుపుచు నుండు నిశ్చయము గాను
కలనైన యితర సంకల్పంబు లేకుండు
గాంభీర్య వినయముల్ గలిగి యుండు

తే. పరుష వాక్యంబు లెన్నడు బలుక కుండు
దయ గలిగియుండు సత్యంబు దప్ప కుండు
ననుచు జనులెన్న ధరణి ప్రఖ్యాతి గాంచె
లలిత సద్గుణ నికురంబ లక్ష్మమాంబ ౧౨

అతి:- అయిన వెళ్లి మే మాసాధ్విని దర్శించెదము (పరిక్రమించి)
"భవతీ భిక్షాం దేహి"

లక్ష్మి:-తే. స్వాగతం బతిథి వర్య సుస్వాగ తంబు
ఆక టంబడి వచ్చినా రలసి సొలసి
భోజనము సిద్ధమయ్యెను పొలుపు మీర
ఆరగించగ రండి యనుగ్ర హించి ౧౩

అతి:- వ. సాధ్వీమణీ! నీకు సంతానము గలదా?

కం. ధన కనక వస్తు వాహన
కనకా భరణంబు లెన్ని గలిగిన గానిన్

తనయులు గలుగక నుండిన
వనితా జన్మంబు దలప వ్యర్థము కాదే! ౧౪

లక్ష్మి:-తే. మంద భాగ్యుల మయ్యా మాయందు కరుణ
దలచి దైవప్ర సాదంబు వలె దలంచి
భుక్తి గొమడయ్యా మాయింట పుణ్య చరిత
ఆరగింపగ రారయ్యా అతిథివర్య! ౧౫

అతి:-వ. అతివా! మేము సంతానము లేని యింట భిక్ష సేయము —
(వెళ్లును)

# నారాయణుని వేషం

(తెరలో)

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి
శ్రీమామిళ్ళ పురీ నిశాంతుడు — పునరావృత్తి

ల. తెరవెళ్ళేదరువు - ఆదితాళం - హంసధ్వని రాగం.

నారాయణుడు వచ్చేను - జను లెన్నాగ - నారాయణుడు...
నారాయ ణుండితడు ధారుణీ సురలందు
అరూఢిగా నాని నరులెన్ను చుండాగ —నారా

సారేకు మతియందునా కూరిమి తోడా,
శ్రీరమణు స్మరియించు చూ
వారాక పురిలోని వ్యవహారమూలు, సం
సారాము వేమారు దూరాము జేయుచు —నారా

సూ-:కం. శ్రీరమ ణీశుని పాదాం
భోరుహ యుగళంబు చిత్తమున దల్చుచు శ్రీ
నారాయణ బుధుడింటికి
చేరం జనుదేరి యతడు చెలి కిట్లనియెన్ ౧౬

౯. నారా - దరువు - కుఱుచ జంపె — శ్యామ రాగం.

చిన్న బోయిన వేమె చెలియా! ఎవ్వరే మన్నారు
చిన్నబోయిన వేమె చెలియా, తెలుపావె చెలియా -
కొదువ యేమాయేనే నీకు, చింత,
మదిలోన నుంచాగ బోకు —చిన్న
జలజాక్షు భక్తితో వ్రతము
నలుపు చుందువె సంతతము —చిన్న

లక్ష్మి:-తే. స్వామి ఈనాడు మధ్యాహ్న సమయ మందు
అతిథి వచ్చిన భిక్ష గోమ్మంచు బలుక
నతడు పిల్లలు లేని గృహంబు నందు
భోజనము సేయ ననియెను భూసురేంద్ర! ౧౭

కం. ధనకనక వస్తు వాహన — పునరా వృత్తి

నారా:-వ. వనితా! ఊరడిల్లు మూరడిల్లుము ఇందులకు మ
నకానంద కిశోరుడే శరణము

౧౦. ఇద్దరు - దరువు - ఆదితాళం - భీంప్లాసు రాగం.

దేవాకిసుత గోవింద! నారాయణా! వాసుదేవా!
దేవా! జగదీశా! హా దేవ నారాయణా!
తనయం దేహిమే! శ్రీకృష్ణ! నారాయణా!
త్వా మహం శరణంగత శ్రీ నారాయణా! —దేవా
సహకార పట్టణవాస నారాయణా! లక్ష్మి
సహిత దివ్య వక్షస్థల నారాయణా! —దేవా

# ఎఱుకల వేషం

## 5. సూత్ర-ద్విపద

శ్రీవాసు దేవుండు శిష్ట రక్షకుడు
భావజ జనకుండు భవ్య శీలుండు
సరసిజ నేత్రుండు జలద గాత్రుండు
ధరణీ కళత్రుండు దళిత శాత్రుండు
పరగ శ్రీమామిళ్ల పల్లి వాసుండు
నరసింహ మూర్తి బృందార కార్చితుడు
అరయ మండంగుడి యను పురంబు నను
సరవి నారాయణ సతియైన లక్ష్మి
సంతతికై మాన సంబున చాల
చింత జేయ నెఱుక జెప్పగా దలచి
సొంపుగా నుదుట చక్కగ చుక్కబెట్టి
జంపులు బొగిడీలు సవరపు కుప్పి
అందమైనట్టి ముత్యాల కమ్మలును
సందిదండలు బన్నసరము రాకిణియు
పచ్చలు దాపిన పాపెట బొట్టు
మెచ్చైన కాంతుల మించు నేవళము
మణి హారములు రత్న మంజీరములును
గణన కెక్కిన రత్న కంకణం బులును
ధరియించి మణి ఖచితంబైన బుట్టి
శిరమున వహియించి చేత వజ్రంపు
బెత్తంబు బూని సంప్రీతి తోడుతను
చిత్తజున్మని చేతి చిల్కయో యనగ
జల్తారు చీర మేల్జాలీల రవిక
తళుకులు గుల్కు కుందనపు రత్నంపు

గిలక వాయించుచు కిలకిల నవ్వు
లొలుక నమృతపు పల్కులం జిల్కుచుండ
కళ లుల్లసిల నెఱుకల సాని యగుచు
కలహంస గతి హొయల్ గానేగు దెంచె. 14.

(తెరలో)

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి
శ్రీ మామిళ్లపురీ నికాంతుడు — పునరావృత్తం

౧౧. తెరవెళ్లె దరువు - అటతాళం-మోహన రాగం

ఎఱుకాల సతి వచ్చెను-అవ్వో యవ్వ! ఎఱుకాల సతివచ్చెను!
ఎఱుకాల సతివచ్చె పరమాను రాగ సం
భరితాయై మామిళ్ల పల్లి శౌరి దలచూచు - ఎరు
సొగసు గుబాళించగా - పువ్వుల దండ
ఘుగఘుగ వాసించగా

తొగల రాయనిజిగి దెగెడూచు నుండేటి
మొగను నందున చిన్నినగ వంకు రింపాగ - ఎరు
తిరమూగ మేలెంచుచూ, "ఊకో" యాని
బురుకాని లాలించుచూ

అరుదూగ జన వశ్యమైన యంజనాము
సిరిగుల్క నుదుట కస్తురిచుక్క బెటియు - ఎరు

ప్రతీ-కం- ఎందుండి వచ్చితివి ? నీ
వెందుల కేగెదవు ? నగర మెయ్యేది ? పేరే
మందురు మాతో బలుకవె ?
ఇందిందిర సదృశ వేణి, ఎరుకల సానీ ! ౧౫

ఎఱు:-సీ. శ్రీమించు కొల్లాపురీ మహాలక్ష్మి మా
కిష్టదైవంబు రాకేందు వదన
అఖిల విద్యా రహస్యంబులు మాకును
కరతలా మలకముల్ కంబుకంఠి
సతతంబు భూత భావిత వర్తమానముల్
బట్ట బైలై యుండు భాగ్యశాలి
బల్లి పల్కులు పాల పసిడి కంటెల పక్షి
శకునంబు లెరుగుదు సదమలాంగి

కులము ఎరుకల సంతతి కుందరదన
గృహము పేంద్ర పురంబగు కీరవాణి
చెలువు డిష్టార్థదాయి యే సింగరయ్య
పేరు సోదెల కర్తెంద్రు వారిజాక్షి ! ౧౯

కం. ఎఱుకడిగి రాజులందరు
ఎఱుకవలెన్ గాదటంచు నిచ్చిరి కోర్కెల్
ఎఱుకడుగరె నే జెప్పెద
బుఱుకట తరుకటల ప్రొద్దు బుచ్చక తరుణీ ! ౨౦

౧౨. దరువు - ఆదితాళం - కల్యాణి రాగం

ఎఱుకా వారమమ్మా! మే మెఱుకా వారాము
ఎఱుకా వారమఖిలా భూమి వరులకెల్లా-తారార్కుణ మూగ
ఎఱుకా జెప్పి దేశమూలు చరియించు చుందుము —ఎఱు
అరటిపండు వలిచి చేతి కందియిచ్చి నట్లుగాను
మరుగు లేక యుండగాను, ఎరుకా జెప్పు చుండేటి —ఎఱు
ఘనవేణిరో! కన్నెకల మనసూన దలచీన తలపూను
అనుమానమూ లేకుండ బనులకెల్లా తెలియ బలుకు —ఎఱు

కల్లాగాదు నామాట కొల్లాపురీ లక్ష్మితోడు
ఎల్లవారి చిత్తాము రంజల్లగా గద్దె జెప్పు చుండేటి —ఎఱు
శ్రీ మామిళ్లపలి నగర ధాముడైన శ్రీనరసింహ
స్వామి పాద పంకజములు వేమారు దలచుచు నుండు —ఎఱు

సూ : వ. అపుడు లక్ష్మీదేవి చెలికత్తె లామె చెంతకేగి ననిరట యెటువలెను.

చెలి :- తే. అమ్మరో! నీవు సంతతి కొఱకు చాల
నహరహంబును చింత సేయంగ నేల
ఎఱుక జెప్పెదనని యొక యిందువదన
వచ్చినది యాపుడుగనె వాంఛదీర!

లక్ష్మి :- వ. ఆ ఎఱుక సాని యెట్లున్నదో చెప్పవే!

చెలి :- సీ. కనక రత్నప్రభా కలితమై తగుజుట్టు
కొమరెంచగా నొక్క కోటిజేయు
దరహాస యుక్తమౌ తరుణీ ముఖంబును
దలచగా నొక్క పద్మంబు జేయు
శుభరేఖలను చాల నింపొందు భామినీ
కంఠంబు నొక్క శంఖంబు జేయు
మృదు రోమరాజి సొంపరచేత పిలసిల్లు
తరుణి యా రోమ యనంతంబు జేయు
రమణి యవలగ్న మొక్క శూన్యంబు జేయు

తే. అలన పల్కులి చందంబు లతుకజేయు
కామినీమణి! నా మాట కల్లగాదు
వనిత సౌందర్యమెంచ నా వశము గాదు ౨౨

లక్ష్మి :- తే. చక్కనిది దృశ్యమైన జాణ యనుచు
చాల యెఱుకల సానిని సన్నుతింతు

వైన యిపుడొక ముచ్చట యడుగ వలయు
యిచ్చటికి దోడుకొని రమ్మ యిందువదన ! ౨౩

సూ :- వ. అని యాజ్ఞాపించిన నది జని వేగంబు తో డ్తెచ్చిన లక్ష్మీదేవి యెఱుకల సానిం జూచి.

లక్ష్మి :- తే. ఎఱుక జెప్పెదనని వచియించె దీవు
మత్త సామజయాన ! నా మానసమున
దలచి నట్టి పని యథార్థంబు గాను
తెలిపెదవె వేగ యిపుడు సందియము లేక ! ౨౪

ఎఱు :- ఆ. పూస గ్రుచ్చినట్లు వీసర బోకుండ
తలచుకొన్న తలపు తథ్యముగను
పలుక నేర్తు నలువ వ్రాలుదప్పిన నాదు
మాట దప్పదమ్మ మందగమన ! ౨౫

చెలి:- వ. నీవు యెవరెవరికి యెఱుక జెప్పినావో ? చెప్పవే యెఱుకలసాని !

ఎఱుకలసాని చెప్పిన ఎఱుకల వైనం

౧౩. ఎఱు-చెఱుకు-త్రిపుటతాళం-ఆనందభైరవిరాగం

ఇందూని భాస్వ ! పురందారు సతికినే నందాముగా జెప్పి తెఱుకా
అవ్వోయవ్వ ! యెఱుకా ! శ్రీరంగనాథా ఎఱుకా !

ఊహించి మదిని సందేహంబు దీరగ, స్వాహాదేవికి జెప్పి తెఱుక
తరణి తనూజుని తరుణికి మనసూని గురిపొడ జెప్పితి యెఱుక
అసుర నాయకూని బింరూహ పాణికి కొసరి కొసరి చెప్పి తెఱుక
వరుణూని సుందారి కరలేక చిత్తము గరగంగ జెప్పితి ఎఱుక
కోరిక మీర సమీర వధూటికి నేరూపుతో జెప్పి తెఱుక

సొంపూగ ధనదూని చంపాకగంధి మోహింపగ జెప్పితి యెఱుక
ఫాల లోచనూని వాలుగంటి మేలు మేలాన జెప్పితి యెఱుక
పల్లవపాణి మామిళ్లపల్లి హారి చల్లానిదయ జెప్పి తెఱుక
అవ్వోయవ్వ! ఎఱుక!

చెలి:- వ. ఎఱుక జెప్పిన నీకు యెవ రెవరేమిచ్చిరే
యెఱుకసానీ!

౧౭. ఎఱు-చెఱుకు-త్రిపుట-భైరవిరాగం

ఇందిరా దేవికి ఎఱుకనే జెప్పిన సంది దండలిచ్చె నివిగో! యవ్వా
సొంపుగ వాణికి సోదెజెప్పిన కుంద సంపు రాకిణి యిచ్చె
నిదిగో! యవ్వా
హెచ్చుగ గౌరికి ఎఱుకజెప్పగ మేలి, పచ్చహారము లిచ్చె
నివిగో! యవ్వా

సీ. ఎఱుక జెప్పినమెచ్చి యిచ్చెను రుక్మిణి
పంజాలకిమ్మలు పద్మగంధి
అతిభక్తితో జాంబవతి యొసంగెను మాకు
పగడాల చొకట్లు భాసురముగ
పాటివచ్చిన సత్యభామ యొసంగెను
కెంపుల బొగిడీలు సొంపుగాను
కాళింది యెఱుక తార్కాణయానని యిచ్చె
ముత్యాల ముక్కర ముదము తోడ

తే. సందిబొంది యిల్లి దె మిత్రవింద యొసగె
చెలువమగు తావళము నాగ్నిజిత్తి యొసగె
భద్ర యిచ్చెను పచ్చలపతక మొకటి
లక్షణ యొసంగె నివిగో మేల్కంకణములు

ద్వి ది. :- అంగ వంగ కళింగ యవన సౌరాష్ట్ర
బంగాళ నేపాళ పాంచాల మత్స్య
శూరసేనావంతి చోళ సుధేష్ణ
సౌరాష్ట్ర కొంకణ శక విదర్భాంధ్ర
కురు కేకయ మరాట కుంతల ముఖ్య
నరవరోత్తముల కాంతల కెలుకాడి
కోరిన సొమ్ములు కొదువ లేకుండ
పేరుపేరైనట్టి బిరుదులు దెచ్చి
ఖ్యాతి గాంచితిమి నిక్కంబుగా మేము
మా తోడివారలీ మహిలోన గలరె
అదిగాక యోగమాయా బలంబునను
వదునాల్గు జగముల వార్తలు దెలుసు
ఆగమ తంత్ర రహస్య పురాణ
యోగ శాస్త్రంబులు యోగవాగములు
మోహనోచ్చాటనములును సంగీత
సాహిత్య దేశభాషా లిపిజ్ఞాన
స్వరశాస్త్ర భరత శాస్త్రముల మర్మముల
తెలుగు లెఱుంగుదు తేటతెల్లముగ
ఇట్టి చూడుమునున్న ఈ కోల బట్టి
బుట్టికి లెన్నగా మ్రొక్కడుగవమ్మ

సూత్ర :- తే. జగతి లక్ష్మికి యెఱుక జెప్పంగ దలచి
ఎదురుగా తాను గూర్చుండి ముదము తోడ
మనసులో కోర్కెలడుగవే యనుచు బలికి
ఇష్ట దైవంబులను నుతియించె నపుడు –రా

# అష్టోత్తర శత దివ్య దేశ స్తోత్రం

ఏలః- 7. ద్విం. శ్రీరమణీశ్వర! చిత్తజ జనక !
నారాయణా! జగన్నాథ! నా స్వామి !
మేలుగా నూటెని మిది తిర్పతులను
పాలించు శ్రీ పరబ్రహ్మ స్వరూప
పరమాత్మ మామిళ్ళ పల్లినివాస
స్థిరముగా మమ్మేలు శ్రీనారసింహా
"ఏక చిత్తమున మిమ్మెప్పుడు గొలుతు
నాకొసంగుము వాకు వసుధాకళత్ర !
పొలుపొంద వైకుంఠపుర వాసుదేవ
సలలితామోద కర్షణ నామధేయ
వరద ప్రమోదస్థ ప్రద్యుమ్నదేవ
మురదైత్యవారణ సమ్మోదా నిరుద్ధ
భాను మండలవాస పద్మామయి తాను
శ్రీనైమిశాటన స్థిత హరిమూర్తి
క్షీరాంబునిధి వాస శేషశయాన
ద్వారవతీశ యాదవవంశ నాథ
ధరణి శ్వేతద్వీప తారక మూర్తి
తరణి సంకాశ శ్రీవర్ధశయాన
బృందావన స్థల ప్రియ నందగోప
నందన శ్రీ భక్తనయన భవఘ్న
గోవర్ధనస్థల గోప కాళింది
గోవింద సువ్రజ గోపికానాథ
మధుసూదనాఖ్య గోమంతాద్రి శౌరి
ఘద చిత్రకూట రాఘవరామ తులసి
వన గదాపాణి యవంతి భూనాథ

శ్రీ కూర్మధర కూర్మ, శ్వేతాద్రి సింహా
ప్రాకటగుణ యహోబల నారసింహా
భాసురా యోధ్యాధిపతి రఘురామ
భూసురమత కాశి భోగిశయాన
అహిశయానా! కాకులాంధ్రాది నాథ
మహి వెంకటాద్రి రమాసఖ స్వామి
రహి హరిక్షేత్ర సాలగ్రామ మూర్తి
కర మొప్పగాను గంగా సాగరమున
సిరిగుల్కు చుండేటి శ్రీవిష్ణుమూర్తి
అరయంగ బదరి నారాయణ వటు
సరసీతటస్థ విజయ రాఘవేంద్ర!
కురుకా రమాసఖ! గోష్ఠపురస్థ
వరగోష్ఠపతి! శ్రీనివాసస్థ పూర్ణ
వారణా చలవాస! వరద ముకుంద
గారుడాద్రి హిరణ్యకశిపు సంహార
కాంచీపురి యథోక్త కారణదేవ!
పంచాస్త్రసుందర పాండవదూత
దేవ శుభాకార దేవాధినాథ
దేవాష్టభుజరూప! దీపప్రకాశ
గరిమ శేషాకార! ఘన నిభాకార
వరశుభాకార! ప్రవాళాభవర్ణ!
హరి! పరమేశ! పురాశ్రయ! స్వామి
వరనామ! కోటిశుభప్రదమూర్తి
నందసువ్రజ! మహానంద స్వరూప!
మందరోద్ధార కామాసికి నృహరి
ఖండితాహిత త్రివిక్రమ దేవ చంద్ర

ఖండామృతప్రభ కాంచీ పురమున
పదునెనిమిది చోట్ల ప్రబలిన స్వామి
ముదము తోడుత నీకు మ్రొక్కెద నయ్య
శ్రీరంగనగర సంస్థిత జగన్నాథ
శ్రీరామ జానకీప్రియ జగన్నాథ
మణివర్ణ యుత్పలావర్తన శౌరి
మణి మంటపస్థిత మల్లారి మూర్తి
గజ గజార్తిఘ్న యాకాశస్థిత హరి
నిజముగా నిబిడ శ్రీ నిఖిల స్వరూప
శీఘ్రంబుగా వాక్కు సెలవీయ వయ్య
వ్యాఘ్రపురీ మహోబాహు స్వరూప
యదుశైల నారాయణా పాండురంగ
సదనవిఠ్ఠల కృత శౌచాఘహరణ
సరవితోడ ననంత శయన నివాస
అరవింద నాభాచ్యుతా నంతరూప !
వసుమతి వృషభాద్రి వరసుందరాంగ
రసిక శేఖర భ్రమరస్థ బలాఢ్య
సరస హరిద్వార జగదధినాథ
సురుచిరంబుగ ధర్మసుస్థల శయన
తిలకింపగాను నందిగ్రామ భవ్య
నిలయ రాఘువహార ! నీలశైలేంద్ర
పురుషోత్తమ ప్రభాస భూరి స్వరూప
హరి ధర్మపురము యోగానందమూర్తి
వైకుంఠ మాధవ ! భార్గవ భర్గ
శ్రీకుంభ ఘోణ శార్ఙ్గి ! చిత్రకూట
గోవింద ! భాసుర క్షుద్రనదిస్థ

పావనాచ్యుత శుభ్రపద ఖండనస్థ
వారచాపహారణ భక్తాభయదాఖ్య
పురుషోత్తమ సునామ భూభర్తమిత్ర
వరద శరణ్యా! నివాసస్థ శరణ
సదివితోద్ధుత కపిస్థల గజార్తిఘ్న
ధరణి ప్రయాగ మాధవ! గయాస్థాన
వరగదాధర! గోప జగతి గోపాల!
స్వర్ణ స్థలస్థ సువర్ణ కురంగ
పూర్ణ దేవా భక్తపుర భక్తిదాత
చెలగు పార్థస్థల స్థిత పరబ్రహ్మ
కొలిచెద శ్రీకృష్ణ కోటి మధుఘ్న
శ్వేతద్వాదస్థల స్థిత శాంతమూర్తి
భూతసుస్థల శార్ఙ్గ! పురుహూత వినుత
సంగమగ్రామ యసంగ! ధనుష్క
మంగళగౌరి శ్రీమద్వర గుణము
శ్రీనాథ! శ్రీకృష్ణ! శ్రీవరాహాంక!
భాను తేజాహిత పద్మపత్రాక్ష!
ఉత్తమస్థల మహోత్తమ స్వామి
మత్త దైత్యఘ్న! సింహక్షేత్ర పుణ్య
వితతాగ్నిపు సుప్రియ వృద్ధినగర
పతి! వృషా శ్రయ దేవ! భావనాకార
ఉరుతర విభవ మావాసుకాలమేఘ
స్థిర మధురాపురీ స్థిత సుందరాంగ 50

మీ పాదములకును మేము మ్రొక్కెదము
మాపాల గలిగియు మమ్మేల రయ్యా. 51

# అష్టాదశ పీఠ శక్తి స్తోత్రం

౧౨. చెఱుకు - త్రిపుట తాళం - కామవర్ధనీరాగం

శరణు శరణు ! అవ్వోయవ్వ ! శరణు !
శరణు క్రౌంచద్వీప చాముండి, వడ్డాది
గిరిజ, అహిచ్ఛత్ర పుర కామరూపిణి
గరిమ గయా మంగళగౌరి ! భగవాతి
కరుణించవే కంచి కాపురి కామాక్షి - —శరణు

సిరిమించు కురుక్షేత్ర మహామ్మాళు
ఇరవొంద మాహూరి ఏక వీరాశక్తి
కరమొప్పగా పీఠికాపురి పీఠాంబ
పరమిమ్ము ప్రద్యుమ్న వాసి సింహళదేవి —శరణు

జ్వాలవైష్ణవి! లంకశాంకరి సన్నెపుడు
పాలించు శ్రీశైల భ్రమరాంబికాదేవి
నీలవేణి యుజ్జయిని నా మాపుర మహాం
కాళికా భగవతి కాశీ విశాలాక్షి —శరణు

ఆరూఢిగాను ప్రయాగ మాధవి యలం
పూరు జోగుళాంబ పూర్ణేందు బింబాస్య
కూరిమిగల చక్రకోటి మాణిక్యాంబ
కోరిన వాక్కిమ్ము కొల్లాపురి లక్ష్మి - —శరణు

శ్రీమదష్టాదశ సింహాసనములందు
ప్రేమతో నిల్చి శ్రీమామిళ్ళపల్లి
పురధాముడౌ నరసింహస్వామి సో
దరియైన శ్యామలాదేవికి జగదేక మాతకు —శరణు

తే. ముదిత వినవమ్మ నీవొక ముచ్చటడుగ
దలచి నావదిమదిలోన దెలిసె మాకు
యిష్ట దైవంబులకును చేయెత్తి మొక్కి
యడుగవే నీవు జెప్పెద సతి ముదమున ౨౮

జాతీయపు మాటలు

పతిభక్తి గలిగిన దానవే యవ్వా - పారమార్థికు రాలివే యవ్వా
భాగ్యశాలివే యవ్వా - బహు గుణశాలివే యవ్వా
పాపచింత లేనిదానివే యవ్వా - పావనమైన దానివే యవ్వా
దొడ్డవారి బిడ్డవే యవ్వా - తొట్లి గట్టేవే యవ్వా
తొల్లింటి వారిని బోలుదువే యవ్వా-తొళుకు లేని దానివే యవ్వా
త్రొక్కు లాడకువే యవ్వా-తొమ్మిది నెలలు
గర్భము మోసేవే యవ్వా
తొలిచూలు కొడుకును గనేవే యవ్వా - అవ్వోయవ్వా.

౧౬. చెఱుకు-ఆదితాళం-కల్యాణిరాగం

తెలిసి యుండ గదవే! లక్ష్మిదేవి - తెలిసి యుండ గదవే!
జలజాక్షిరో! పుత్ర సంతతి నీకు, కా
వలెనాని తలచితివే! మామిళ్ల పల్లి
నిలయూని గొలిచితివే ఎలుకడుగా ని
శ్చలమూగ నిలచితివే పలుకుల నమ్రుత
మొలుక నన్ బిలిచితివే లక్ష్మిదేవి తెలిసి....

వనిత నీకు హరి వనమాలి కాంశను
తనయూడు జనియించునే ఆతడు పూల
వనమూను పోషించునే దండలుగట్టి

యును శౌరి కర్పించునే — నిత్యానంద
మునను సంచరించునే- — లక్ష్మీదేవి తెలిసి...

చపలత్వ మును లేక సతత మష్టాక్షరి
జపము సల్పుచు నుండునే — మానవ మూన
కపటాము లేకుండునే — అందరియందు
కృపచాల గలిగుండునే — చార్వాకాది
రిపుమాతముల జెండునే — లక్ష్మీదేవి తెలిసి...

ఈ విప్రవరున మోహింప జేసెదనాని
దేవదేవి వచ్చునే ! — ఎంతో వింత
గావించగా జొచ్చునే — తోటలోతనకు
సేవజేయుగ మెచ్చునే — మోహాము తన
భావములో హెచ్చునే — లక్ష్మీదేవి తెలిసి ...

ధనమీయమని వేశ్య జనని పోరాడిన
జని తోటలో జేరునే — ఆహోయాని
మనసూన వేసారునే — విరహాముచేత
వనజనేత్రుని దూరునే — లక్ష్మీదేవి తెలిసి...

రంగాడు వేశ్యాకు బంగారుగిన్నెయొ
సంగ సమ్మతించునే — అప్పుడెవిప్ర
పుంగావు బిలిపించునే — చౌశితిగతుల
సంగాతి లాలించునే — మోహాబ్ధి త
రంగాళి దేలించునే — లక్ష్మీదేవి తెలిసి

తరుణీకి గిన్నెభూసురు డిచ్చె నమమాట
ధరణి యెల్లా మ్రోగునే — అప్పుడె రంగ
దరుదూగ వెంచేయునే — ఇష్టంబైన

వరము కరుణ జేయునే — లక్ష్మి మనో
హరుడు దేహము జొచ్చెనే - లక్ష్మిదేవి తెలిసి

ద్వి. 8. మదవతి వినవమ్మ మామిళ్ళపల్లి
సదయుడౌ శ్రీహరి చల్లని కరుణ
తెలియ బల్కితిని సందియ మింతలేదు
చులకన నీళ్లాడి సుతుని గాంచెదవు
అతడు సద్గుణవంతు డతిశాంత మూర్తి
సతత మష్టాక్షరీ జపపరాయణుడు
హరిభక్తి పరుడు నిత్యానంద శాలి
పరమ భాగవతుండు పంకజ నేత్ర
వనమాలి కాంశ సంభవుడు విజ్ఞాని
ఘనుడిది తప్పదు కడగి నేవచ్చి
తడవాయె సెలవిమ్మ దబ్బర గాదు
బుడుత డూరకను హాపోవు చున్నాడు
సుతుడు బుట్టిన వెన్క చూడ వచ్చెదను
అతి మోదమున నన్ను నప్పుడె మెచ్చి
నీనాథు తోడుత నేర్పున జెప్పి
మానక మరి బహుమానం బొసంగు
పోయి వచ్చెదనమ్మ పుత్తడి బొమ్మ
మాయందు కరుణయు మరువకు మమ్మ
చూసి చూసి యిక చొప్పు గాదనుచు
మా సింగడును వచ్చు మరి వెళ్లివత్తు

# సింగని వేషం

తెరలో:-

శ్రీ మామిళ్లపురీ నిశాంతుడు - పునరావృత్తి

౧౭. తెరవెళ్ళే వెనుక - త్రిపుట - ఆనందభైరవి రాగం

సింగ డదుగో వచ్చెను - అవ్వోయవ్వ - సింగ డదుగో వచ్చెను.

సింగడదుగో వచ్చే అంగాసరో వాని
సింగార మేమాని చెప్పవచ్చు నమ్మ —సింగ
వలనొప్ప వలచేత వంకాలు మెదలైన
పులుగూలు బట్టాగ వలల వేసికొని —సింగ
చికాకము లోపల యుక్కు కొడవలి యొక్క
లిక్కి చక్కగజెక్కి మక్కూన తోడుత —సింగ
ఝూలీకి రాతియు ఝూలికిరా యని
కోలచేత బట్టి కోతి నాడించుచు —సింగ

## జాతీయపు మాటలు

సింగ-ఎక్కడుంటివే సింగీ - ఎంతసేపే సింగీ
బురుకడు పోరు పెడుతున్నడే సింగీ - పోదము రావేసింగీ

ఎఱుు - వస్తినిరా మావా! ఒరే ఒరే మావా!
పదరకురా మావా! పదరా మావా!

( ఇద్దరు వెళ్ళుదురు )

సూత్ర:- తే. ఈ విధంబున శ్రీలక్ష్మి కెఱుక జెప్పి
చనిన తరువాత నా పూర్ణచంద్ర ముఖికి
మహిని నారాయణుని యనుగ్రహము వలన
గర్భ చిహ్నము లెసగెను క్రమము గాను —౨౯

# బాలెంతరాలి వేషం

సూత్ర:- ద్వి. ఘన నిభ వేణికి గర్భ చిహ్నములు
గనపడ బైకలు కడువడి బొడమె
వింత వస్తువులందు వేడ్క జనించె
చింతింపగా చిఱు చెమట జూపట్టె
మంటి పెల్లలమీద మరి వాంఛగలిగె
చంటిమొనల్ నల్పు చాయ వహించె
జలజాక్షి లెపుడు భోజనపాత్ర యందు
కల వంటకంబులు గ్రక్కున నుంచి
ఆరగింపు మటంచు నతి రయంబునను
సారెకు సారెకు సన్నుతించగను
అరుచిచే కొంచెము నారగించి యును
పరుపుపై గూర్చుండు - పడతు లందరును
ఆకు మడుపులు చేతికందించి నాను
చేకొని విడియంబు సేయుచు నుండు
అలసతచే నుస్సురనగా దొడంగు
నలుపెక్కె నూగారు నాభితలంబు
విరివయ్యె చెక్కులు వెలవెల నయ్యె
నురుతరంబుగను నిట్టూర్పులు బుట్టి
నడుము మందంబయ్యె నడుగిడు నెడల
తడబడె బడలిక తనువందు దోచె
వళు లుదరమున నేర్పడియె చేతులను
యిలనూని లేవ నూహింపగా దొడగె.

కం. జలజాక్షికి గర్భంబై
నెలయొక్కటి రెండు మూడు నెలలై నాల్గున్
నెలలై దారేడెనిమిది
నెలలై నవమాసములును నిండిన యంతన్.

లక్ష్మి - (తెరలో) -

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ - పునరావృత్తి

శ్రీ మామిళ్ల పురీ నిశాంతుడు — పునరావృత్తి

౧౭. చెంచు - ఏకతాళం - భైరవి రాగం

నడుము కలుక్కనె వడలాను చెమటాలు
బొడమేను తొడలూను గడగడ వడకేను
నే తాళలేనమ్మా ! ఓయమ్మా !

తలచూగ నొప్పులు తరమూగ నాయెను
తెలవారో యిక నే తెలగూన నోర్తును — నేతాళ

గడియ గడియ కగ్గలమయి తోచేను
పడతిరో కొడుకెపుడు జనియించునో — నేతాళ

సీ. పడతిరో వినవమ్మ కడుపులో బుడబుడ
బిడ్డకుట్లును గనిపించె నమ్మ
తనయుడే వేళకు జనియించునో గాని
తెలియ దిప్పుడు నొప్పు లలవిగావు
మామిళ్లపల్లి శ్రీస్వామికి నామీద
నెప్పుడు దయవచ్చు నేమి సేతు
ఇక నోర్వ వశముగా దీకాన్పు చల్లగా
కడతేర్పరే మీరు కరుణ తోడ

తే. ఆడువారల మర్మంబు లందరికిని
తలచగా నొక్కటెగద తలచి చూడ
మీకు బహుపుణ్య మయ్యేను మేలు గోరి
సఫలమౌ ప్రాణ దానంబొసర్ప రమ్మ ౨౧

౧౯. చెంచు-రూపక తాళం-శివరంజని రాగం

కొడుకు బుట్టిన వెనుక కోరిన సొమ్మిత్తు
నడుమైన బట్టారే పడతు లందారు
ఓయమ్మలార ! నే నెట్లోపుదు నీవేళ
పాయాళ నన్నేలిన బహు పుణ్యమమ్మ —కొడుకు
పట్టు పగ్గము దెచ్చి గట్టిగ దూలానికి
గట్టారే చేతుల బట్టుకో వలెను —కొడుకు
మున్నందరు పిల్లల గన్నవారే కాదా !
నన్ను కడతేర్చారే నలినాక్షులారా ! —కొడుకు

క. కడుపులోన చల్ల కదలక యుండగా
పిన్ననాట నుండి బెరిగి నాము
యింత నొప్పులైన నెట్లోర్తు నామొర
నాలకించరమ్మ యతివలారా ! 3౨

౨౦. చెంచు-రూపక తాళం-కామవర్ధని రాగం

చానలార ! యిక జాగు నేల ! నెఱ జాణ యైన మంత్ర
సానిని బిలువారే ! అమ్మయ్యా ఓయమ్మా !
కొడుకు లోన నలుగడల చరించగ
కడుపూలో చెయివేసి కలచి నట్లాయెను. —అమ్మయ్యా
మామిళ్ల పల్లి శ్రీ స్వామికి దయరాదు
ఏమిసేతు నే నెంతాని తాళుదు —అమ్మయ్యా-ఏమేటి...

సూత్ర-ఆ.వె. అపుడు మంత్రసాని యమ్మ లక్క-లబిల్చి
నడుము బట్ట తడవు నలినముఖికి

పుత్రుడుదయమయ్యె బుధజన చిత్తంబు
బిల్లిపిల్లి బిలబిల దల్లడిల్ల. 33

సీ. కంజాత మిత్రుండు కార్ముక రాశియం
దున్న మాసంబున నెన్నగాను
శుభ వాసరంబున శుభలగ్నమున జ్యేష్ఠ
తారకయందు మోదంబు తోడ
మధుసూదముని వన మాలికాంశంబున
వేదాంత విద్యా ప్రవీణుడైన
నారాయ ణాభిధాన క్షమానిర్జర
వల్లభునకు ధర్మపత్ని యైన
లక్ష్మమాంబకు పుణ్యశీలకు జనించె
నిర్మల జ్ఞాన వైరాగ్య నీరజాత
గర్భసంభవు డఖిల దిక్కలిత కీర్తి
రంజితుండగు విప్ర నారాయణుండు. 34

(లక్ష్మీదేవి తెర వెడలుట—)

౨౧. చెంచుకు - త్రిపుట ఆనంద భైరవి రాగం.

బాలెంత రాలనో యమ్మా! నే బాలెంతరాలనో యమ్మా
శ్రీలలరగ బుధ జాలమెన్న శుభ, శీలముగల్గిన
బాలుని గన్న —బాలెం

పచ్చ్చల్తు తంద్రి మెచ్చి పువ్వులదండ
యిచ్చిన గల్గెను ఈ చిన్ని పాపడు —బాలెం

పల్లావపాణి మామిళ్ళపల్లి వారి
చల్లాని దయచే నుల్లసిల్లుచు నుండు —బాలెం

మా. కం. శ్రీలక్ష్మీదేవమ్మకు
చాలా దినములకు గలిగె సంతతి యనుచున్

పోలించి చూడవచ్చిరి
బాలామణి వపుడు వతులు బహువేడుకతోన్. ౩౫

(పేరంటాండ్రు – తెరలో—)

శ్రీకాంతా కుచకుంభయుగ్మ — పునరావృత్తి
శ్రీమామిళ్ళపురీ నిశాంతుడు — పునరావృత్తి

౨౨. (తెఱవెడలి) చెఱుకు-త్రిపుట. దర్బార్ కానడరాగం

నందాను డుదయించెనమ్మ మందయానాకు, ఇతని
కందామైన శంఖుచక్రాము లమరి యున్నావి -
సుందరాంగులార మనము చూతాము రావే! మోము
చంద్రామామతోను సాటియన వచ్చు ! —నందాను

కరచరణాది చిహ్నాములు నేర్పరచి చూడగ నితడు
పరమ భాగవత శేఖరుడై బరగువాడు
హరిభక్తి దుగ్ధాబ్ధి నోలాడు వాడు - ఇతడు
పరవాదులకు గుండె దిగులై ప్రబలువాడు —నందాను

సార మంత్రార్థాము దెలియ జాలినవాడు-దుష్టా
చారముగల వారల జేరనివాడు
కారుణ్యాసారాము మదిలో గల్గువాడు - విప్ర
నారాయణు డనియెడు పేరువాడు - నందాను

౨౩ - లాలిపాట - త్రిపుట - ఆనందభైరవి రాగం

చందమామ వంటి మోమునందు సొంపుగ
కుందనంపు రావిరేక గులుకు చుండగా

సుందరాంగులెల్ల జూచి జోల బాడగా
మందహాస మొనరించేవు మధురస మొల్కగా
　　బాలాలాలీ! సుగుణా వాలా లాలీ!
　　నీలాలక భవ్యశీలా లాలీ!

రంగూగ నవరత్నమూల రంజితంబైన
బంగారు తొట్లెలో నీవు పవళించి యున్న
అంగనాలు జూచి ముద్దులయ్యా నాయనా యనుచు
బంఘా జాచీయుచేరు నుత్సాహసంపన్నా! —బాలాలాలీ!

శ్రీ మామిళ్లపల్లి నారసింహలూడు చాల
క్షేమాము తోడుత కరుణ సేయు నీవేళ
ఈమహిలో వృద్ధిబొందు హితజన పాలా
ధీమంతులెల్ల సన్నుతింతురు లీలా! బాలాలాలీ!

２౪. జోలపాట - ఆదితాళం - కల్యాణి రాగం

　　జోజో దయావాల, జోజో సుశీలా
　　జోజో సుగుణజాల జో పరమ ఖేలా!

కంకణంబులు ఘల్లు ఘలని మ్రోయంగా
పంకజాక్షులు జోల బాడి యూచంగ
పొంకముగ పవళించు బుధులు మెచ్చంగ! —జోజో

సరస వేదాంతార్థ సార మూహించీ
కరతలా మలకంబు గానుగ్రహించీ
చరియించెద వటంచు జనులెన్న మించి
బరగెదవు ధరణిలో ప్రఖ్యాతి గాంచి! —జోజో

అరయంగ లక్ష్మి నారాయణుడు చాల
చిరతరంబుగ తపము సేయాగ లీల

సిరిమగని సత్కరుణ చేత నీవేళ
తెలుగొప్ప నవతరించితివి శుభలీల —జోజో

మామిళ్లపల్లి హరి మదిలోన నెంచి
మేము బాడినపాట మీరాలకించి
వేమారు వినరయ్య వినయము దలంచి
మామీద కరుణించి మము సమ్మతించి —జోజో

(వెళ్లుదురు)

# విప్రనారాయణుని వేషం

మాత్ర-ద్వి-10. శ్రీరంగ నగరంబు చెంత కావేరి
తీరంబునందు ధాత్రీసుర సప్త
శత సంఖ్యమితి నివాసంబుల చాల
నతిశయ భోగభాగ్యంబులు గలిగి
యమర మండంగుడి యను పురంబందు
విమల చిత్తుడుభయ వేదాంత విరుదు
వనజాత లోచను వనమాలికాంశ
మున జనియించిన పుణ్యాత్మకుండు
కరుణా రసంబు విగ్రహము గైకొన్న
తెఱగున సత్యంబు దేహంబుదాల్చ
పగిన శాంతరసంబు భాసురంబుగను
తగమాన వాకృతి ధరియించు పోల్కి
కరము జ్ఞానంబు సాక్షాత్కారమైన
కరణి శ్రీహరిభక్తి ఘనముగా మర్త్య
తను వెత్తినట్టుల ధరణి లోపలను

వినయంబు మూ ర్తిభవించిన రీతి
చెలువొందు నావిప్ర శేఖరుండెపుడు
కలుషంబులేని నిష్కపట చిత్తమున
అరుణోదయమున నయ్యన మేలుకాంచి
సరభసంబుగ నదీ స్నానంబు జేసి
కరమొప్ప ఫాల భాగమునందు లెస్స
తిరుమణి పట్టెలు దిద్దియు నడుమ
తిరుచూర్ణ రేఖ పొందికగాను దీర్చి
శిరసున ముద్దుగా సిగముడి వేసి
ధవళోపవీత సుందర వక్షమునను
అవిరళ తులసికా హారముల్ వైచి
మామిళ్ళపలి హరి మదినెన్ని శృతులు
వేమరు జదువుచు వేడుక తోడ
సాధు వైష్ణవజన సదనంబులందు
మాధుకరము దెచ్చి మరియందు లోన
సగము భిక్షులకిచ్చి సగము భుజించి
తగ విశ్వలజ్ఞాన తత్పరు డగుచు
కావేరి విరజ రంగని మందిరంటు
శ్రీ వైకుంఠపురంబు శ్రీ రంగ విభుడు
పరవాసుదేవుండు ప్రత్యక్ష మిదియె,
పరమపదంబని పలుకుచు నుండు.

సీ. అంబు జాక్షుదెగాని యఖిల లోకములందు
    నన్య దైవంబు లేదనెడి వాడు
శ్రీ భాగవతసేవ జేసిన వారలు
    ధన్యు లయ్యెదరని దలచు వాడు
హరిచింత లేని మర్త్యశ్రేణి తోడుత
    చెలిమిని యెపుడు వర్జించు వాడు
అన్య మతంబుల నవమనరించుచు నుండు
    వారి చెంతకు జేరనీని వాడు

యింద్రియంబుల నెల్ల జయించి శాంత
శమ దమంబుల గల్గు వైష్ణవుడితండె
యనుచు జనులెన్న విప్ర నారాయణుండు
వభకు నేతెంచి నప్పుడు సరభసముగ. ౩౮

(విప్ర - తెరలో —)

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి
శ్రీ మామిళ్లపురీ నిశాంతుడు — పునరావృత్తి

తుమావృత్తం -

శ్రీలక్ష్మి మానసాంభోజమ్, సంచారాళీ మనారతమ్
శ్రీరామ పూజితం దేవమ్, వందే శ్రీరంగ నాయకమ్. ౩౯

౨౫. దరువు - ఆటతాళం - కానడరాగం

శ్రీరంగ నగర విహారా! శృంగారా మన్మథా కారా!
మెరుధరా ధరధీరా! మామిళ్లపల్లి సంచారా!
పాలిత మౌనీంద్ర జాలా! గోపాల హేమమయ చేలా!
నీలవర్ణ భవ్యశీలా! గానలోల! పాణిధృత శైలా! - శ్రీరంగ
పండిత కల్పమహీజా! మార్తాండకోటి రవితేజా!
కుండలిశయన సుతాజా! చక్రి! ఖండిత దానవరాజా!

౧. బ్రహ్మ పూజితరంగ పతిత పావనరంగ
విమలాంతరంగ కావేటిరంగ
రాఘవార్చితరంగ రాకేందు ముఖ రంగ
నాపాలిరంగ మన్నారురంగ
కాంచ నాంబర రంగ, కరుణాంబు నిధిరంగ
సుందరరంగ కస్తూరి రంగ

భువన మోహానరంగ, పోషితా మరరంగ
వేధ గోచరరంగ, విమలరంగ

తే. అరి దరాంచిత కరరంగ వరదరంగ
సంగరాహిత మరభంగ శౌర్యరంగ!
కాండజాత భవాండపిచండ రంగ!
పురహారస్తుత పాదపంకరుహా రంగ! ౩౮

౨౬ - చెణుకు - ఆదితాళం - హిందోళరాగం.

నీలవర్ణ! ధృతశైల! కనకమయచేల! భవ్యశీలా!
పాలిత నిర్జరజాల! సద్గుణాలవాల! నందబాల —నీల
సుందరరూప ముకుంద, నందన వందిత పద యుగళా
మందరధర ముచికుంద వరద గోవింద రిపు విపాలా! —నీల
అండజగమనా జాండోదర! మార్తాండకోటి రవితేజా
కుండలిశయనా ఖండల సన్నుత! పండితసురపూజా! —నీల

౨౭ - తెరవెళ్ళే చెణుకు - ఆదితాళం-మధ్యమావతి రాగం.

తొండారా డిప్పొడి యేతెంచినాడు వేడ్కతో
కాండాజ గర్భాండ భాండాములాకు కర్త హరియొ
క్కండెగాని యింక వేరే యొండుదైవము
లేడనుచు —తొండా
కుండలి శయన! హరి! వైకుంఠవాస! నారాయణ!
పుండరీకనయన! మాధవ! పురుషోత్తమా! యని
నుడువుచు —తొండా
దండిగాను చార్వాక పాషండాది మతముల నెల్ల
ఖండించినా భాగవతుల దండనుండు వాడ ననుచు—తొండా

ప్రతి-తే- ధరణి లోపల మీ పేరు తండ్రి పేరు
తల్లి పేరును జెప్పుడీ తథ్యముగను
ఎవరి వంశంబునం జనియించి నారో
తేటపడ జెప్పుడయ్యా సందియము దీర ! ౩౯

విప్ర-సీ. ధరణి లోపలను మా తల్లి లక్ష్మిదేవి
రహి జనకుండు నారాయణుండు
మధుసూదనుని వనమాలికాంశంబున
జనియించి నాడను సరభసముగ
దనర మండంగుడి యనియెడి పురమున
నిండ వేడుక తోడ నుండువాడ
హరి చరణ స్మరణామృతం బెప్పుడు
చెలగుచు పానంబు జేయువాడ;

తే. అన్యమతముల ఖండించినట్టి పరమ
భాగవత సేవజేయుచు బరగువాడ
బ్రహ్మచర్య వ్రతస్థుడ వైష్ణవుడ
అలర తొండరడిప్పొడి యంద్రు నన్ను. ౪౦

౨౭. చెఱుకు - త్రిపుట - ఆనందభైరవి రాగం.

నారాయణా భక్తిసాంద్రూడ - విప్ర
నారాయడా సంయమీంద్రుడా !
ఆగామతత్వ విచారుడా! శ్రీ భాగవతార్థ విచారుడా
—నారా

పంచసంస్కృత సంపన్నుడా ! ప్రపంచ మోహా
నిర్భిన్నుడా ! —నారా

దండిగాను ద్రమిళులందారు నన్ను, తొండారడిప్పొడి
యందురు. —నారా

తే. జ్ఞాన వైరాగ్య భక్తి నిష్ఠలను శుద్ధ
సాత్వికులమయి శ్రీహరి స్మరణచేతు
మవని పన్నిద్దరము మేము సవినయముగ
ఆళువార్లని మమ్మందు రఖిల జనులు. ఆహి

ప్రతి - వ - పన్నిద్దరేయే విధంగా అవతరించిరో విమర్శగా
నానతీయవయ్యా స్వామీ !

## పన్నిద్దరాళ్వారుల వివరం

(విప్ర - సీసార్థాలు)

౧౯. శ్రీమించు చుండు కాంచీ పట్టణమున
జాళువా జిగిమించు జలరుహమున
తులయందు రవి సంస్థితుండైన యప్పుడు
శ్రవణాభిధాన నక్షత్ర మునను
పాంచ జన్యాంశ సంభవులై సరోయోగు
లవనిలో ఖ్యాతి గాంచిరి - మౌనీంద్రులెల్ల
అవునంచు సన్నుతించిరి.

౨౦. హారిదశ్వకుడు తుల యందుండగా ధని
ష్ఠాతారయందు ప్రశస్తముగను
మల్లాపురంబున కల్లోలమాలి తీ
రమున నుత్పలమున రమ్యముగను
తగ గదాంశమున పూధత్తాళ్వారు వారిల
వేడ్కతో సంభవించిరి - మౌనులచేత
వినుతు లందంద గాంచిరి

31. జలరుహ మిత్రుండు తులచరించుచు నుండ
శతభిష గాఖ్య నక్షత్రమునను
నళినదళాక్షుని నందకాంశమున మ
యూరపురంబున కైరవమున
పేయాళువారు సంప్రీతితో జనియించి
దాసులనెల్ల నేలిరి - సద్గుణములందు
వాసుదేవుని బోలిరి !

32. శ్రీకూరకుల పయస్సింధు చంద్రుండయి
యహికులాధీశ వేత్రాంశమునను
మకరంబునందు తామరసమిత్రుండుండ
కరమొప్పు హస్త నక్షత్రమునను
పరగ కూరత్తాళువారు సంభవమయి
సరసీజ నేత్రు గొల్చిరి - అంతటిలోన
పరవాదులను గెల్చిరి.

32. నలువొంద కేరళ సీమలోపల చోళ
పట్టణ స్థలమున పార్థివేంద్ర
సంతత కౌస్తుభాంశమున కుంభమున పు
నర్వసుతారను నయముగాను
కోవిదులెన్నగా కులశేఖరాళ్వారు
ధరణియందు ధృవిర్చిరి - చార్వాకముఖ్యు
వరులెల్ల భయము జెందిరి

33. గ్రహరాజు మకర సంక్రమణంబు నందుండ
తలపోయగా మఘా తారయందు
శ్రీరమ్యముగ మహీసార పురంబున
చక్రాంశమున భక్తి సారమునులు

ప్రభవించి జ్ఞాన వైరాగ్య భక్తులు గల్గి
ధరణిలో ప్రఖ్యాతి జెందిరి - ఆ సమయమున
పరవాదులు భీతి జెందిరీ.

౩౨. ద్రావిడ భాషను ధరషట్ప్రి బంధముల్
ముందుగా నిల్పిన పుణ్యశాలి
జగతిలో వృశ్చిక సంక్రమణంబున
తలచగా కృత్తిక తారయందు
శార్జ్గాంశమున చతుష్క విశిఖామయి
పరకాలు డుద్భవించెను - శ్రీవైష్ణవ జనము
పరమా మోదము గాంచెనూ.

౩౩. శ్రీ పెరుంబుదూరు శ్రీహరి దర్శన
స్థాపనోత్సుకులయి సరభసముగ
శ్రీమించగా నాదిశేషాంశ మూర్తియై
ధరణియందున నార్ద్రితార యందు
ఆసూరి శ్రీకేశవాచార్య వరునకు
రామానుజు లుద్భవించిరీ - భక్తజనులు
కామితార్థము గాంచిరీ.

౩౪. శ్రీరమ్యముగను వృశ్చికమున రవియుండ
కమలసంజాత నక్షత్ర మునను
వనజలోచనుని శ్రీవత్సాంశమునను శ్రీ
లాలితంబగు నిచుళా పురమున
మేలుగా తిరుపాణి యాళువారనగను
మునివాహను డుద్భవించెను - శ్రీగాయకేంద్రు
డనగా ప్రఖ్యాతి గాంచెను.

శా॰ ఇవాలు శుభోపేతమౌ పాండ్యదేశంబున
కురకను తింత్రిణీ కోటరమున
నిలిచి భక్తాభీష్ట ఫలము లొసంగిన
శఠరిపుల్ సైన్యపాశంబు చేత
కలియుగాదినను నిశ్చలుడైన హరికి న
మ్మాళువారు బుట్టిరీ - శ్రీవాసుదేవుని
నమ్మి పరవాదులా ముట్టిరీ !

శిట॰ సిరిమించగను తులసీవనంబున సంభ
వించిన పద్మను వేడ్కతోడ
పెంచి శ్రీహరికి నర్పించిన పుణ్యుండు
విమలుండు మిధున సంక్రమణమునను
స్వాతిని హరిరథాంశమున జనించిరి
విష్ణు చిత్తాళువారులూ – మంత్రామంత్రార్థ
వైష్ణవ మర్మవేదులూ

ప్రతి:-వ. ఏ ఏఏ యుగమందెవరెవ రవతరించిరో చెప్పుకో [illegible]
స్వామి !

విప్ర:-సీ, ధరణిలో పొయిగై పూరత్త పేయాళ్వారు
కృతయుగంబున జనియించి రంత
త్రేతా యుగోద్భవుల్ తిరుమడి యాళ్వారు
కుల శేఖరుడు కూరకుల విధుండు
వరకాలుడును తిరుప్పాణులు మేమును
ప్రభవ మందితిమి ద్వాపరమునందు
కలియుగంబున భాష్యకారులు మధుర
త్కవులును శఠరిపుల్ గలిగినారు

తే. మేము పన్నిద్దరమును మామిళ్ళవల్లె
హరి పదధ్యాన మొనరింతు మనుదినంబు
వైష్ణవుల మన్య సంకల్ప వర్జితులము
ఆళువారని మమ్మందు రఖిల జనులు. ౪౨

ప్రతి:- తే. అవని పెద్దలు మీరు శ్రీహరిని పూజ
సలుపు చుండక నీ సభా స్థలమునకును
ఎందు కొఱకయి వచ్చితి రిష్టముగను
మాకు దెలియంగ బల్కుడీ ప్రాకటముగ ౪౩

విప్ర. సీ. శ్రీరంగధాముని సేవకై పూవుల
హారాలు గట్టెద ననుచు నేను
మనమున సంకల్ప మొనరించి వచ్చితి
ధారుణీపతులు ప్రధాని వరులు
కాపులు కరణాలు గ్రామస్థితా శేష
జనములందరు లెస్స సమ్మతిగను
పువ్వులతోటకు పొలము సమ్మతిగా వి
చారించి మాకు నొసంగవలయు

తే. అంబుజాక్షుని కైంకర్య మబ్బినపుడు
తలచగా మీకు బహుసుకృతము లభించు
దాని క్రయ మేమి జెప్పిన తథ్యముగను
యిచ్చెద ననుగ్రహింపుడీ యిష్టముగను. ౪౪

సూత్ర - వ. అనిన నా విప్రపుంగవుం గాంచి

తే. పూంతోటకు దగినదీ పొలమటంచు
నవని యేర్పాటుజేసి ప్రాగాది నుండి
నాల్గదిక్కుల మేరలేర్పఱచి యపుడు
బ్రాహ్మణున కిచ్చి రవనీపతులు వేడ్క. ౪౫

విప్ర - సీ. ఈ మడిలోపల చేమంతి పూవుల
నారు నాటింతును నయముగాను
ఇచ్చట పొన్నచె ట్లిచ్చట పొగడలు
సంపెంగ లిచ్చట జాజులిచట
మల్లె చెట్లీయోర మొల్ల చెట్లాయోర
కమలంబులిందు చెంగల్వలందు
కేతకీ కుసుమంబు శీతాపువను కర
వీరవృక్షంబులీ దారియందు

తే. పొగడ లిచాలునను సురపొన్నలచట
వేరు వేరుగ నాటించి వేడ్కతోడ
మొలక లొనరించి పాదుల జలముబోసి
అనుదినంబిట్లు వృద్ధి సేయంగ వలయు.

మాత్ర-ద్విపద: 11. అని విప్రనందను డానందమునను
తనకు నిచ్చిన పొలంబున తోటవేసి
చెట్టు చెట్టుకు పారు చెలువొంద జేసి
కట్టలు గట్టించి కాలువల్ జేసి
జలములు బోయుచు సంతసంబునను
పొలుపొంద పిల్లల పోషించు కరణి
పాలన జేయుచు బహు భక్తితోడ
మేలుగా తులసి సమృద్ధి గావించి
పొవగంగ తోటలో బూపిన యట్టి
కుసుమముల్ తరితోడ గోయుచు లెస్స
దండలు గట్టుచు ధారాళముగను
అండజవాహను కర్పించు చుండు.

# మధురవాణి దేవదేవి వేషాలు

మాత్ర-ద్విపద. 12. శ్రీమహి యనియెడు చేడియ ఫాల
సీమ హాటకరత్న సీమంత మనగ
శ్రీరంగ నగరంబు చెన్నొందు చుండు
ఆ రాజధాని యందమరు భూసురులు
వారిజ భవునకు వంతు కెక్కెదరు
వారిజసఖ చంద్ర వంశంబులైన
రాజులెన్నగ కళారాజులు వైశ్యు
లీ జగంబున కిన్నరేంద్రుని సములు
బలభద్రులనగను బరగు శూద్రులును
విలుపిల్లు నచ్చటి విటజనంబులును
జలజాంబకుని తోటి సాటి గాంచెదరు
వలనొప్పు నప్పురి వారకన్యకలు
చిత్తజన్ముని రామచిలుకలో లేక
పుత్తడి బొమ్మలో పొసగ చేమంతి
బంతులో చిత్రంపు ప్రతిమలో పసిడి
దొంతులో యనగ బొల్తురు వారిలోన
నెలజాణ మధురవాణియు నాగ నొక్క
తెలవ సుందరవతి దేవదేవి యన
తలిరాకు బోణులిద్దరు ముద్దుగులుక
పలుకుచు కులుకుచు వచ్చిరావేళ.

(ఇద్దరు - తెరలో)

దేవ - శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి

మధు - శ్రీ మామిళ్లపురీ నిశాంతుడు — పునరావృత్తి

౪౦. తెరవేశ్యే చెణుకు - ఆదితాళం - కల్యాణిరాగం.

వారా కన్యాలు వచ్చిరమ్మ ! అమ్మమ్మలారా !
వారా కన్యలు వచ్చిరమ్మ !

వారాకన్యలు బలుసిం గారంబుగా వచ్చిరి
పౌరా జనములెల్ల కోరి చూచుచు మంద —వారా

గంభీరఘ్రాణావామూల జంభారి సభయందున్న
రంభా మేనకల సరియన కుంభీంద్ర యానముల —వారా

సంగీత భరతనాట్య చాతుర్య మర్మములాల
సంగాతి దెలసి చాల శృంగారవతులైన —వారా

పాణి నేత్రోత్తమాంగ పాదాబ్ధి నయమూల
జాణాలైనట్టి మధురవాణి దేవదేవి యనగ —వారా

మామిళ్లపల్లి ధాముడైన శ్రీనృసింహా
స్వామి పాదాంబుజములు వేమరు దలచుకొనుచు —వారా

౪౧. వెణుకు - ఆదితాళం - కాఫీ రాగం.

జాణా యని మెచ్చారే - భళిరే నెఱ - జాణా
యని మెచ్చారే!

వీణాధర ఘనవేణుల పాణుల, వీణకు సరిగా గానము
జేసెటి —జా

సుందరి దళ విధచుంబనములచే, కందర్పునైనను
గరగంగ జేసెటి —జా

తాళాలయ పర్వ తానాళములకను కూలముగాను
ఖేలాస మొనరించు —జా

మామిళ్ల పలిపుర ధాముడా నరసింహస్వామి సత్కరుణతో,
సకలవిద్యల యందు —జా

౪౨. తెరవెళ్లె వెణుకు - ఆదితాళం - హిందోళరాగం.

మధురవాణి వచ్చెనే! ముద్దుగుమ్మ మధురవాణి వచ్చెనే

మధురవాణి వచ్చె మానిను లరుదంద
మధుకర నిభవేణి సుహిత పల్లవపాణి —మ

ఘలు ఘల్లుమని చిఱు గజ్జెలందెలు పాద
ముల మ్రోయ మరునిశాపిల్క తేజివలె —మ

ధళధళ జిగిమించు తొలుకారి మెరుపు ని
శ్చలమూన పుడమిపై నిలిచిన దోయన —మ

దేవదేవి వచ్చెనే! చక్కని ముద్దు, దేవదేవి వచ్చెనే!
దేవదేవివచ్చె రీవితోడుతాను
భావజాని రతిదేవికి దీటైన —దే

శృంగార రసము పొసంగగ నటియించు
బంగారు బొమ్మ తెలుంగున నావేళ —దే

ఆటల పాటల, తేటల మాటల
కోయిలలో దీని సాటి లేరని పల్క —దేవ

ప్రతి - కం. మీరెవ్వరు! కులమేమో?
పేరేమో? నడతలేమొ? ప్రియమున మీ మీ!
నేరుపులేమో? మాతో
గారవమున దెలుపరమ్మ కడు వేడుకతోన్. ౪౨

౪౩. దేవ - వెణుకు - ఆదితాళం - మోహనరాగం.

దేవినే! దేవా! దేవినే!
హావ భావముల రీవితోడుతను,
బావాజు నైనాను భ్రమల నొంది చేటి —దే
కిన్నర కన్యల కిన్నర పల్కుల
కన్న మిన్నగ తిన్నగ బల్కెడి —దే

అతి వినోదముగ అఖిల విటులనెల్ల
చతురత చౌశీతి గతుల మెప్పించిన —దే

ప్రతీ - వ. ఆమె యెవరమ్మా! ఓయమ్మా!

దేవ - వ. ఈమె మా యక్కగారు మధురవాణి.

సీ. సూనౌఘ మకరంద పానతుందిల మత్త
మధుకర నిభవేణి మధురవాణి
మధు సమయోచిత నూత్నాండ కరభాస
మాన పల్లవపాణి మధురవాణి
కాంచన నవరత్న కంకణ ముఖదివ్య
మండన శ్రేణిశ్రీ మధురవాణి
జలధి పరివృత సర్వావనీచక్ర
మహనీయ సుశ్రోణి మధురవాణి

మత్త సామజ గామిని మధురవాణి
మౌని హృద్భేదక కృపాణి మధురవాణి
మానసార్పిత శర్వాణి మధురవాణి
మంజు వాగ్జిత గీర్వాణి మధురవాణి ఆల

ప్రతీ - వ. మీరే వంశమున బుట్టితిరో ఎరిగించరే అమ్మయ్యా.

మధు - తే. వేలుపులు పలలాశనుల్ పాలకడలి
తఱచు చుండగ నప్పుడచ్చరలు బుట్టి
రట్టివారల వంశంబు నందు మేము
జనన మొందితి మమ్మ యిజ్జగతి లోన ఆల

ప్రతీ - వ - అయితె సముద్రం జేరితి మథించిరో తెలియ జెప్పరే
అమ్మయ్యా.

# సముద్రమథన వృత్తాంతం

మధు - కం. ముని శ్రీశుకులు పరీక్షి
జ్జనవరునకు భాగవతము సాంగముగాగన్
వినిపించె నందు నీ కథ
రసికుల నీ కదియు దెల్పెదము తేటపడన్. ౨౦

దేవ-ద్విపద.18. అమరులు దానవు లధిక యత్నమున
అమృతంబు కొఱకు దుగ్ధాంబుధి దరువ
దలచి మందర రసాధరమును గాంచి
పలుదెఱంగుల చుట్టు పాశముల్ గట్టి
పెకలించి భుజముల బెట్టుక దెచ్చి
చకిత మనంబుల జలనిధియందు
వడనొప్ప గాను కవ్వము గా నొనర్చి
చిలువల రాయని చేతుల దువ్వి
భాగ మిచ్చెదమని బహువిధంబులను
బాగుగా సమ్మతిబడ వచియించి
తరిత్రాడుగ నొనర్చి దైత్యులు తోక
సురలు ఫణంబులు సొరిది చేపట్టి
బూనియున్నంతన పోలించి చూచి
దానవు లావేళ తగనిట్టు లనిరి

మధు-కం. వేలుపులారా! భుజగము
మేలైన ఫణంబు లివుడు మీరలు బట్టన్

నారాయణుని వేడుకొనిన కూర్మావతారం బెత్తెనట నెటువలెను.

ద్వి. 14. సవరనై లక్ష యోజనముల నిడుపు
నవు కర్పరంబు బ్రహ్మాండంబు మ్రింగ
జాలు ముఖంబు విశ్వము మీదనాడిన
కాలంబు నంటైన కదలని కాళ్లు
గలిగి కంజాక్షుండు కమఠ రూపమున
జలనిధి జొచ్చెనా సమయంబు నందు. 3

౪౫. ఇద్దరు - చెణుకు - రూపక తాళం - కల్యాణిరాగం

కమఠా వతారమెత్తె నమ్మ పర వాసుదేవుడు —కమ

అమరా సుర సంచయంబు లరుదంది చూడ సం
భ్రమణంబుగ మామిళ్లపల్లి శ్రీ నృసింహాలు —కమ

మధు - తే. కమల నేత్రుండు కమఠమై కడలి జొచ్చి
మందరము మీది కెత్తిన మరల నదియె
కవ్వముగ ఫణి తరిత్రాడుగా నొనర్చి
దేవ దానవు లబ్ధిని దఱచి రంత. ౨౪

దేవ-ద్వి. 15. హాలాహలము బుట్టి యఖిల లోకములు
గాలుచు నుండ శ్రీ కంఠుని కడకు
జని దేవదానవ సంఘముల్ చాల
వినతి యొనర్చిన విశ్వేశ్వరుండు
శైలజ నడిగియు సమ్మతించినను
చాల రోషమున నా విషంబును బట్టి
కరకంజమున ముద్దగా నొనరించి

పరగంగ నేరెటి పండ్లరీతిగను
గైకొని భక్షించి కంఠ భాగమున
ప్రాకటముగ నుంచె వదలంబు గాను
తరువాత దేవతల్ దానవు లబ్ధి
దఱచు చుండగ మహోదార కౌస్తుభము
శ్రీమించు చుండిన చింతామణియును
కామధేనువు కల్పక క్షితిజంబు
వలనొప్ప నుచ్చైశ్రవంబను హయము
తలచగా నాలుగు దంతంబుల్ గలుగు
నైరావతాఖ్య మహా సామజంబు
తారాధినాథు డుద్భవమందె నపుడు

## సీసార్థాలు

౪౬. మధు- కలుముల నీనెడు కడగంటి చూపుల
పున్నమ చంద్రుని బోలు మోము
కరము సుందర మగు ఖోద[illegible] ముగు
మించుల తళుకుల మించు మేను
పల్లవారుణ పాణి పదములు గలిగిన
శ్రీలక్ష్మి సంభవించెను. —లోకేశుం డిట్లు
చాల సంపద గాంచెను
వేలూపు లసురూలు వాంకటి [illegible]
లీలమథించగ మేలూగ నప్పుడు - —శ్రీ[illegible]

౪౭. దేవ- ఇందిర వారధి యందు దయించిన
యింద్రాది నిర్జరు లెల్ల మెచ్చ

కనక రత్నప్రభా కలిత భూషణములు
ప్రేమ తోడుత సమర్పించి రంత
సంయమి సంఘముల్ సన్నుతుల్ జేసిరి
సురకాంతలెల్ల నాడిరి —సత్పురుషు లెల్ల
వరము లిమ్మని వేడిరి.

౪౮. మధు - చల్లని చూపుల జగమేలు చుండును
సుందరా కారుండు సుగుణశాలి
సర్వ కార్యములందు జాగ్రత గలవాడు
సాధు రక్షకుడు నా స్వామి యితడె
యని పూలదండ శ్రీహరి కంఠమున వైచి
యిందిర పెండ్లి యాడెను—తన కతని యురము
మందిర మని యాడెను.

బృందారకు లానందంబు తోడుత
నందన సుమములు పొందుగ గురియగ — ఇందిర

దేవ - తే. మరియు పాలకడలి దరువగా చందురు
బోలు వదనములును బొంగరాల
సాటి యనగదగు కుచంబులు గలిగిన
యప్సరసలు బుట్టి రవనినాథ. ౨౬

౪౯. మధు-సీసా. అళి కుంతలంబులు నెలనగు మోమును
బింబా ధరంబును కంబు గళము
అరుణాబ్జ కరములు గురుకుచ యుగములు
చిలుకల పలుకులు చిన్ని నగవు
అపరంజి చాయల నలరు మేనులు గల్గు
అచ్చరలు దృవించిరి అందరి లోన

మెచ్చులెల్లను గాంచిరి
అచ్చాటి సురముఖు లచ్చెరు వందగ
విచ్చాల విడిగ మచ్చాటి లాడుచు —అచ్చర

దేవ - తే. అంబునిధి మథింప నమృతంబు బుట్టిన
నసురు లపహరింప నచ్యుతుండు
నేర్పుతోడ మోహినీదేవి యై సుధ
సురల కొసగి చనియె చోద్యముగను. ౩౬

౩౦. చెంచు - ఆదితాళం - మోహనరాగం

అచ్చరలమే ! ఓ చెలులార ! అచ్చరలమె ! ఓసఖులార !

అచ్చరలము మే మంబుజాక్షు లార
పచ్చవిల్తుని గన్న లచ్చి మా సైదోడు —అచ్చ

అంచయాన విధి హరి రుద్రుల మె
ప్పించి నత్యతులు గాంచిన వారము —అచ్చ

భారతి శచి నీహారధరాత్మజ
కూరిమి తోడుత గారవింతు రమ్మ —అచ్చ

మధు-సీ. పుడమి లోపల పాలకడలి మా పుట్టిల్లు
పంకజ నేత్రుండు బావగారు
చక్కని యిందిర యక్కగావలె మాకు
వెన్నెలరేడు మా యన్నగారు
కామధేనువు కల్పకంబులు తోబుట్టు
లజ హర సురసభ లాటపట్టు
రాజసూయ మహాధ్వరములు మాకంకువ
అమృతంబు సహజ భవ్యాశనంబు

తే - సరస సంగీత సాహిత్య భరతశాస్త్ర
మనస తంత్ర రహస్య మర్మంబులెల్ల
కరతలా మలకంబులై బరగు మాకు
అచ్చరల సుమ్మి పూర్ణ చంద్రాస్యలార ! ౨౭

సీ, అమర త్రయస్త్రింశ దమరులు గొలువంగ
పేరోలగంబున గూరుచున్న
పురుహూతు సన్నిధి నిరవంబు సంగీత
సాహిత్య విద్యా ప్రసంగములను
శుకతుండ లాంగూల సూచీముఖ పతాక
హంసాస్య పద్మకోశా దిముఖ్య
హస్తాభి నయములు జూడుచు పాడుచు
చాల మెప్పించి యుత్సాహ లీల

తే. సకల బహుమానములు గాంచి సంతసమున
యిచ్చ బుట్టిన లోకంబు లెల్ల దిరిగి
సొంపు తోడుత విహరించుచుందు మెపుడు
అచ్చరలమమ్మి పూర్ణ చంద్రాస్యలార ! ౪౮

## దేవదేవి వృత్తాంతం

సూత్ర-ద్వి. అరయంగ నీరీతి యుక్క నెల్లలును
తరుచుగా గీత శాస్త్రంబుల చేత
భరత శాస్త్రోచిత ప్రౌఢిమ చేత
సరస సాహిత్యార్థ చాతుర్య మునను
ఆటల పాటల నవని నాయకుల
పాటిగా మెప్పించి బహు విధంబులను
ఘనమైన తొడవులు కనకాంబరములు
గొని జనుదేరుచు కొమరైనతోట
అరుదుగా పొడగాంచి యానందముగను

కరము మెచ్చి మనంబు కడు సంభ్రమింప
ఈ వనం బెవరిదో యిచ్చటి వెంత
పావనుడుండునో పరికించి చూడ
వలెనని తలచి యా వనపుచేరువను
నిలిచి యిట్లనిరి యా వనితలావేళ. 7

౨౧. జద్ద - వెణుకు - ఆదితాళం - కల్యాణిరాగం

ఎంతో వింతగనున్నది ఉద్యానవనము - ఎంతో
వింతగనున్నది

ఎంతో వింతగా నున్న దింతిరో చూడగాను
స్వాంతంబు లాకు చాల సంతోషమూను గలిగ —ఎంతో

నారంగ వకుళా మరకతములు, పున్నాగ లికుచ
మేరూ కాంచన పాదపములు,
పారిజాత ఖర్జూర జంబీరా మునగ నారి
కేళ ప్రియాళ భూరుహానంత మగుచు —ఎంతో

ఏమాని సన్నుతింతును, కనుచున్న వాని
నే చందమున గాంతును.

మామిళ్లపల్లి పుర ధాముడౌ నారసింహ
స్వామి మహిమ చేత నామోద దాయకంబై —ఎంతో

మధు. వ - చెల్లెలా ! అటు చూడుము

సీ. తులసిపూసల హారములు, తామరల పేర్లు
లీల కంధరమున గీలుకొలిపి
తిరుమణి పట్టెలు దీర్చి మధ్యాన తిరు
చూర్ణ రేఖ నుదుట శోభిలంగ

కౌపీనము బిగించికట్టి యామీద నీ
ర్కావి దోవతి పింజగా ధరించి
విపుల బిలంబుల వ్రేలువీపులు పెడ
తటి బిల్లశిఖలును గందముగ గలిగి
వారిజాతాస నంబున గూరుచుండి

తే - భాస్వ దష్టాక్షరీ మంత్ర పఠన చేత
ఆది నారాయణస్వామి ననుదినంబు
ధ్యాన మొనరింపు చుండెడి తపసి గంటి ౨౯

దేవ-కం. దండ మవనీసురేంద్రా!
దండము హరిభక్తి సాంద్ర! దండంబనఘా!
దండము నిగమాంతజ్ఞా
దండము శమదమవిచార! దండంబ ఘా! ౩౦

సూ - వ. అని మొక్కిన

ద్వి 17. కలువల రాయని గాంచిన యట్టి
జలజంబు రీతి మస్తకమును వంచి
ధరణీ సురేంద్రుండు ధ్యానాంత రమున
కరుదుగా బోయిన యంత లోపలను
కరమొప్ప నగ్రజ గాంచి యా వేళ
తెలగొప్పగా దేవదేవి యిట్లనియె.

౨౨. దేవ—చెంచు-ఆటతాళం-మాల్కోస్ రాగం.

వేడుక నేనెంత వేడి మొక్కిన కరుణ
నేయదు ప్రియము లాడదూ

ఇటువంటి వానికి యేల మ్రొక్కితి మిప్పు
డమ్మరో! ముద్దు గుమ్మరో! —వేడుక

నిదురబోయిన వాని పదములాల జెలగిన
ట్లాయెనే! మోసమాయెనే! —వేడుక

మధు-ద్వి.౧౭. దేవ నిభుండు భూదేవు డితండు
పావనమూర్తి యేపగిది నుండినను
ధారుణి పూజ్యుడీ తనికి మొక్కినను
గరిమ జన్మము సార్థకము సుమ్మియితడు
దీపింప జనుచు సందేహంబు వలదు
దేవుడు మ్రొక్కిన దీవన లిచ్చి
పలుకునే! యీతనికి బ్రహ్మ చర్యంబు
జలజాతు భక్తియు జప తపంబులును
ఆగమాంత విచార మనీశంబు గల్గు
బాగా నశోకంబు వాకిలి పొన్న
పొగడ సంపెగ కోవి పోషింపకుండు
తగ దోహదములకు తరుణులు వచ్చి
చరియించినను మది చలియించు నంచు
పరగంగ నీతని వైరాగ్య మెంచ
తరముగాదమ్మ యో తరుణి నీతోడు
తెరగొప్పగా దేవదేవుం డితండు. 8

దేవ - కం. వినవే పుత్తడి బొమ్మా
వినవే ఓయక్క యిపుడు విప్రుడు మనలన్
కనుగొన డంచును బలికిలి
విని విస్మయమయ్యె గదవె వివరింపగన్. ౬౧

తే. వేద వేదాంత విద్యా ప్రవీణుడైన
భక్తి నిష్ఠాగరిష్ఠ సంపన్నుడైన

దండి హఠయోగములు నేర్చి గండడైన
యున్న నెవడైన నను గనుగొన్న యపుడె! ౬౨

కం. జపములు స్నానము సంధ్యయు
తపములు విడనాడి భక్తి తాత్పర్యమునన్
నిపుణత్వముడిగి, నను గని
యపుడే వెన్వెంట వత్తు రంభోజముఖీ ౬౩

ద్వి. 19. అష్టాంగ యోగ రహస్యజ్ఞులైన
నిష్ఠులు నన్ను జూచిన యంతలోన
సరవి తోడుత చిత్త చలనంబు నొంది
పరువెత్తి వత్తురో పంకజనేత్ర
జపములు చేసెడు సమయముల్ గనిన
చపలులై గుండెలో ఝల్లు మనంగ
అక్షమాలిక దాత్రి యందునె వైచి
ఆక్షణమే వెంట నరుదెంతు రమ్మ
జన్నిముల్ సలుపు ద్విజ[illegible]లు నన్ను
కన్నుల జూచిన తకవక మంది
తడబడియును మంత్ర తంత్రముల్ దప్ప
నుడువుచు శబ్దంబు నోటికి రాక
గుసగుసల్ వచ్చి కోర్కెలు సమకూర్చు
మని వేడుకొందురో హరిణిభ మధ్య!

## ౨౩. గీతార్థం

పడతి వినవమ్మ మామిళ్లపల్లి శౌరి
కరుణ నామీద నించుక గలిగె నేని

జగతి వాతాంబు పర్ణ భక్షణ మొనర్చు
సంయము లైన వలపింతు

సరగూన కాముఃబారి బడగా జగతీస నేసు
నెరజాణా! నినుము గాని వెతలలోన బడగజేసి
గరువా తాఃము దూఃగ కని నా పదములాంగముల
చెలగు రిడుచను తాను తణము వర్తింపగను
నెరజాణా వినుము

## ౨౪. మధుర - గీతార్థం.

అవని లోన జితేంద్రియు లైన మునలు
మనసు చలియింప జేయనే వనితకైన
వశవ గాదందు రిప్పుడీ ప్రతిన నేను
నింత సులభముగా నిత
డెనయోగ లభియింపి మనసూ కరుగాగ నిన్న
కనుగోని మరునికేళి మదిని గోరి పిరవామూన
మొనసి నీకి ను భ్రమని వశమై మరుల పొందు నె
వనితా! చిడిముడి యిదేల? తగవె! కాని స్థలాన!
కనుగోని మరునికేళి మదిని గోరి...

దేవ-శార్దూలం. ఏమే వింతలు బల్కెదీవు మది నూహింపన్
ధరన్ తొల్లి వి
శ్వా మిత్రుండు తపస్సుజేయు నెడలన్ జంభారి
బంపించగా
భామా మేనక వచ్చి యా తపసి భావంబున్
గరగించి యొం

తో మోదంబు జనింపజేసి మది సంతోషింపగా

జేయదే ! ౬౪

మధు - సీసం. ఏ యే స్థలంబుల నెంత మహాత్మ్ములు

గలరో నీ కది యేమి తెలియు నమ్మ

అందరు వనితల పొందున కాశించి

ఏమిటి కొఱకు మోహింతు రమ్మ

సనకసనందన మునులెన్నటికిని కౌ

మార వయస్కులై మరుని గెల్చి

వలనొప్పగా మనో వాక్కాయ కర్మంబు

లను చలనము లేక నను దినంబు

సంచరించరె వారినే చంచలాతు

లైన వలపించ బోయిరే మౌనివరుల

నేల హాస్యంబు జేయ బోయెదవు మదిని

దలప నీకిది మంచిదే ? జలరు హాక్షి ౬౫

౨౨. ద్విపదార్థం

ఇంతిరో వినుమిది యెంత కార్యంబు

చింతింపగా గొప్ప జేసి పల్కెదవు

మును భార్గవుడు తపంబును విడనాడి

కనకాంగి చెంత జేరడే ?

హావ భావములు దాని పొందు గోరడే ?

### ౫౮. ద్విపదార్థం

యమునా నదిని దాటు యవసరంబునను
మమత పరాశర మౌనివర్యుండు
జాలరి కన్యక సీకు నిక్షించి
చాలగాను పొందు గోరడే
తన నేమము వీడి దాని గూడడే?

మధు-సీ. ఒకతీరుగా నంద రుండురే యైనను
తెలిపెద ప్రవరాఖ్య ధీవరుండు
అవని సిద్ధౌషధం బరయుటకై శత
గిరికేగి వలికది కరిగిపోవ
తిరిగి పోవలెనని తెలువు జూచుచు నుండ
నందు వరూధి మోహాంబు జెంది
కులుగు గుబ్బలు నెదగుచ్చి కౌగలిచేర్చ
హా వాసుదేవ శ్రీహరి యటంచు

తే. కలికి యంసద్వయంబు చేపట్టి ద్రోసె
గాన మనసు చలించునే కర్మరులకు
దానికంచెను నీ వెంత జాణ వహాహా
యేల నీపట్టు విడువవే బేలవగుచు! ౬౬

### ౫౯. దేవ - కందార్థం

సరసోక్తుల చేతను మది
గరగించగ లేకయున్న కాంతామణి సుం
దరరూప మేమిటికి చి

త్తరు బొమ్మరు లేది చక్క
దన మీలలోన ! తర శేక్షణ ! అరయు — మదిలోన !

తలిరాకు బోడిరో తరుణాల సొగసూలు
పురుషూల వలపింప బోరి వ్యర్థమై నప్పు-దరయు మదిలోన!

౫౮. మధు - కందార్థం

మునురంభ గాధి పుత్రుని
మనమును గరగింప బోయి మరి యేమాయెన్
విను దానికంటె నువు చ
క్కనిదానవె దలచి చూడ -
కంజ దళాక్షి ! కంతుని పక్షి ! —వినవే కామాక్షి

చలమున మేనుల జనగాక దలచిన
కలుగు నమ్మవె హాని కొననేలనే గ్లాని —వినవే కామాక్షి

౫౯. దేవ - దరువు - అటతాళం కల్యాణి రాగం.

కంతు శారికి లోనుగాక నేకదంతుడో ! హానుమంతుడో
శుకవాణి చూపుల చొక్క యుండక పోను, శుకుడో !
భీష్మకుడో !
మచ్చికతో వాని మనసు గరగించి తెచ్చేదా ! మోస
పుచ్చేదా !

ద్వి 20. అక్కరో వినవమ్మ, అపరంజి బొమ్మ
చక్కని కొమ్మ ! ఈ జటినెట్లు నమ్మ
పింగళ జపమును పిల్లి శీలంబు
అంగనరో ఒకధ్యానంబు నక్క

వినయంబు మరియు భావించి చూచినను
ఘనతరంబుగ ఘోటక బ్రహ్మచర్య
మను నీతి వినలేదె యతివరో యిట్టి
జనములేగా నిశా సమయంబు లందు
నిలిచియు భోగము వారి పంచలను
పలుదెఱంగుల చేత భ్రమల జెందించి
తిరిగిరాను తమకోర్కి దీర్చు మటంచు
తెఱ గొప్పగాను ప్రార్థింతురో యమ్మ!

సీ. సోము బింబము గేరు మోము వీక్షించిన
పాటల గంధుల పాటువిన్న
కిలికించిత రసంబు జిలుకు కటాక్షముల్
దలచిన కంబు కంధరము గన్న
జక్కవలను బోలు చక్కని పాలిండ్లు
లీల తోడుతను పోలించి కన్న
అమృతంబు జిలుకు వయ్యారంపు ముద్దుల
పలుకులు చెవుల నేర్పడగ విన్న

తే. కందమూల ఫలంబులు కడుపు నిండ
భక్షణము జేసి వనము లోపల జరించు
మౌని జను లెన్న చలియించగా నితండు
వలవ కుండుట వింత యే వారిజాక్షి!

## సంవాదం - ద్విపదార్థాలు

ఉ. శ్రీరంగ ధాముని సేవకై పూవుల
హారా లొసంగు టాహారార్థ మేను

ఘనముగా కూలికి గతితోడ మాల
లనుగట్ట భక్తియౌనటే ?
అపస్మార భ్రాంతి-యని తోచె నాకు.

మధు. ఎట్లనే చెల్లెలా యితడపస్మార
పాట్లమారి యటంచు పరగ జల్కితివి
దభ్రోక్తులివి గదా ! దలచి చూచినను
విభ్రాంతి గనుపట్టదితడు-
స్థిర మానసుండు, జితేంద్రియుం డగును.

౭౧. సంవాదం - చెణుకు - త్రిపుట తాళం - మోహన రాగం

దేవ. మంద యానరో ! ఇతని మరులు కొనజేసితే
ఇందుకిపుడు మనకు పందె మేమమ్మా

మధు. చెలువొందగా వాని నెవరు గెల్చిన వారి
నిలయంబునకు వేగ నీళ్లు దేవలెను.

దేవ. అలర నీసేవ జేయగవచ్చు నా సేవ
చెలువొందగా నీకు సేయరాదమ్మా !

మధు. అటులైన నింక నేమని యూహ జేసెదో
తటుకున దెల్పవే జిరిశాయి తాటి

దేవ. వనిటరో యెవ్వరోడిన వారు వెలయాలి
తనము విడువవలె నండు తగ సమ్మతించు.

# దాసురాలి వేషం

పాత్ర-ద్వి.21. ఆరీతి విప్ర నారాయణు నేను
జారుని జేతు నిశ్చయముగా నంచు
పంతంబు లాడిన భామా లలామ
వింతగా నపుడొక వేషంబు వేసె
నది యెట్టిదని పల్కు నా దేవదేవి
ముదములో కైతవమును మదిబూని
హాటక రత్న ప్రభావించితం బైన
తాటంక యుగము నంతట సడలించి
తద్దయు పీనుల తాళ పత్రముల
దుద్దులు చాల ముద్దుగ ధరియించి
అందమే నవరత్న హారముల్ దీసి
పొందుగా తామర పూసల పేర్లు
పాలిండ్ల మీదను బాగుగా వైచి
మేలైన బంగారు మెఱుగుల చీర
గట్టుక వలిపె నీర్కావి పుట్టంబు
గట్టియు ముత్యాల కంచుకం బపుడు
వదిలించి తెన్నెల వన్నెల రవిక
అదనుగా దొడిగియు నతి వేడ్క తోడ
వడి ముక్కుమీద సన్నపు నాభినామ
మిడియును నడుమ సొంపెసగ మేచకపు
తిలకంబు సొగసుగా దిద్దియు నెరులు
చెలగి చిక్కొడలించి సింగార ముగను
సిగవేసి ముడిచియు చిన్నని తురుము
వగమీర ధిచనుదోయి పయ్యెద గట్టి
మెరయ క్రొత్తంగ దోమిన దంతపంక్తి

నరయంగ గల్గియు నతి వినోదమున
సరివితో నిజము రాసరిసాని రీతి
తెరగొప్పగా దేవదేవి యేతెంచె.

దేవ-తెరలో

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరా వృత్తి
శ్రీమామిళ్ల పురీ నిశాంతుడు — పునరా వృత్తి

౭౩. తెరవెళ్ళేదరువు - జంపెతాళం - హిందోళ రాగం

దాసురాలు వచ్చె నపుడు - తపసీ కడకు - దాసురాలు
వచ్చె నపుడు

దాసురాలు వచ్చె దాసురాలుగాను తులసి
పూసాలు తామరల సరులు వాసిగా కంఠమున వేసి—దాసు

సింగార మైనట్టి మణులు రంగూల దులకించు చున్న
బంగారు సొమ్ములు దీసి రంగరంగ యనుచు —దాసు

మంద యానమున వీధిలోన వచ్చు చున్నదాని
సుంద రాంగమును జూచి సుందాదు
అరుదందు చుండ. —దాసు

౭౪. దేవ - చెణుకు - త్రిపుట తాళం - హిందోళ రాగం

శకునాము మంచిదాయె నమ్మ త్రోవ నే రాగ -
సఖ నేరుగా జతగా వార శశిముఖులిద్దరు నభిముఖగ
వచ్చిరి. —శకు

ఫలమూ లమ్మాగ గంటినమ్మ - అంతాటి లోన
వలమూరి రవము వింటినమ్మ - కలవాని దిశను

కలకాల బల్లి పలికెనమ్మ - హితముతైనట్టి
పలుకూలు బలుకు చుండిరమ్మా !
అలికుల వేణిరో జలచర యుగమును
వలల ఖండమును తిలకించితి నే —శకు

విరులా దండాలు దెచ్చిరమ్మ గొల్ల చానలు
పెరుగమ్మాగ వింటినమ్మ ఘటమూల నింద
సురగొంచు త్రోవను వచ్చిరమ్మ కుడినుండి యెడమకు
గరుడాడు పాల దీర్చెనమ్మ !
అరుదుగ గాయక వరులు విపంచిక
కరముల మీటుచు గానము జేసిరి. —శకు

భేరీ నాదాము వింటినమ్మ - జోడూగ నిద్దరు
ధారూణి సురలు వచ్చిరమ్మ - పుణ్యాంగ నాలు
హారాతి పాట బాడిరమ్మ - మామిళ్ల పల్లి
శౌగౌరి కరుణించు నేమొకోమ్మ
భూరి కలశముల నీరము నించుక
సారస పాణులు జంటగ వచ్చిరి. —శకు

ఆ. పాలు చల్లయున్ బి, డాలంబు శకటంబు
తైల మినుము యొంటి ధరణిసురుడు
రిక్త భాండములు ధరిత్రిలో నెదురుగా
వచ్చెనేని కీడు వచ్చుచంద్రుడు ! 62

ప్రతి - వ. నీవు భక్తురాలి వలె మన్నావు - ఈ సభకు యేతెంచుటకు కారణ మేమో సవివరంగా చెప్పుకరావే అమ్మా !

దేవ - ఆ.వె. జగతిలోన నేను జనియించినది మొద
లఖిల సౌఖ్య పదవు లనుభవించి
యిపుడు వాంఛ లుడగి నిపుణత దేశిక
వరుని వెదక నిందు వచ్చినాను. ౬౯

౬౫. చెణుకు - త్రితాళం - కల్యాణి రాగం

గురుని జూపరమ్మా! దేశిక వరుని జూపరమ్మా
అరయగ సకల రహస్యజ్ఞుండై, నిరు మంత్రంబు పదేశ
మొసంగెడు. —గురు

కినుక లేనివాని కోరికలును గోరని వాని,
ఘన మోహంబను వనధి మునింగిన, మనుజుల కడదేర్చెడు
పుణ్యాత్ముని—

చల్లని దయవాని, మిక్కిలి శాంతుడైన వాని
ఉల్లమలర మామిళ్ల పల్లె వారి, నెల్లప్పుడు భజియించు
చుండెడు. —గురు

తే.గీ. ఆది నారాయణుండె దయా రసమున
నవనిలో దేశికుండయి యవతరించి
దృఢముగా చేతనుల కడదేర్చు గాక
నితరులకు నట్టి మహిమ లింకెందు గలవు. ౭౦

తే.గీ. పూర్వ జన్మ సమార్జిత పుణ్య ఫలము
చేత నతిశాంతుడైన దేశిక వరుండు
గలుగవలె గాక నెటువంటి ఘనులకైన
లేకయుండిన గలుగునే ప్రాకటముగ ౭౧

ప్రతీ - కం. ఇక్కడనే గురుడున్నా
డెక్కడనో వెదకనేల నిందుని భాస్యా !
చక్కని జని యా మౌనికి
మ్రొక్కుము నీ పూర్వ పుణ్యములు ఫలియించున్. ౭౭

వ - అదుగో నమ్మా ! దేశిక వరుడు-

( ప్రతీహారి చూపగా దేవదేవి సమీపమునకు వెళ్ళి )

౭౭. దేవ. చెంచు-రూపకతాళం-యమునా కళ్యాణి.

దండ మర్పించెద ధరణీ సురేంద్ర - పండితాగ్రేసర భవ్య
గుణసాంద్రా !

నిండు వేడుక నీ పాదంబుల దండజేరి వేరొండు
దలంపక — దండ

స్థిరమూగ మీసేవ జేయంగ వలెను.

ధరణి యెల్ల నేతిరిగి తిరిగి వేసరి యిప్పుడు మీ మరుగు
జేరితిని.

అరమర యుంచక కరుణ తోడుతను, తిరు మంత్రంబు
పదేశము జేయుడు !

పల్లావ సహావాన భ్రమలు మానితిసి, చల్లని నీప్రాపు సరవి
జేరితిన్

ఉల్లమలర మామిళ్ళపల్లి హరి, నెల్లప్పుడు భజియించుచు
నుండగ -

మెల్లన మీ తిరుమేను జూడగా, చెల్లె గాక నే చెలియకు
వశమే ! — దండ

విప్ర - కం. జలజాక్షి యెవరి దానవు
నెఁవ్వ, కులము నామ మేఁది నీవేటికి నీ
స్థలమునకు వచ్చితివి యిది
తెలియంగా బలుకు తేటతెల్లము గాగన్ 88

దేవ-ద్వి. 22. దేవసన్నిభ ! భూమిదేవ మీ యాజ్ఞ
నా వర్తమాన మంతయు తేటపరతు
మగనాలి గాను నేముక్కువ తోను
తగ నూడిగము సేయు దాసిని గాను
తలపోసి చూచిన తగవెందు లేక
వలసిన యటులనే వర్తింపు చుందు
నాలుగో జాతి దానను నిక్కముగను
వాలాయముగ సర్వ వర్ణంబు లకును
ధరణీ సురుండు నిక్కముగా గురుండు
ఇరవొందు శూద్రుల కెల్లను భూమి
సుర సేవ దగును భూసురులలో పలను
హరిభక్తు లుత్తములందు వైష్ణవులు
పరమ ముఖ్యులు జూడ వారిలోపలను
తెలగొప్పగా జితేంద్రియులు భూస్థలిని
పరగ సాతాద్భ గవంతు డటంద్రు
తిరముగా పెద్దలు తెలిసి నంతకును
ఇన్ని గుణంబులు యెంచి చూచినను
పన్నుగా దేవర వారికే గలవు
భావించి మీ తిరువళిఘులు భక్తి
సేవింపగాను వచ్చితి కటాక్షించు. 10

౬౭. చెణుకు - అటతాళం - కల్యాణిరాగం

దయ నిటుజూడ వేమి శ్రీగురు స్వామి, దయ
నిటుజూడ వేమి

విడువాక నీతిరు వళిఘూతె నమ్మితి
కడతేర్చవే నన్ను అకియేన్ దాసిని —దయ

కపటాత్ములాల నీచపు దాసు రాలను
చపలాత్మురాల నా యపరాధ మెన్నక —దయ

పాతాకు రాలను నేను పతిత పావనూడవీవు
చేతాను రాలిని ఖ్యాతిగ నేలుము —దయ

సీ. పంచేంద్రియములచే భ్రమల జెందితి గాని
దేశిక స్వామిని దెలియనైతి
తనువు నిజంబని దలచి యుండితి గాని
దేశిక స్వామిని దెలియనైతి
మోహ జాలమునకు మోసపోయితి గాని
దేశిక స్వామిని దెలియనైతి
మనసు నచ్చిన విధంబున చరించితి గాని
దేశిక స్వామిని దెలియనైతి.

తే. అక్కటా యిన్ని దినములు వ్యర్థమగుచు
గడచి పోయెను గురుని మార్గంబు దెలియ
ఇంకనైనను కడతేర్చి యేల వయ్య
ధృతి విజిత శితశైలేంద్ర! దేశికేంద్ర! ౭౪.

౬౮. చెణుకు - అటతాళం - హిందోళ రాగం

ఎక్కాడి మోహము యిది నన్ను విడువాదు దేశికేంద్రా!

చిక్కాము లోపాల జిక్కిన విధమాయె దేశికేంద్రా!
పలు జన్మముల నెత్తి భ్రమల జెందితి నయ్య దేశికేంద్రా!
తెలియాక యీరీతి దినములు గడిచేను దేశికేంద్రా!
అవిరామముగ భక్తి నంజలి జేసెద దేశికేంద్రా!
భవ బంధముల నెల్ల బాపి రక్షించుమాము దేశికేంద్రా!

౧౯. విప్ర-వెణుకు-ఏకతాళి-భీంప్లాస్ రాగం

వాలుగంటి! యే విరక్తి యేల సంభవించె నీకు
చాల విస్మయంబయ్యె నీవేళ వినగా
ఇంతిరో యిన్ని దినము లెచట నుండితివో? నీ వృ
త్తాంతంబు మాతో దెల్పు మంబుజాననా! —వాలు
కీరవాణి! నీ కెవ్వారు లేరంటివి, మింటి నుండి
ధారుణిలో నుట్టిపడిన దానవె నీవూ. —వాలు

౨౦. దేవ - దరువు - ఆదితాళం - కాఫీ రాగం

స్వామీ! దేశిక సార్వభౌమా! సుగుణా భిరామా!
కామ మోహాది కలుష విరామా!
నీముందర నేనేమని పల్కుదు నామన విపుడు
ప్రేమాతో వినుమా. —స్వా
శునక సూకర జాలమైనా-ఇటువంటి పాట్లు గనలేదు
నీపాద మానా. —స్వా
నినుగని వందన మొనరించిన యంతనె నా పాపము
జనియె ధ్వంసముగ. —స్వా

నెనరుతో నను జూడవయ్యా నేటికిక నాదు జననము
సఫలమాయె నయ్యా. —స్వా

ఘనముగాను మీరవగను సాకా ద్వనజాయత
లోచనములు దలంచగ. —స్వా

అతికష్టమైన తనువు బూని, యేవేళ జూచిన మితిలేని
దుఃఖంబు లాని. —స్వా

సతతము ఈ సంసారము నిజమని మతిలోన
నమ్మితి గదయ్యా. —స్వా

ద్విప - 28. శ్రమించు చుండు కాంచీ నగరమున
కామమంజరి చంద్రకళ మంజువాణి
కలహంస చిత్రాంగి కాంచనమాల
కలికి పద్మావతి కర్పూరతిలక
మందారవల్లరి మదనాభిరామ
సౌందర్యలహరి పుష్పసుగంధి భాను
మతి రమాతిలకిగిని మధుర భాషిణియు
చతురాస్య రాజరంజక మొదలైన
అచ్చర కులమునం దతి వేడ్కతోడ
మెచ్చులు గులుక జన్మించిన యట్టి
తీరు తీరులతోడ తెలగొప్పు చుండు
వారాంగనా జనవ్వర్తింతు రందు
నొక సారవతికి నేనుదయించి పిదప
సకల కళా రహస్యంబులు దెలిసి
సంగీత వాద్య లాస్యంబుల తెలుగు
సాంగంబుగా గని సాహిత్యవిద్య
నాటకా లంకార నైపుణంబులును
పాటించి యభిన పటిమలు నేర్చియ

అలర శైశవ యవ్వనాం తరంబునను
వలనొప్ప బ్రాహ్మణుల్ వరియించి నట్టి
శుభలగ్న మున నొక్క సుందర పురుషు
నభిమత వస్తువులన్నియు నొసగి
వలపించి లాలించి వలరాజు కేళి
నలరించి నేరది యాదిగా విటుల
మరపించి బెల్లించి మది గరగించి
తిరుగుదు మాతల్లి దెలిపిన రీతి
మనసిజుం డెప్పుడే మరకను నాదు
కనుసన్న జరియించు కడు వేడ్క నిదియు
దేవర వారితో దెలియ జెప్పితిని
దేవదేవి యటండ్రు తెలుగొప్పనన్ను.

సీ. తూరుపు నాడేలు దొర లందలము నెక్కి
వచ్చి నారదె బహిర్ద్వార మునను
ఇదుగొ వచ్చెదమని హేమ భూషణములు
బంపిరి దక్షిణ పార్థివులును
అందరి కంటెను ముందుగా జనుదెంచి
నాడు పశ్చిమధరా నాయకుండు
ఉత్తరదిశ మానవోత్తము లంగణ
సీమ యందున్నారు ప్రేమతోడ
ననుచు చెలులెరిగింపగా ననవ రతము.

తే. వారి బిలిపించి మరుకేళి గారవించి
కలిసి యుండుదు నెపుడు నా నిలయమందు
పైడి వర్షంబు గురియు భాసురము గాగ

౮౧. చెణుకు - ఏకతాళం భీంప్లాస్ రాగం.

నీలవేణి ! నీ పాలిండ్లు కేలబట్ట నిచ్చితేను
త్యాలు గూర్చిన కంఠ మాలికిచ్చేనే !
మచ్చిక తోడుత నాతో ముచ్చటలాడిన జాలు
పచ్చాల కడియాల జోడు మెచ్చి యిచ్చేనే
కొమ్మారో ! ఈవేళ నీదు కెమ్మోవి నొద్దిచ్చిన
సమ్మోతిగాను పంజుల కమ్మా లిచ్చేనే !

వ - అని నిరంతరంబు ప్రార్థింపుచుందురు.

విప్ర. వ - మరి నీవేల నిరాకరించితివి ?

# వారకాంతా లక్షణము

దేవ - ద్విపద. ఒకని రమ్మని పిల్చి యొకనితో నవ్వి
ఒకనితో విడెమంది యొకనింటి కేగి
ఒకని లాలించి వేరొకని కన్గీటి
ఒకనికె ముద్దిచ్చి ఒకని చేపట్టి
ఒకని కౌగిట బెట్టి యొకని భ్రమించి
ఒకనికి తాంబూల మొసగియు వేడ్క
ఒకని భూషించి వేరొకని నిందించి
ఒకని చెక్కిలినొక్కి యొకని చుంబించి
ఒకని చక్కిలిగింత లొనరించి మదిని
ఒకని దలంచుచు నొకని తోడుతను
సకల కళా రహస్యంబులు దెలిసి

ఒకని తోడుత చతురోక్తులు బల్కి
ఒకనికి మునిమాపు నొకనికి జాము
ఒకనికి నడురేయి ఒకనికాపైని
ఒక తోయమగు వారికొక దినంబునను
ప్రకటంబు గాకుండ రమ్మని పలికి
బంగారు సొమ్ములు పట్టు చీరలును
రంగుగా వరహాలు రాదీతు రంత
కటకటా! ఎటు నమ్మగా వచ్చువారి
విటుడు పెనంగిన వెనకును వారి
తనయుడు గూడునా తరువాత తోడు
జనకుడు నీరీతి జనుదెంతు రంత
వాని మఱందియు వాని బావయును
వాని మామయు మరి వాని తాతయును
వచ్చి సమ్మతిజేసి వలచిన యటుల
పచ్చ విల్తుని కేళి పలుమారు కోర్కె
దీరుచు కొందు రీతీరు మానదత
దారుణి వేశ్యకు ధర్మంబు గలదె

సీ. ఘనముగా నిల్వేడు ధనమొసంగిన నిల్వు
టద్దాల మేడలో హంసతూలి
కా తల్పమున జేర్చి కందర్ప కేళిలో
వేడుక తోడ మెప్పించు నతడె
మరునాడు వచ్చిన మన్మథుడైన నను
తద్వేశ్యమాత క్రొత్తగను జూచు
పాన ధనుణకు నేమైన యిమ్మని చెయి
జాచు నొసంగిన సమ్మతించు

తే. లోపమైనను పడకింటి లోని కతని
జేరనీయదు భక్షకంబు చెలువు దాల్చి
చాల భర్జించు నిదియు వేశ్యల తెఱంగు
యింక నేమని నే వచియించు దాన ! రా॥

ద్వి - 25 వార కామినుల భావంబులు వారి
నేరుపు లోకకొన్ని నేడు బల్కితిని
ఇసుకపాతర లిపి యెల్ల ద్రవ్వినను
పస లేదటంచు నేర్పరచి యెల్లడల
యా కూటిపై యసహ్యంబును దోచె
తేకువతో దాని తెర గెఱింగింతు
ఒకనాడు హరివాస రోపవాసమున
ఒకడైన విటుడు రాకుండిన వేళ
సదనంబునకు బోక చయ్యన వెడలి
మది చింతనందియు మక్కువ తోను
శ్రీకాంతు భువనంబు జేరి యచ్చటను
ప్రాకటంబుగ జాగరము జేయుచున్న
పండితుల్ శ్రీ భాగవత పురాణంబు
దండిగా జదివి యర్థము జెప్పుచుండ
నందొక పింగళ యను వేశ్య కథయు
పొందుగా వింటి నప్పుడె వేశ్యకాంత
జనమిట్టిదే గదా ! సంశయం బేల
నని విరక్తి జనించె నదియాది గాను
ధన మార్జించు చిత్తము బట్టదయ్యె
ఘనముగా నా వారకాంతయే మాకు

గురువుగా భావించి కలటూకు వృత్తి
మరచియు చాల నేమ బుగా నుందు.) 11

౭౨. వెణుక - అటతాళం - తోడి రాగం

ఆచార్యుడని నిన్ను నమ్మితి - దురా
చారాములు నెగ జిమ్మితి
ఇల భాగవతుల సేవించితి మా
కులము నడతలు పరిహారించితి —ఆచా

భూసురాన్నము భుజి యించితి - శూద్ర
భుక్తాము లెల్ల వర్జించితి —ఆచా

౭౩. విప్ర - దరువు - అటతాళం - కాపీరాగం

మగువా! ఇటు రాదగు నటవే! వచ్చి
దిగులు లేకుండను తెగువాటలే!
జగతి లోపలాను మొగవారు గనుగొన్న
మగువాలు జూచిన నగుబాటు గాదే! —మగు

క్షితిలోపలా భాగ వతులాకును ఎట్టి
చతురోక్తి గల వార సతులాకును
మతి దలచగా నిమిష మాత్రమైన గాని
జతనుండ రాదను కలవీవే. ఓ —మగు

ముందెవ్వ రికెట్ల నందైనను పొంచి
పొందుగాను దూర మందైనను
సుందారి! కన్నెత్తి చూడ వెరతురు నీవు
యిందు నిల్చిన వట్టి నిందాలు బుట్టేను —మగు

ద్విప - 26. పరగ కాకులు రావిపండ్లు భక్షించి
గురు తరంబుగ రాతిగుడి మీద నిలువ
సరభసంబునను తత్సంబంధ మునకు
స్థిరతరంబుగ రావిచెట్టు దయించు
కనుక; లతాంగి! కాకములోలు యోగి
జనము; శిలా దేవసదనంబు వంటి
వారు గావున నిట్టి నాలుగంటులను
జేర నీయగరాదు సిద్ధమీ మాట.

ద్విప- ఎందరకైనను యిల కొంగుబఱచి
ఎందరికో జాన లెప్పుడు దప్పి
సంచరించియును వేశ్యా ధర్మమెల్ల
యెంచి చూచిన మహా హీనమటంచు
చిత్తంబు చాల రోసినది గాకున్న
వత్తురే యెటువంటి వారైన పుడమి
సకల భోగముల వాంఛలు విడనాడ
నికవానిపై గోర్కె యెట్లు దయించు
కక్కిన కూటిపై క్రమ్మర వాంఛ
లక్కట జనియించునా గురురాయ 9

సీ. పుడమి నామది భోగవాంఛల యందు
చాల రోసినది నిశ్చయము గాను
నీ చిత్తమైన ముందే చలనము లేక
నిర్మల మైనది నిజము గాను
చక్కగా తన మానసము పదిలంబైన
కలట యింటను నైన కూర్మితోడ
కాపుర మొనరించగా నేమి కొదువయే
ఇందుకు సందేహ మేల జెపుదు

తే. పాలు విరిగిన పెరుగునా భ్రాంతి గాక
మమత జనియించునా వట్టిమాట గాక
నీ పదంబులు నమ్మితి నిక్కువముగ
నీకు నీమాట జెల్లునే నిగమ రూప! ౭౭

(స్వగతం)

వి-ద్వి - 27. ఇంత చక్కదనంబు యింత గంభీర
మింత యొయ్యారంబు యింత లాలనము
గలిగియు వేశ్యయై గానవిద్యలను
పలు తెలుంగులచేత బాడగా నేర్చి
భరత శాస్త్రమునందు ప్రౌఢయై యుండి
చిలుక ప్రాయమునందు చెన్నొంది విటుల
వలపించి వంచించి వారిధనంబు
గలిగి నంతయు దీయగా నేర్చి సకల
భోగంబు లనుభవించుచు నుండు వేళ
ఈగతి భిక్షుంబు లెత్తి దేశంబు
తిరుగంగ నేటికి దీనికి మదిని
చిరతరంబుగ విరక్తియు సంభవించి
నదిగాన యిటువంటి యతివ యిందుండ
కొదువ లేదిక జేర్చుకొనవచ్చు నిపుడు
ఇది యదృచ్ఛా లాభమేల పొమ్మందు
పదిలంబుగా తోటపనికి చేదోడు.

౭౮. సంవాదం - వెలుపు - అటతాళం - శ్యామరాగం

విప్ర. చయ్యాన పూవుల చెట్లపందున లెస్సాగ కలుపు
దియ్యా నేర్తువా విరులు గొయ్యా నేర్తువా!

దేవ. విరులు గోయ్యనేర్తుగాని తరువులెక్క నేరనయ్యా
సరస రంజనా! దాస దురిత భంజనా!

విప్ర. పాయక భూజాతములకు సాయముగాగను పాదులు
జేయనేర్తువా? జలము బోయనేర్తువా?

దేవ. నీరు పాదులాకు బోయనేర్తుగాని యేతమెత్త
నేరసామి! కరుణ జేరవేమి?

విప్ర. దిట్టతనము మీరగను, దట్టముగ తెప్ప యచ్చులు
గట్టనేర్తువా? సరులు గట్టనేర్తువా?

దేవ. గట్టిగాను మడువా లచ్చులు గట్టనేర్తు కుద్దాలముల
మట్ట జాలను, చేతబట్ట జాలను.

విప్ర-ద్వి. 28. అతి సుకుమార దేహము గల్గునట్టి
అతివవు నీవు! ఈ యెలదోట లోన
యేరీతి వర్తించె దేష్టమైన
భారపు పనులకే పగిది నోర్చెదవు
అరయంగ మాధుకరాళకం బిపుడు
పరగ నేగతి వసాపాటు జేసెదవు
యైన నోపుదువేని యంబుజ నేత్ర
మానసంబున నిల్పి మాతోటి పాటు
కనిపెట్టుకొని యుండు ఘననీలవేణి
పనియందు నేనేళ ప్రాలు మాలకను. 5

*౨౯. దేవ - దరువు-అటతాళం ఆనందభైరవి రాగం*

మీనామమే స్మరియించెదా! సన్నిధిలో, ప్రవృత్తిగా
వించెదా!

మానాక మీరేమి యానతిచ్చిన గాని,
మానానను భక్తిచే నొనరించెద- —మీనా
కూలి కొక్కరి సేవ జేయుదును, గురుని
కీలు మదిలో దెలియ జాలను
ఏలిన వారి సేవేగాని యీదాను
రాలికి లేవు దేహాభిమానములు —మీనా

తిరుమాళిగ పనులు జేసెద, జిగిలి
తీనె రంగవల్లి వ్రాసెద!
తిరుపుట్టమును సుదికి తెప్పియిచ్చెద మీకు
తిరుమజ్జనము దినదినము జేయించెద- —మీనా

మద్ఘోష జలనిధి నావికా!
నా ముద్దుల రంగడ వివేకా!
బుద్ధిజెప్పి మీకు ఒద్దుకొన్న జాలు
వద్దానజాల నే పనికైన నోపుదు- —మీనా

వ- మీరనంగా సాక్షాద్రంగ నాయక స్వరూపులు, మీకైంకర్యం
బు మన్మథగురు కైంకర్యంబు లభింపించినట్లు.

మా. అని నైత్యానుసంధానంబుగా బలికి, తదీయ దాస్యమంగీకరించి
ప్రమాదిలో వేగ జొచ్చినగతి, యతని సమీపంబున కైంకర్యంబు సేయు
చుండె.

ద్వి - 29. అరుణోదయంబున కటమున్న లేచి
సరగున జని నదీ స్నానంబు జేసి
సోము బింబము గేరుచుండు మోమునను
నామంబు చాది తిన్నగ చుక్కబెట్టి
తిరుమాళిగకు జనుదెంచి యిల్లలికి
అరయ ముగ్గులు బెట్టి యాతడు మేలు

కవినంత దండంబు గావించి, యతడు
జనియు కావేరికి జలము లాడంగ,
స్నానంబు సంధ్యయు సలిపి శ్రీహరిని
ధ్యానంబొనర్చి నిజాలయం బునకు
నరుగు దెంచెడు వేళ కలరులు గోసి
సరములు గూరిచి "స్వామిరో! లెస్స
యున్నవే" యని పల్కి యర్వీజములను
తిన్నగా కలపున్న దీయు సంధ్యలను
తిరువళ్క బెట్టి రాతిరి నెఝ్విగప్పు
తిరిపంబునకు బోయి తెచ్చి ధాన్యంబు
యోపిక తళిహాను యొనరించి నేను
సాపాటుజేయ నిశ్చయమని జెప్పి
తనయింటికేగి నిత్యము షడ్రసాన్న
మును మూడుమారులు భుజియించి వచ్చు 10
అలివేణి యచట యిట్లున్న పానీయ
ముల కాళపడక రేపుని మాపునిట్లు
వెలలేని దాసియై విప్రు సన్నిధిని
చెలువొందగా పనుల్ సేయుచు నుండె. 12

## —సరి వాదాలు—

*౨౬. చెణుకు - ఆదితాళం - శ్యామరాగం*

దే. అరవిరులు పోలించి చూడు, వీని కరమొప్పు గోతునా
నేడు - స్వామి

వి. కోరకములవి ముట్టనేలా! వాని, గోయకువె నీవు
యీ వేళా — బాల

దే. పొన్నపూ లందవే మైనా, నేను సన్నజాజులు గోయు
దానా - స్వామి

వి. కొమ్మ మెల్లనవంచు కొమ్మా! పొగడ, కుసుమాలు
గోయవే - కొమ్మా

## 30. ఉభయులు చెరి యొకదళం అనవలసిన ద్విపద

విప్ర. తరుణి ఈవనము ముదంబున జొచ్చి
పరిమళ సుమము లేర్పడ గోయవలయు

దేవ. పొలుపొంద నీత్రోవ పునుగున చట్టు
వలు మీరుచుండును పదమిడరాదు.

విప్ర. జారకుండగ లతాచయము చేపట్టి
బోరున నీజాడ బోవగా వలయు

దేవ. పుష్పాడి తిప్పయై పుడమి యిందెల్ల
గప్పుక యుండును కాలూనరాదు

విప్ర. వారగా నుంచి యీ వలినుంచి పోవ
చేరువ యైయుండు శ్రీగురు రాయ

దేవ. వలనొప్ప తేనెకాల్వలు పారుచుండు
అలరగా నిటునటు నడుగిడ రాదు.

విప్ర. తెలియంగ వినుము నై తేనేమి యిపుడు
తలిరాకు తిప్పలు దాటగా వలయు

దేవ. చెలువొందు పొదరిండ్లు చిమ్మచీకటి
కలిగించుచుండు నేకరణి బోవచ్చు

విప్ర యైననేమింక నీ యయనంబు విడిచి
పూని యీవలిత్రోవ బోవగా వచ్చు

౭౭. చెణుకు - ఆదితాళం - మోహన రాగం

విప్ర. చెయిజాచి కొమ్మందు కోవే - ఓ
చెలియ పూవులు గై కోవే-

దేవ. కొమ్మమీది కెక్క జాల, ఓ గురుడ! పూవులు గోయజాల

విప్ర. ఎత్తునుంచి యందుకోవె, ఓ యింతి పూవులు ద్రెంచుకోవె

దేవ. అందావు నేనేమిసేతు ఇంకగురుడ అవియన్ని నేనెట్లు గోతు

విప్ర. కొమ్మ యిచటికి నీవురావే-పూలు గోయ వచ్చును దీసికోవే

దేవ. మీరే యేతెంచి యీయరయ్యా-మా మీద కరుణ జేయరయ్యా.

విప్ర. మామిళ్ల పల్లి వారిని చాలా-నమ్మి
ప్రేమ పువ్వులు గోయుటాలా.

దేవ. అందీన విచ్చేద నయ్యా-దండ అందాముగా గట్టరయ్యా.

౭౮. చెణుకు - జంపెతాళం - కల్యాణిరాగం

విప్ర. వాలుగంటి యివి చేమంతిపూలు గంటివే, ఈ
వేళ కందాకుండాగ నీవిపుడు దెంచావే!

దేవ. గురురాయా! చేమంతిపూలు గోయుమంటివి-నేనే
కరణి గోయుదు నీరుపాదూల గలిగియు..ది

విప్ర. సుందరాంగి! పరిమ ళించు చుండు దవులా-పొదలా
సందూన మెల్లానగోయు జాజిపువులా.

దేవ. రాసిగాను పొదల సందూన వాసించుచున్న-వచట
భాసురాంగా! జాజులుగోయ వశము గావెన్నా!

విప్ర. పొగడపూవు లివిగో! లెప్స పోలించి చూడు-ఓ
సొగసూగ గోయావే పూసినవి నేడు

దేవ. పొగడపూలు చెట్టుమీద బూసియున్నవి గాని
అగపడవు కోయబోయితె నందకున్నాది.

విప్ర. శ్రీ మామిళ్లపల్లి నారసింహూని దలచియిపుడు
కోమలాంగి పూచినపూలు గోయావె నిలిచీ

దేవ. స్వామి ! పూలుగోసెద గాని చాతుర్యముగను, మీరే
సేమముగ దండాలు గట్టారె నేర్పుమీరగను

## మత్తకోకిలాష్టకాలు

దేవ. ఘుమ్ము ఘుమ్మన మల్లెపూవులు కోర్కెదీరగ దిక్కులన్
కమ్మవాసన లుమ్మలించగ గాంచితెచ్చితి యీ యెడన్
సమ్మతంబుగ లెస్సజూడుము సంగ్రహించుము వేడుకన్
కమ్మవిల్తుని సాయకమ్ములు గ్రక్కునన్ గురునాయకా! ౭౦

విప్ర. కొమ్మ మెల్లన మల్లెపువ్వులు గోసితెచ్చియు నియ్యెడన్
కమ్మవిల్తుని మొల్కు తౌననగాను నీకపరాధమా
సమ్మతించితి నిన్నుగూర్చిక చాలుచాలిటు వంటివా
క్యమ్ములాడకు నింకబల్కిన నార్యులొప్పరు రేధరన్. ౭౧
దేవ - స్వగతం.

ఆట - పరిమళించు మల్లె విరులు గోసుక వచ్చి
సామి యివి గ్రహించు శంబరారి
ములుకులన్న నన్ను దిలకింప మదనుని
దలచ వద్దటంచు బలికె నతడు ౭౨

కం. కావున దెలిసెను నతనికి
భావంబున స్త్రీలమీది భ్రమలేదిక నే
నేవిధమున సాధింతును
దైవం బెటు జేయునొక్కొ తలపోయంగన్. ౭౩

౭౯. చెంచుకు - అటతాళం - యమునా కల్యాణి రాగం

ఏల వస్తినమ్మ! అమ్మమ్మ! నే నేల వస్తినమ్మ
బాలారో! మామిళ్ళపల్లి వాలునికి కరుణలేదు.
అందరాని మావినిపండు కాళ్ళజెందినట్టులాయె —ఏల
బూరుగచెట్టు కాచున్న కీరమూల చందమాయె
ఇమ్ముగా కింశుకము జేరిన తుమ్మెదతో సాటియయ్యె —ఏల

ద్వి - ౩౧. కటకటా! ఇతని నేగతి వలపింతు
ఎటువంటి విధమున నే చరించినను
మనసు కరంగదేమని యూహసేతు
వనము లోపలి పాదపంబుల నెల్ల
పాలింప వలెనని పలుకును గాని
మాలిమి తోడుత మాటలాడండు
మాయక్క జెప్పిన మాటలు వినక
ఈతని దగ్గర కేల వచ్చితిని
వేగమే యీతని వెంటబెట్టుకొని
బాగుగ నింటికి వచ్చెదనంచు
నేనేల బల్కితి నిక యేమిసేతు
పూనినట్టి ప్రతిజ్ఞ పోకడబెట్టి
ఏరీతిగా నేను నింటికిబోదు
వారకామినులెంత వారలైన
వలపింతు రందురా వాక్యంబులెల్ల
తలపగా నిపుడు సత్యముగాక పోయె
కలకంఠి నా చమత్కారంబు లెల్ల
పొలుపొందగా జూతిబొమ్మ కొనచ్చె
చక్కిలిగింతల చందంబులయ్యె

మక్కువతో డ(శ్రీ) మామిళ్ళపల్లి 10
హరి దయారస మించుకైన లేకున్న
హంగ నేకార్యంబు ఫలియించ గలదు.

సూత్ర - 32. నలుగురి లోపల నగుబాటు లయ్యె
తొలి జన్మములనేమి దోషంబు జేసి
జనియించితినొ పాటి జలజ లోచనలు
ననుగని హాస్య మొనర్చ కుండెదరె
భావింప నేనింత పర్యంతమితని
సేవజేసిన దెల్ల శాంతింప గాను
అడవి గాచిన వెన్నెలై కనిపించె
జడుడితడొక్క పాషాణంబునైన
వరున తోడుత వెన్నవలె జేయవచ్చు
తరము గాదింక నీతని సహవాస
మెన్ని దినంబులు యిట్లున్నగాని
మన్నించునా వీరి మర్యాద దెలిసె
ఇచ్చట నుండిన నిక నేమి కీర్తి
వచ్చును శ్రీరంగ వాసాది పుణ్య
భూముల కైనను బోయి యచ్చోట
స్వాములకైన పూజలు సేయవలయు. 19

వ. అని చింతించుచు నారాత్రి నిద్రించి యంత నొక్క సుస్వప్నంబుగని దేవదేవి—

రాం. దేవ-చెణుకు త్రిపుటతాళం - హిందోళరాగం

కలగంటి! నంతట మేలుకొంటి! ఓ వాలుగంటి - కలగంటి
కలలో నొకచక్కని పురుషుడు తెలతెలవారగ నే తెంచి
నట్లునే - కలగంటి

చెంత వారి నిలిచియుండినట్లు వేడుకతో నన్నెంతో లాలన
జేసినట్లు —కలగంటి
కాంత యింక నీ పంతము జెల్లును చింతయేలనని
చెప్పినయట్లు —కలగంటి
త్వరపడవద్దు! వద్దన్నట్లు, మా యాజ్ఞతోడ, మరులొందు
నను న్రమ్మన్నట్లు —కలగంటి
ధరణీ సురుడరుదూగ నీతో, మరుకేళిని యే మార డన్నట్లు
—కలగంటి

కలికి నామాట వినుమని యన్నట్లు మామిళ్లపల్లి
నిలయుడనని వచియించినట్లు —కలగంటి
చెలియరో! నీమది దలచిన కోర్కులు ఫలితము
లగునని పలికినట్లు నే —కలగంటి

సీ. అహాహ నా భాగ్యమే యబ్జ నేత్రలకైన
గలుగునే ధాత్రిలో దలచిచూడ,
సిరి యురస్థలమున చెన్నొందు చుండువా
డాజాను బాహువు లమరువాడు
కరముల శంఖు చక్రములు గల్గినవాడు
తొగల రాయుని నగు మొగమువాడు
హార కోటీర కేయూరముల్ గలవాడు
మేలైన బంగారు శాలువాడు
పద్మనేత్రుండు మామిళ్లపల్లి శౌరి
స్వప్నమున వచ్చి నీకోర్కి సఫల మగును
చింత సేయకు మింక నీచిత్తమునను
నమ్మమని పల్కె నమ్మ! కుందనపు బొమ్మ! ౭౨

ప్రతి - తే. అతివ నీవెంత పుణ్యాత్మురాలివమ్మ
వనజభవ ముఖ్య నిర్జరుల్ వినుతిసేయు
కన వడనివాడు నేడు నీ కలను వచ్చి
కోర్కి ఫలియించు ననిపల్కె కొదువలేక. ౭౩

కం. కావున నికనిను గనుగొని
యా విప్రుడు మన్మథాశుగ నంతా
నావిల చేతస్కుండై
నీవశుడై సంచరించు నిజమిది తరుణీ! రా॥

౮౧. సంవాదం - చెణుకు - కుఋవజంపె తాళం కల్యాణిరాగం

విప్ర. పూలు గోసిన నిన్ను బాలా! సహకారపురము
హరిమెచ్చు నేవేళా!

దేవ. గురురాయ! మాకు మీతోడు గల్గినను
విరులు గోసెద నయ్య నేడూ —పూ

విప్ర. శ్రీరంగ ధామునకు పూలపూజ సేయవలె నింక జాగేల!

దేవ. మీయాజ్ఞ శిరసా వహియించి పూలు
గోయుదును చాల మోదించి

విప్ర. సురపొన్న కుసుమములు గోవే-మల్లె
విరులు గోసితిని గైకోవే

దేవ. గురుచంద్ర గోరెంట పూలు-ఇదుగో!
కోసితిని గొజ్జంగి పూలు

విప్ర. కేతకి సుమములు గోవే-పారిజాత పుష్పములు గైకోవె

దేవ. సొంపుగ నుండ ననిడాయ-బోయి
సంపెగలు గోస్తి గురురాయ!

విప్ర. గన్నేరుపూలు గైకోవే-ఇదుగో పొన్నపుష్పములు చేకోవే!

దేవ. పాటలీ పుష్పములు చాలా-వేరుపరచి తెచ్చితి సుగుణశీలా!

విప్ర. అంగనరో! కుముదములతోను-సరసిలో
చెంగల్వలను గోసినాను!

దేవ. మేలౌ నశోకపుష్పములు-ఇవిగో
పోలించు పొగడ పుష్పములు !

విప్ర. కింశుకములను గోసినాను-ఇవి నీవు
కేల నంటవె మోదమునను !

దేవ. సంతాన కుసుమములు చూడు-సూర్య
కాంత సుమములు గోస్తి నేడు !

విప్ర. విరులు గోసితివి యీ వేళా-నీవే సరులు గట్టుము ముద్దుబాల !

దేవ. విరుల దండలు గనుదు చూడు-శ్రీహరికి నర్పింతాము నేడు !

విప్ర-స్వగతం

కం. కలనైన నేను నుడివిన
పలుకులు జవదాట వెఱచు ప్రతి దివసంబున్
పలుమరు విశ్వాసంబును
గల దీనికి సాటికాంత గలదే భువిలో. రా॥

రా॥ దరువు - ఆటతాళం - మోహనరాగం

ఎంతో గుణవంతురాలు, ఈదాసురాలు, ఎంతో
అంతరంగమూన యిసు, మంతైనా కోరిక లేదు
ఎంతో భక్తితోడ తోట కేతెంచు మై దాచుకోదు
పూలు కందకుండగ గోయును-బలు
వింతగాను మాలికలు గట్టును —ఎంతో
వాలాయముగ తానే ముందు మేలు కాంచి యింటి పనులే
వేళా జేయుచునుండు ప్రాలుమాలిక యింతలేదు. —ఎంతో
ఆకలికి యోర్చియుండును మాకంటె ముందు
వేకువాను మేలుకాంచును

ప్రాతాటముగ బికిరమెత్తి యేకాంతంబుగాను స్వయం
పాక మొనరించి యదియె పరమా
మృతంబని యారగించు —ఎంతో

విరతి జెందియుండు నెపుడు తనవారి జూడ పురము
చెంతకైన బోవదు,
కరమూలు ముకుళించి యేమి, పనిగావింతు ననుచుండు నీ
పరదేశిని సాకకున్న పట్ల మా కపచార మౌను —ఎంతో

రా౩. దేవదేవితో—దరువు - జంపెతాళం - రీతిగౌళ రాగం

సరసీజనేత్రి! నీకేలా విచారామె ధాత్రి!
పెరుమాళ్లు దినము పళ్లెరము ప్రసాదాము
కరుణించు నదినీకు గ్రక్కున నొసగెద! —సర

అక్షీణమూగ తనసేవ జేయగ భాసురముగ
పక్షివాహనుండు రక్షించుచుండగ
భిక్షమెత్తి నీవు భక్షింప నేటికి —సర

తెలుగొప్పగాను బికిరంబు యీ వరనుంచి మాను
కరియ మాధుపుళి తిరుకణా మధు నెయ్యి
తిరుపణ్యారములు తెచ్చియిచ్చెద నీకు —సర

రా౪. దేవ - చెలువ - ఆదితాళం - హంసధ్వని రాగం

దయవచ్చెనా! నాపదళాలు ప్రియ మిచ్చెనా!
దయవచ్చెనా నేడు దాసురాలి మీద,
భయభక్తితో సేవ బహు విధముల జేయ —దయ

వ్రతమాయెనా! నేటికి సమ్మత మాయెనా!
సతతాము నీపాద జలజాత యుగము నా
మతిలోపలను సన్నుతి సేయు చుండగ —దయ

అరపోయెనా ! నీచిత్తము, స్థిరమాయెనా !
పరగ శ్రీమామిళ్ల పలి నారసింహులని
స్మరియించి మీవద్ది కరుగు దెంచిన మీకు —దయ

మాత్ర-ద్వి. 33 అనిశంబు నీరీతి నా భూసురుండు
ఘనవేణిపై ప్రేమ ఘనముగా గల్గి
వలపి నప్పుడు వడపప్పు పానకము
కల వంటకంబు పొంగలియు పచ్చళ్ల
మొదలైన వడ్డన మూడు పూటలను
ముదముతో మెసవి తా ముఖ్యలౌ సాధు
జనముల యిండ్లకు జని మాధుకరము
కొనితెచ్చి భుజియించి కొమరొప్పు చుండ
అంత నక్కాంత నయ్యెడను ప్రౌఢోక్క
వింత వింతగ క్రొత్త వేషంబు పూని
ధరణి పుష్పాస్త్రు భూతంబో యనంగ
చరియించు చించుక సందుగానమికి
రహిని తదేక పరాయణ స్థితిని
సహరహంబును సుషిరాన్వేషణంబు
గావించుచును సోయగంబున హావ
భావముల్ కొంత నేర్పడ తిన్నగాను
కులుకు గుబ్బల పైటకొంగు జారగను
తొలగించు నొకవేళ తొకతొక ముద్దు
గులుకంగ వినివిన కుండంగ తేనె
జిలుకంగ బలుకును చిత్తముప్పొంగ
జగతీ రుహంబులు సంచలించి యును
చిగురింప గానంబు సేయుచు నుండు
తగనిట్ల యస్ఖలిత బ్రహ్మచారి
యగు వైష్ణవుని మ్రోల నలరుచు నుండ

తరుణి విలాస కుద్దాలంబు చేత
ధరియించి వర్ణ చిత్తక్షేత్ర మునను
మరుడు మోహవటంబు మరి పాదుజేసి
అరయంగ నాటిన నది వృద్ధినంది
చిలుకల కొల్కి జూచిన మానసంబు
చలనంబు నొందె నా సమయంబు నందు 15

సీ. హల్లక పాణి ధమ్మిల్లంబు గాంచి శ్రీ
కృష్ణ నామంబు కీర్తించ మరచె
శుకవాణి నడుము తప్పక జూచి శ్రీహరి
ధ్యానంబు మదిలోన దలచ మరచె
వనజాక్షి నెమ్మోము గనుగొని హాటకాం
బర యని యొకసారి బలుక మరచె
చిలుకలకొల్కి పల్కుల సొంపువిని మధు
సూదనా యని పల్కుచుండ మరచె.

తే. తరుణి పాలిండ్లుగని చక్రధరుని మరచె
నాతి కన్నులుగని పద్మనాభు మరచె
మగువ నెమ్మోముగని విధుస్మరణ మరచె
తెలవ యానంబుగని కరివరదు మరచె।

*౨౫. దరువు – ఆదితాళం కాఫీరాగం*

కలకంఠి కెమ్మోవి గాంచియా వైష్ణవుడు
కలనైన తాజపము గావింప డాయెన్
అతివ వీనులు తన మతిలోన దలపోసి
సతతంబు శృతులను చదువక పోయెన్
సారసపాణి లోచనముల గనుగొని
తారక మంత్రంబు దలచక పోయెన్

సీ. పువ్వులు గోయుచో పొలతి మోవిదలంచి
పల్లవంబులు చేతబట్టి త్రెంచు
చిగురాకులేల దెంచితినని యాచెలి
రదనాలినెంచి కోరకము దునుము
కోరకంబేలకో గోసితి ననిదాని
పలుకులు దలచి తేనెలను వదుపు
పూదేనె వ్యర్థమై పోయెనంచును దాని
పాలిండ్లు దలచుక పండ్లుగోయు

తే. అవనిసురుడీ విధంబున నలవిగాని
మోహవిభ్రాంతి తనమనంబున జనింప
ఒకటి సేయంగ బోయి తా నొకటి సేయు

ద్విప - 34. మరియు నీరీతి నా మౌని వరుండు
తరుణిని దలపోసి దన చిత్తమందు
కలకంఠకంఠి చెంగట లేకయున్న
అలవి గానట్టి మోహంబు జనింప
ఇంత సేపెచ్చోటి కేగెనో గాని
యింతి రాదయ్యె నిదేమొ స్నానంబు
సలుపంగ నొంటిగా జనియె నటంచు
పలుకుచు త్రోవలోపల నెదురైన
పొడగని నీ వెందు బోవద్దు విన్ను
గడియ జూడక నుండగాలేను నీకు
యేమి గావలసిన యే నొనరింతు
కామిత వస్తువుల్ కడమ గాకుండ
నని వచియింపుచు నఖిల కార్యములు
ఘనమైన ప్రేమతో గావింపు చుండు
తలిరాకు బోడి చెంతకు వచ్చినపుడు
కలికి నెమ్మేను నెగాదిగ జూచు
కలుకు గుబ్బలమీది కొంగు సోకినను
పులకాంకు రంబులు బొడుము నెమ్మేన.

వ. ఈ విధంబున నవ్వైష్ణవోత్తముండు తదీయ మోహంబున తపియించుచు,

ద్వి - 35. వెలది నెమ్మోము నేవేళ జూచితినొ
కలలోన నైనను కాంతల గూడి
చెలిమి యెఱుంగని చిత్తంబు లోన
తలచిన యంత మాత్రముననే గుండె
ఎవరి తోడుత వచియింపగా రాదు
అవిరళంబైన మోహాంబుధి గడవ
తరముః గాకున్నది దీని చిత్తంబు
తెఱగెట్టిదో గాని తెలియగ రాదు
సకల భోగముల వాంఛలులేక యున్న
సకియతో నావాంఛ నలుపు మటంచు
ఏరీతి బల్కుదు? యిట్లు బల్కినను
గౌరవం బెటులుండగా నేర్చునైన
కాని యటంచు సంకల్పంబు జేసి
మానక నేనొక్క మాట బల్కినను
సమ్మతి పడియెనా! వరిపోయె, లేక
సమ్మతించక యున్న జగతిలో నిదియు
విన్నను పిన్నలు పెద్దలు నన్ను
మన్నింతురే యవి మరికొంత సేపు
చింతించి యేరీతిచే నైనగాని
కాంత తోడుత రతికాంతుని కేళి 10
గలియక యున్న నేగతి తరియింతు
చలమేది దైవమా! సైపుదు నెట్లు? 11

వ - అని విప్రనారాయణుండిటుల విరహంబుచే వేగుచుండునంత వర్షా కాలం బేతెంచుటయు.

సీ. చాతక పోతక జాతి కౌతుక మంద
దావ హుతాశను దర్పమడగ

హలికులకును మనోహ్లాదంబు సంధిల్ల
ధరణీ జములకు సంతాప మడగ
నీలకంఠంబులు నృత్యంబు లాడంగ
నంభో చరంబులు హర్షమంద
ధళధళ మంచు సౌదామినుల్ మెరవంగ
రొంపులు జొంపమై పెంపుజెంద.

తే. జలద కాలంబు వచ్చె నా సమయ మునను
కుండలను బోసినటుల వేదండ తుండ
ములకరణి భోగిరాడ్భోగముల విధమున
తటుచుగా వర్షధారలు గురియు చుండె। రారా

వ - ఆ సమయంబున నరుణోదయంబు మొదలుకొని యహోరాత్రంబులు
జడి గురియుచుండ నర్ధరాత్రంబున నప్పైష్ణవుని తిరుమాళిగ పంచన తీనెమీద
నొదిగి వడవడ వడంకుచున్న దాసురాలిం గాంచి నీ సమయంబున వాన నెపంబున
లోపలికిం బిలుచుక తన మనోరథంబు దీర్చుకోవలెనని యూహించి నది సమ్మతిం
చక యుండిన బలాత్కారంబున గలయవలయు నందు దోషంబని సంశయించి,
అయినను పరకాంతగాదు, చెంతకు బిలిచి యుపాయంబున కోరిక దీర్చుకోవలెనని
దలంచి -

విప్ర-(దేవదేవితో-)

రా. చెంచుకు - జంపెతాళం - జై జవంతీ రాగం

మానినీ మణి లేవే! తిరుమాళిగ లోనికిపుడు రావే!
మానాక నిపుడు వానగురియుచు నుండ తీనెమీద
నిల్చి నావాగ నేటికి —మా

దేవ. స్వామీ! గురునాయకా! సత్యవాక్య
చాతుర్య సంధాయకా!

ఏమో నామనసు జూతామాని యంటిరో
ఏ మర్యాదాలమె మీయింటి లోనికిరాను —స్వామీ

విప్ర. వెలదిరో! ఈవేళ నామాటాలు వినవే జాగేలా!
చలిగాలికి వణుకు సహించ రాదాని
పిలిచీతి వాకిలి తలుపుదీసుక రమ్మా —మానినీ

దేవ. ఏను వచ్చినది మొదలుగాను ఇట్టిమాటలు వినను
ఏ నిమిత్తముగ నిపుడీ విధముగ-ఆనతిచ్చితిగో
కాని తెలియాదు —స్వామీ

## కందార్థాలు

విప్ర. రాజ. చెలువొందగ పదివార్వ
న్నెల బంగారంబునకను నెరసున్నాదే
తలచగ నీకును కొదవం
గలవే పరికించి చూడ-కలకంఠవాణి
పంకజపాణీ, కంధార వేణీ!

వలనొప్ప చల్లాకు వచ్చి మంతిదాచ
ఫలమేమి యికనీకు తెలియ జెప్పెదనిను. —కలకంఠవాణీ!

రా. మనసిజ గురు కైంకర్యము
ననువొప్పగ సలుపవలసినంచి గాడన్
అనుమాన మొంద కుండగ
ఘనముగ మన మిచ్చగించె-కలికీ యీవేళా!
నాకోరిక తెలిసేనే బాలా!
కులుకు కుచముల యెద గ్రుచ్చి కౌగిటజేర్చి
వలరాజు కేళి సొంపలరాగ గూడవె! —కలికీ!

దేవ. రా. తిరుమంత్రము కొరకై మీ
తిరువడిఘలు గాంచినపుడె దేహ ధనంబుల్
పరికింపగ మీసొమ్మై
అరయగ సంశయము లేదు హరిభక్తి సాంద్రా!
అయినాగాని గురుకుల చంద్రా!

విరివిగ నాదొక్క విన్నాప మున్నాది
స్థిర మానసంబున చిత్తగింప వయ్యా - గురుకుల చంద్రా!

కం. ధరణీ సురుడవు వటుడవు
వరతత్వ జ్ఞాననిధివి వైష్ణవుడవు ని
ద్ధరణి విరక్తుడవని నా
గురువుగ భావించి వచ్చి—కొలిచితి నయ్యా
ఈ నడతాలు తెలియా లేనయ్యా:

ఇలను మీవంటి పెద్దలు పామరుల వోలె
పలుకరనుచు మదిదలమాక నిన్నే —కొలిచితి నయ్యా

సీ. స్నానమే యవని జాతముల పాలయ్యె సం
ధ్యావందనంబె గుహాళి జొచ్చె
మంత్ర తంత్రంబులే మడుగులో గలసెను
సత్కర్మ మెచట సమసి పోయె
స్వాధ్యాయ పఠనమే సందున జణిగెను
దివ్య ప్రబంధమే తెఱువు బట్టె
గాయత్రి జపమదే కంతలై పోయెను
శీలమే గొందని జెందెనయ్యె

తే. అకట యిటువంటి ధర్మంబు లన్ని విడిచి
ఇది మహా నీచమనుచు మీ హృదయముననం

నించుకై నను మది సంశయింప కిట్లు
పలుక నీ నాలుకెట్లాడె భద్రశీల ! ౮౯

౯౧. చెణుకు - ఏకతాళం - కమాన్ రాగం

ఏనంచేను కోపమా ! ఇపుడింత పాపమా !
నీచాపు పనులు మీ రిచ్ఛయించగ వద్దని —ఏనంటె
ఈ మాటలు దెత్తురా ! ఎవ్వరైన మెత్తురా
ప్వాములు మీకింత పామరాము గూడదాని —ఏనంటె
జగతి వారాలందారు నగుబాటాయె నందురు
తగవుదప్పి నడువా మీకు ధర్మాము గా నేరదాని —ఏనంటె

ద్విప - ౩౬. పరకాంత తోడ సంబంధంబు సలుప
దురితంబు జెందు నందురు శూద్రజాతి
తరుణిని దేవరదాసినిం మీరు
నిరుపమ వైరాగ్య నియతి చరించు
కనకంబు పెంచు నొక్క విధంబుగాను
కనుగొను వారు సాక్షాద్విష్ణు సములు
పగవారు సఖులేరు పరుపగా నొక్క
పగిది మానసమున భావించు వారు
పరగ పంచేంద్రియ భ్రాంతియు లేక
చరియించు చుండు వైష్ణవ ముఖ్యులేను
నపవిత్రురాల మహా నీచురాల
కపటాత్మురాలిని కలుషాత్మ రాల
ఇటువంటి దాని మిమ్మెట్లు స్పృశింతు
నటునిటు గదలిన యంత లోపలను
కరచరణాదు లంగము సోకినాను

అరయంగ శ్రీవైష్ణవాప చారంబు
ఘటియించుగాన మూర్ఖత వద్దు వద్దు
కటకటా నేనెంత గామన్వి జేసి
పలికిన నిప్పుడీ పనికాళ వడగ
వలదు; మహాత్ముల్ లీపని చిత్తమునను 10
తలచిన యంత వ్రాతమున పాపంబు
వలదని మానిరి గావున దీని
చాల నీ మదిలో విచారించు కొమ్ము
ప్రాలుమాలికే నింద పాలౌదు వైన
చేసిన వారలు చేసిన యంత
బోసేతు రనుమాట పుడమి లోపలను
తప్పదు నీకును తాదాకి చప్పు 
అప్పటికైన నీవనుకొనే వయ్య  14

విప్ర-సీ. వార కామినులకు వశ్యుడై తిరుగడే 
ఘనుడు ఋష్యశృంగ మునివరుండు
దాశరాజాత్మ నందనతో పరాశరుం 
డుండడే సురత కేళి యొందు లేక
గాధేయముని మేనక జూచి తపమును
చాలించి కూడడే సౌఖ్యముగను
మందకర్ణి నిలింప సుందరి తోడుత
మరుకేళి సలుపడే మమత తోడ

తే. కాన నటువంటి వారలే కాంతలకును
వశముగా నుండ మావంటి వారలేమి
నాతి పదిలోన పదకొండనంగ వినవె ?

దేవ. అయిన గానిమ్ము నిక సంశయంబు లేల !

౯౨. వెణుక - ఆటతాళం - అఠాణా రాగం

సెలవీయ వయ్యా-గంధము మేన, నలదు కోవయ్యా
సెలవీయ వయ్యా నిచిత్ర మెట్లున్నాదో
తలచి యాపని నాతో దాచాక నీవేళ —సెలవీయ

మాలిమితోను వేషమీర మమత లూరగను
మేలిమి కర్పూర తాంబూల మిత్తునో లేక
పూలదండలు జట్టి పూజ చేయుదునో ! —సెలవీయ

స్వామి ! ఈవేళ నాతో డుత సంశయ మేలా
ఏమి సేవజేతు నేనేమి భాషింతు
ఏమి గావించెతూ . ఏతీరు లాలింతు —సెలవీయ

సూత్ర-ద్వి. 37 ఆరయ నుద్యాన వనాంత రంబునను
తిరుమాళిగను ధరాదేవుని కడకు
జని దేవదేవి యుత్సాహంబు తనదు
మనమున పెంపొంద మల్లెపువ్వులను
పాను పొనర్చియు పవళింప జేసి
తా నందు వసియించి తానకంబులను
సరిగమ పదనిస స్వర యుక్తముగను
కరమొప్ప తాళ సంగతుల గానంబు
సలిపి విప్రుని మానసము గరగించి
కళలుప్పతిల్లగా గంభీర ముగను
అలరు విల్కాని రహస్య మంత్రములు
తెలియంగ నష్టదుప దేశం బొసంగి
చక్కెర కెమ్మోవి చవిజూపి మెరుగు
చెక్కులు పలుమొనచేత చుంబించి
దశవిధ చుంబన స్థానముల్ నుడివి
తుళలంజవం దెలిపి కొమ్మా యటంచు

పలుకుచు కులుకుగుబ్బలు రొమ్మునాట
పుల కాంకురంబులు ముట్టుచుండగను
పరిరంభణ మొనర్చి బలువింత గాను
సరస రతులచేత చౌశీతి గతుల
హావ భావంబుల నలర మెప్పించి
భావజు కేళిలోపల విహరించె.

విప్ర-సీ. ఈకాంత తోడుత నేకాంతమున రతి
కేళిదేలిన సౌఖ్య లీలలహాహా
నెంతని యూహింతు నేరీతి భావింతు
నేమని వచియింతు నిదిగణింప
అంతరంగంబున కానంద దాయకం
బై యొప్పు చున్నది నధికముగను
భావ గర్భితముగా బలుకుచు నున్నట్టి
పలుకులు నమృతంబు లొలుకు చుండు

తే. గాన జన్మార్జిత ఫలంబు కలస నిట్టి
మానవతి లభియించెను దీనిమీద
చాల మోహంబు జనియించె నరభ సముగ
నొక్క గడియైన చెలిబాసి యుండరాదు 80

౮౧. చెణుకు - అటతాళం - ఆనందభైరవి రాగం

గురుని ఎంతని సన్నుతింతునే, వారి కరుణ
ఏమని భావింతునే!
వరదూడై మామిళ్లపలి శౌరి కథలెల్ల
పరమానురాగ సంభరితుడై పలుకూను —గురు
మంతానమున జేర బిల్చునే-నన్ను
వింతవింతగ నాద రించునే

అంతరంగము నందు నింతింత యనరాని
అంతఃకరణ గలిగి సంతానమున నుండు —గురు

చాలాగ లాలించు చుండునే సిగను
పూలదండలు జుట్టు చుండునే
వాలాయముగ నేను వద్ద లేకున్న వి
రాళిచేత జాలిమాలి బొందియుండు —గురుని

తిలకాము నుదుటాను దిద్దునే-గంధ
కలపాము నెమ్మేన బూయునే
కలలోన నైన నా పలుకూలకును మారు
పలుకకుండు నన్ను దలమాచు నుండు —గురుని

కా. చెంచు - ఆటతాళం - భైరవి రాగం

ఎంత నన్నుతి జేతునమ్మ! గురుని, అంతరంగ మెంత
సులభ మమ్మ!

చెంతాకు రమ్మని పిలిచి, కంతుగురు మర్మమే
కాంతామున బల్కె గదవమ్మ! —ఎంత

సతతాము మతిలోపలను, ఇతర వాంఛమాని భాగ
వతుల సేవజేయు మనెనమ్మ —ఎంత

ఎల్లపుడు మామిళ్ళపల్లి నారసింహ దేవు
నుల్లమూన దలచు మానెనమ్మ —ఎంత

సీ. ఆచార్య వర్యుని యంతఃకరణ మది
యెంతని నే వచియింతు నమ్మ
చల్లని నీటిలో స్నానంబొ నర్చిన
చలిదాకు ననియుష్ణ జలము చేత

శని వాసరంబున సౌమ్య వాసరమున
సభ్యంజనము జేయు మరచు వేడ్క
సంపెంగ నూనియ జంబీర ఫలములు
మెచ్చైన సీకాయ దెచ్చియిచ్చు.

తే. చలువ వలువలు నంపించు సంతతంబు
నిలువు టద్దంబు చెంగట నిలుపు చుండు
తిలక మలిక స్థలంబున దిద్దుచుండు
రంగని ప్రసాద మెప్పుడొసంగు చుండు

వ. మరియును

సీ. సుదతుల కన్నెత్తి జూడని వాడు నా
కను సన్నల జరించు ననవరతము
సతత మష్టాక్షరీ జపము సల్పెడివాడు
పీనుల మణితంబు వినగగోరు
కమలాక్షు నర్చించ గాంక్షించు వాడు నా
గాత్రమెగాదిగ గాంచుచుండు
బ్రహ్మచర్య స్ఫుట వ్రతనిష్ఠు డగువాడు
వారకాంతకు నాకు జారుడయ్యె

తే. సంశయంబేల నా ప్రతిజ్ఞయును జెల్లె
నింక నీతనితోడ నాయింటి కరుగ
తగు యటంచు మనంబున దలచు చుండు
నడిగెదనుగాక భూసురు నాజ్ఞకొఱకు.

(విప్రనారాయణునితో)

ద్విప - ౭౩. ధరణీ సురేంద్ర! మీ దగ్గర నేను
పరిచర్య లొనరింప వచ్చి యిచ్చటను

నిలిచి యున్నదివిని నేడు మాయమ్మ
అలరగా ముప్పది యామడ కంచి
పురము నుంచియు నన్ను పోలించి చూడ
నరుదెంచి యీ యూరియందు మాయప్ప
యింటిలోపల నివసించిన దనుచు
వింటి నేనటుగాన వేడ్క నచ్చటికి
పోయి వచ్చెదను యీ ప్రొద్దుండి రేపు
పాయక నీతిరు వడిఘల సేవ
సలుపగా వత్తు సంశయ మించుకైన
తలచక సెలవిమ్మ దయయుంచి స్వామి!

౯౫. సరివాదం - చెణుకు - జంపెతాళం - శ్యామరాగం

దేవ. జగతీ సురేంద్ర! మా జనని వద్దికి బోయి
మగిడి వచ్చెదనయ్య.

విప్ర. మగువ! చక్రవాకి ఖగమెడ బాసిన
పగిది యయ్యెగదవె!

దేవ. అనుమానమేల చయ్యన నేను వచ్చెద
మనసూన నరయుంచకు.

విప్ర. ఘనవేణి! కొలను బాసిన హంస విధమున
గన పట్టు చుండుగదే!

దేవ. తెలిపెద! యిపైపోక తీరని పయనము సెలవిమ్మ నాస్వామి!

విప్ర. జలజాక్షి! కనక పంజర మెడబాసిన చిలుక చందమాయెనే!

దేవ. చిన్నబోయుండాకు చెక్కిట చెయిజేర్చి
చింతసేయ బోకుమీ

విప్ర. వెన్నెలలేని రేవిధమాయెగా నింక నిన్ని మాటలేలానే!

దేవ. మోమువంచకు మొక్క యామిని మాత్రము
పామూర ముంచాకుమీ

విప్ర. మామిళ్లపలి హారిని మదినెంచి నీవెంట
ప్రేమ తోడుత వత్తునే!

౯౬. విప్ర - చెణుకు - రూపకతాళం - భీంప్లాస్ రాగం

లలనా! తాళగలరా! జలజాక్షి నీవు జనని దగ్గరికేగ
వలెనన్న గుండెలో జలుజల్లు జలుమానె!

నినుజూసి యుండిన నిముషాను యుగమయ్యె
కనిపించు నీకు కరుణ లేదాయెను —లలనా

కలలోన నైన చెలిమి బాయనినీ
తలపూన నిట్టి చందం బేల జనియించె —లలనా

తే. నీవు దగ్గర లేకున్న నిమిషమైన
నొంటిగా నుండజాల నీవెంట నేను
వచ్చెదను వేగ బోయి నీ వారిజూచి
తిరిగి వత్తము నిదిసమ్మతింప గదవె! ౯౬

దేవ-ద్వి-౩౨. దేవర వారికే తెలుగున నిపుడు
నే విన్నపముసేతు నిక్కువ ముగను
దయచేసి మీరలు తరలి వచ్చినను
ప్రియము తోడుత పనివినియెదు గాని
దలనొప్పి మీతిరువళ్ళ మెట్లుందో
తెలియదు గాన నీ తీరున నేను
వనువుగా బల్కిన నపచార మొదవు

నని బల్కకుండితి నవని లోపలను
ఇంతకంటెను భాగ్యమే మున్నదింక
చింత సేయకను వేంచేయుడీ వేళ !

విప్ర.సీ. తోటలో చెట్ల సందున నొక్కచోట కు
ద్దాలంబు నెంతయు దాచిపెట్టి
పదిలంబుగా నల్కపారయు నొక్కచో
కనిపించ రాకుండగా నొనర్చి
మక్కువతో తిరుమాళిగ వాకిలి
తాళంబు వైచి మోదంబు గాను
వలుగడి వేసియు వెలుపల చుట్టును
వెలుగు నాటించియు నేడ్క తోడ

తే. తిరుపగూడ ధరించి సందియము మాని
నేను నీ వెంట వచ్చెద నిశ్చయముగ
నచట తడవుగ నుండక నతిరయమున
తిరిగి వత్తము పదవె యో సరసిజాక్షి !

సూత్ర-ద్వి.40. శ్రీవైష్ణవుని నిరీక్షించిన యంత
భావింప తిరుమణి పట్టెలు దుడుతు
రను భయంబించుక యైనను లేక
ఘనమైన స్మార్తులు గాంచిన యపుడు
కరమొప్ప వీరి మార్గము గంటిమంచు
పరిహాస మొనరించి పరిపరి గతుల
పలుచన సేతురన్ భావంబు లేక
తలపోయగాను బాంధవులు జూచినను
నరయ నపాంక్తేయుడని మందిరంబు
చొర నివ్వరని పల్కు చుందురన్ పిగ్గు
మనసున లేకను మానవేంద్రులును

గవినంతటనె నమస్కారంబు జేయ
రను నభిమాన మింతైనను లేక
జనులు దర్శించిన క్షణమందు చాల
చులకనగా జూతురని దలంపకను
సలలితంబుగ బ్రహ్మచర్య వ్రతంబు
ధరణిలోపల జన్నిదముపాలు జేసి
తిరుగుచు నుండగా నా పట్టణంబు
వారందరును గని వారిజాతాక్షి
నేరు పేమనుచు వర్ణింపగా వచ్చు
అవని జితేంద్రియుండై వాంఛలుడిగి
అవిరళంబుగ హరి ధ్యానంబొనర్చు
శ్రీవైష్ణవోత్తమ శ్రేష్ఠుని యట్లు
భావంబు గరగించి పరవశు జేసి
వలవేసి పులుగును బట్టినరీతి
చలమొప్పగా బోను సవరించి యందు
పులిజడ వైచిన పోల్కి గాలంబు
జలముల వైచియు చేపలబట్టు
కరణి యోదముబన్ని గజమును బట్టు
తెఱగున నాక్షితి దేవలలాము
విటశిఖామణి జేసి వెంటదోకొనుచు
తటుకున తననికాంతము నకునేగె।
కావున వీరిని గనుగొన్న వారు
భావజు శరముల పాలయి వారి
పంచల గాచుక ప్రార్థించుచుందు
రెంచి చూచిన యిది యిలలోన నిజము
అని పల్కుచుండగా నది యాలకించి
విని విననట్లు గావించి వేగమున
మానక నెవ్వరేమని పల్కినాను
దాని వెనుకజనె తాపసోత్తముడు.

కం॥ ఈ రీతిని వావిప్రుడు
జారుండై యపుడు బ్రహ్మచర్య ముడిగి యా
పారంగనయన వెంబడి
శ్రీరంగ పురీవరంబు జేరగ నరిగెన్ ౯౬

వ. అట్లుజేరి తద్గృహంబు ప్రవేశించిన తదనంతరంబు

సీ. పంచ వన్నెలచట్టు పలుకెంపు రాచాయ
సొంపగుచుండు చుంచువులు గలిగి
చిలుకలకోళ్లు రంజిలు పైడి పట్టెలు
తలగడ బిళ్ళ లందముగ గల్గి
తగ హంసతూలికా తల్పము చౌశీతి
బంధము ల్గల్గిన ప్రతిమ లమర
చిత్తరువున లిఖించిన రాసకేళీ వి
నోదముల్గల్గి యా మోదముగను

తే. మేలి ముత్యాలు గూర్చిన మేలికట్లు
గల్గియును విటరంజన కరముగాగ
నుల్లసిల్లుచు నుండు పయోజనేత్రి
పడకటిలు గాంచె నప్పుడా బ్రాహ్మణుండు ౯౭

ద్విప - 41. ఘుగఘుగ వాసించు పునుగు జవ్వాజి
మృగమద కర్పూర మిళితంబులైన
భరణులు మరి గంధపొడి పెట్టియలును
కరమొప్ప పైడిబాగాలు నేలకులు
అలరంగ జాజికాయలు లవంగములు
పొలుపొంద జాపత్రి పూలమాలికలు
వలనొప్పగా నాగవల్లీ దళములు
తలపోయగాను ముత్యాల సున్నంబు
పులిజున్ను పాలును మొదలైన వస్తు
వులు గల్గియును పల్లవుల చిత్తములకు

పరమ రంజకమయి భాసిల్లు చున్న
తరుణి కేళీ విశ్రాంతంబు వీక్షించి
ఔర! ఈ వైభవం బౌర! యీ వింత
ఔర! ఈ పింగార మౌర! యీ భోగ
మేలోకమున నైన నెన్నంగ గలదె
పోలించి చూచిన పూర్వ జన్మముస
నలిపిన తపము నిశ్చయముగా నేడు
ఫలియించె నంచు సంభ్రమమును జెంది

వ. ఆ సమయంబున నా బ్రాహ్మణుండు తన మనంబున నిట్లని వితర్కించె.

౯౨. విప్ర - దరువు-అటతాళం-హంసధ్వని రాగం

ఎడబాయ నా చెలికోడు నెడబాయ

భూమి సురోత్తము లేమానుకొని, స్వాములెందరు విన్నగాని,
కన్నవారు మేరగాదనుకొని, పిన్న పెద్దలు గన్నగాని —ఎడ

జపమూలు తపమూలు సాగాకపోని, చపలూడ వనియన్న
గాని —ఎడ

దేవ - (మధుర వాణితో)

౯౩. వెణుకు - అటతాళం కళ్యాణి రాగం.

కామినీ! కాంచితివే హంసగామినీ!
చెలగూచు నితని దెచ్చితిని యిప్పట్లా! —కామినీ

ఇటువంటి వారిని ఏలాగు నమ్మె
కుటిల కుంతల వాని గుణము లేమమ్మ! —కామినీ

భావింప నిదియెంత పని ముద్దుగుమ్మ
దేవుడంటివి నేడు తెలిసెగదమ్మ. —కామినీ

మధు - తేట. దేవదేవి నీ ప్రతిజ్ఞ నేటికి జెల్లె
నెంత ప్రోఢవంచు నెంతు నిన్ను
మేలుమేలు నేను మెచ్చితి నీ తోడ
పలికి నట్లు నడతు ప్రాకటముగ ౯౦

# వేశ్యమాత వేషం

సూత్ర-ద్వి 42. పలితమై యున్నట్టి పడతి కొప్పువను
తొలినాడు తనకూతు తురుమున నిడిన
విరులదండ ధరించి విడియంపు తొక్కు
నరయగా పుక్కిటియందున నుంచి
పళ్ళులేరు పడినట్టి వదనంబు నందు
వలనొప్పగా పచ్చి పసుపును నూనె
మేళవించియు చాల మెరుగును బెట్టి
ఫాలంబు నందు నేర్పడగ చెందిరపు
బొట్టుబెట్టి ముముకపుట్ట మావేళ
గట్టి పయ్యెద క్రిందుగా నాభి దమక
జారుచునుండు కుచంబుల గదిత
మా రవికయు దొడ్డి యయిదుగా నరుత
పరగ నెక్కలిదేవి పాదాలు గట్టి
తరముగా మద్యంబు ద్రావుట వలన
పరిమళ మఖిల దిగ్భరితమా చుండ
పురజనంబులు దాని పోలించి చూడ
తిరముగా తనకూతు తీరుగాంచంగ
సరభ సంబునను వేశ్యామాత వచ్చె. 8

తెరలో —

శ్రీ మామిళ్ళపురీ నిశాంతుడగు — పునరావృత్తి

౯౯. తెరవెళ్ళే దరువు - ఏకతాళి కల్యాణిరాగం.

సారానాతి వచ్చె నపుడు, ఓయమ్మలారా! —సారా

సారానాతి వచ్చె పౌరా జనము లెల్ల దాని
పారా జూచి కేరడము లాడుచు నుండ —సారా

భూతలంబున నది జామాతాల పాలిటి పెద్ద
భూతా మో యనుచు వారు భీతి చేత జూచుచుండ —సారా

గ్రావ సన్నిభమైనట్టి భావంబు గలదాని, దాని
భావజ్ఞు లెన్నుచుండ దేవదేవి మాతయైన —సారా

వేశ్య - వ. బిడ్డా! దేవదేవీ! ఎక్కడు న్నావే.

దేవ - వ, ఇదుగో! వచ్చితి నమ్మా!

వే - (దేవదేవితో)

ద్వి - 43. ధరణి లోపల శరత్కాల మేతెంచె
పరగ లక్ష్మీదేవి పండుగ వచ్చె
ఈ సమయాన వేశ్యాజాతి కెల్ల
భాసురంబుగ విటుల్ బహు విధంబులను
తమ యిండ్ల నుండిన ధనమెల్ల దెచ్చి
క్రమముగా నిచ్చి నెక్కడలేక యున్న
మ్రుచ్చిలి యైన సొమ్ముల నమ్మియైన
అచ్చనతో దెచ్చియైన రత్నములు
వరహాలు సొమ్ములు పట్టుపుట్టములు

పరిమళ ద్రవ్యముల్ వలయు వస్తువులు
చరణా యుధములు మేషము లాదిగాను
నిరత మర్పింప నన్నియు జూడలేదె
తెలగొప్పగా నీకు దెలియదే యిపుడు
పరిపరి విధముల బలుకఁగా నేల ?

సీ. గొంటు పోకైనను కొమ్మని యీయడు
ఈతనితోడ పొందేల నమ్మ
పరదేశి తోడ బాపనితోడ రేబగ
లిట్లుండ సంసార మెట్లు నడచు
చీరలు సొమ్ములే తీరున వచ్చును
పండుగ పబ్బమే పగిది నడుచు
వెచ్చ సచ్చమ్ములే విధమున సమకూరు
నఖిల వస్తువులెట్టు లబ్బు మనకు

తే. తోడి వారల జూడలేదో తలంప
వయసు ప్రాయాన నీరీతి వారకాంత
లెచటనైనను తగనుందురే ధరిత్రి
పదుగు రిదివిన కన నగుబాటు గాదే! ౯౯

౧౦౦. చెణుకు - అటతాళం-యమునాకల్యాణి రాగం

బాలికా! మాలిమి లేక యేల నీలాలకా!
కాసు వీసములేని దాసారి పొందు
వేసారకా విడువ వేమాని యందు —బాలి

వట్టి మాటలు గట్టు మనుమీ
గట్టిగ సొమ్ములు బెట్టు మనుమీ —బాలి
గడన ప్రాయమెల్ల గడచిన దనుక, వాని
విడువకున్న నెవ్వ రడిగేరే వెనుక —బాలి

ద్విప - 44. బాలరో ; ఈబోడ బాపని తోడ
ఏలాగు నుంటివి యింత కాలంబు
వెలయాంధ్ర కెల్ల భావించి చూచినను
యిలలోపలను రొక్కమే కారణంబు
ధన మీయలేని నూతన మదుండైన
మనమేల వానితో మాటలాడగను
ఘనముగా నెంత చక్కని వానినైన
మనసున మెచ్చవు మగువరో నతని
పిల్లజుట్టును పెనువ్రేలెడు చెవులు
తెల్లగానుండు జందెంబును, బోడ
తలయును నూర్ధ్వపుండ్రంబును జూచి
వలచితివే యిటువంటి వారికని
వశమయి యుండిన వసుధలో సాటి
శశిముఖుల్ జూచి హాస్యము జేయుచుందు
రనుసిగ్గు నీ కించుకైనను లేని
పనికి నిన్నే మని పలుకుదు నేను
ఈబోడ దాసరి హితముల్లసిల్ల
ఈబిడ విటుడని యెన్నుచు నుండ
తలవంచు కొననాయె తలపోయ గాను
పొలుపొందగా సింగముల గుహాలోన
కరికుంభ లసిత ముక్తామణుల్ చాల
దొరుకుచు నుండును ధూర్తాలయముల
కర మొప్ప వత్స కీకసములు తోక
లరయగా లభియించు నటుగాన నీవు
మహాదాశ్రయము విడి మక్కువతోడ
అహరహం బిట్లు నీచాశ్రయంబనుచు

దలచక మరియు నీతనితోడ నీవు
గలిసి యుండిన నొక్క గవ్వైన రాదు. 14

౧౦౧. దేవ - దరువు - అటతాళం - మోహన రాగం

ఇలను నీతని మరులు కొలుపుదునని మున్న
పలికి యంటి అందు
వలన నీతనితోడ కలిసి యుండితినమ్మ కలువకంటి —ఇల
అప్ప యీతని దెచ్చేవా! యని నాతోడ జెప్పెనమ్మ, ఆ
చొప్పు దప్పక దెచ్చి చూపితమ్మ
ఈ మాట కొప్పవమ్మ —ఇల
చతురత తోడ నాప్రతిన యీడేరె సమ్మతిగా
జూడుము యికనీ
మతిలోపల మున్న మాడ్కిగా నోరింతు మతివనేడు —ఇల

వేశ్య-సీ. బాల నీదుప్రతిజ్ఞ ఫలియించె గదనేడు
ఇకవీని మొగమాట మేలనీకు
ముందుగా నీ చిత్తమున సమ్మతించిన
జాలును గానినా చతురతయును
జూడుము విటుల జోపెడు చోట నావిద్య
యటుగాన నిప్పుడీ వటుడనంగ
నేమి నాయార్భటి కిలలోన భూతాలు
పారిపోవుచు నుండు బహుళముగను

తే. గాన నేనడ్గి నట్లు సొమ్మైన గాని
యివ్వవలె లేకయున్న నిల్లైన వెడలి
యెవరి తోడుత జెప్పక నేగవలయు
అట్లు సేయక యున్న నాదేమి నేర్పు? ౧౦౦

వ. ఏదే ? వాడెక్కడ ?

ప్రతీ - వ. ఇదుగోనమ్మ ! యిక్కడ.

వేశ్య (విప్ర నారాయణునితో)

ద్వి - 45. ఓ బాపనయ్యా నీవుచితంబు దప్పి
మాబాలికకు నేమి మచ్చు జల్లితివో
ఏమి మంత్రంబులు యేమి తంత్రంబు
ఏమి మాయలు జన్ని యిటుజేసి నావు
ఏమందు బెడితివో యేమందునిన్ను
నామాట యొక్కటైనను వినదిపుడు
నిను జూడకుండిన నిముష మేడాయె
ననుచు జింతించు నిట్లని శంబునిన్నె
మరిగియున్నది నీవు మాకొక్క వీస
మరవీస మైన నియ్యావు నిట్టులున్న
కరమొప్ప ఋణపాతకంబని యనరె
ధరణిలో నినుగన్న తల్లి కెంచగను
ఆకలిగాదొ నీకాకలి లేదొ
తేకువతో నిది దెలియంగ రాదె
వేమాట లేలను విత్తంబు దెమ్మ
ఈమాటపైన మాయింటికి రమ్మ
కాకున్న నిప్పుడే కదలి పోవయ్యా
పోకయుండిన నిక బూతులు వచ్చు 8

విప్ర - ఆట. భ్రష్టురాలు మిగుల పాపాత్మురాలించు
కైన పిన్న పెద్ద గానకిట్లు
వదరు చుండు మనసు వచ్చినట్టుల నిది
వినగరాదు దీని కనగరాదు ౧౦౧

సూత్ర-సీ. అని ధరణీసురుం డంతరంగమున వి
చారించి వృద్ధపిశాచి యిపియ
రూకలు కోకలు పోకలా కులు నుర
గొత్తెలు ఘనమైన కుక్కుటములు
తెమ్మని యడుగనే తెలుగున దెచ్చిత్తు
ద్రవ్యంబులేవి దందరకు దెలియు
గావుననేను నిక్కడనుండ విహితంబు
గాదింక మెల్లన గదలవలయు

తే. ననుచు దలపోపి కంబళి మంసముసను
తిన్నగావైచి చంకను తిరుపగూడ
నుంచి యెవ్వరు జూతురో యంచుదాని
యిలు వెడలి తొంటి వనమునకేగి యతడు ౧౦౩

ద్వి - 46. తల్లి యీరీతివి ధనముపై నాశ
యుల్లంబు లోగల్గి యుచితంబు లేక
అనరాని నీ చోక్తు లాడిన నేను
వినగూడదని యిల్లు వెడలి వచ్చితివి
తెలియదు గాబోలు దేవదేవికివి
తెలిపి యుండినను నే తీరున నైన
నావెంట రాకుండు నా వచ్చినన్ను
సేవించ కుండునా శ్రీవైష్ణవులను
గలపి వర్తించిన కలహంస యాన
కలనైన వితరుల గాంక్షించ గలదె
పంచసంస్కార సంపన్ను రాలైన
కాంచనగాత్రి యేగతి నన్యజనుల
చెలిమి యాశించును చిత్తంబులోన
చెలువొంద నేను వచ్చిన వార్త వినిన
తరువాత చాల చింతాక్రాంత యగుచు
విరవొందగా తల్లి నీక్షించి మిగుల

నదలించి నన్ను రమ్మని బిఱ్ఱుమరల
సుదతి నంపించును పొమ్మనిపారె
పొలతి నంపించును పొమ్మని పారె
కిల నెదిరి చూచుచు విట బ్రాహ్మణుండు.

వ. తదనంతరంబున తనమనంబున నిట్లని యూహించె

విప్ర సీ. ఘనవేణి యధరంబు గనుగొన్న జాలదే
యరుణాచలంబున కరుగనేల
కలకంఠి నూగారు గాంచిన చాలదే
శేషాచలంబు వీక్షింపనేల
జలజాక్షి మధ్యంబు తిలకింప జాలదే
సింహాచలంబు దర్శింపనేల
సుందరీ గమనంబు జూచిన జాలదే
ఇభగిరి వరమున కేగనేల

కంబుకంధర నెమ్మోము గన్నచాలు
చంద్ర పుష్కరిణీ జలస్నాన మేల
కామినీమణి ఘనవేణి గనినజాలు
నీలగిరికిని జననేల బేలయగుచు ౧౦౬

సీ. కలికి నూగారానగా గల్గితెజాలు
శేషశాయికి నిత్య సేవజేతు
బాలిక పాలిండ్లు కీలనంటిన జాలు
విష్ణున కర్పింతు విరుల చెండ్లు
అతివతోడుత మాటలాడ గల్గినశౌరి
కెంచగా చక్కెర బంచిపెడుదు
కలకంఠ నిభవాణి కన్నుల జూచిన
రాజీవముల హరి పూజసేతు

జలజదళనేత్రి చెక్కులు సరభసమున
చూడగలిగిన చాలును సురుచిరముగ
ప్రేమ తోడుత శ్రీరంగ ధాముయెదుట
నిలువుటద్దంబు నిలుపుదు నెలమితోడ! ౧౦౪

౧౦౨. చెంచుతు - అటతాళం - తోడిరాగం

సరివారి లోపల చౌకగా నన్నేల మరులొంద జేసితి,
దైవమా! దైవమా! ఈ

తెరగూన నచ్చాట సరసిజాక్షి మనసు
కరుగజేయరాదె! —దైవమా

తలచిన యంతలోపలనె గుండెలోన ఝుఝుజల్లు
జలుమానె —దైవమా

నిలచిన చోటను నిమిషమైన నిలువ దలచవ
శముగాదు —దైవమా

ధనము యిత్తామన్న దగ్గరేమిలేదు నినునమ్మి
యుంటిని —దైవమా, ఏ

వనరూన నైన నీదినము రాతిరినను దానితో గూర్చవె
—దైవమా దైవమా!

సీ. ధనమూల మీజగంబని బల్కు చుండెడు
నీతి ప్రకారంబు నిజముగాదె
అందుమీదను వెలయాలికి వలసిన
ధనమీయ కుండిన తల్లి యేల
నిలు జొరనిచ్చు నన్నిన్ని దినంబుల
పర్యంత మెరుగక జరిగెగాని

తెలిసిన నైచునా తొల్లతటి తపమున
భాగ్యవంతుడనైన బహు విధముల

తే. నడిగినట్టుల పదియైదు నేబదైదు
నూరు నిన్నూ రొసెంగెడి వారగాక
వారకామిని బొందునే వాంఛదీర
దనర నిర్భాగ్య దామోదరుని దలంచ. ౧౦౫

౧౦౩. చెంచుకు - ఆదితాళం - మాల్కౌన్ రాగం

అంగాన నెడబాయ నలవిగా కున్నాది. లుంగమా!
లవంగమా!

శృంగారవతిని జూచిన తెల్పగదవె నారంగమా
మాతు లుంగమా!

బంగారుబొమ్మ తెలుంగున నుండు,కు, రంగమా
సారంగమా నా

చెంగాట నెప్పుడు సేవజేయుచు నుండు భృంగమా!
మా తంగమా

మచ్చిక నను బ్రోవ మామిళ్లపలి శౌరి వచ్చునో!
దాని దెచ్చునో నా

ముచ్చాట లచ్చట మచ్చెకంటికి మదిని జొచ్చునో, తమి
హెచ్చునో! —అం॥

౧౦౪. చెంచుకు - అటతాళం - మోహన రాగం

హరిహరి! సహకార పురిస్వామి నేమందు
పరమేష్ఠి యిపుడెంత పక్షపాత మాయెన్

తరువులన్నిట ఫలము లరుదూగ గల్పించి
చెఱకూన నేల సృజించక పోయెన్
పూలన్ని చెట్లకు మేలుగ గల్పించి
యేల చందనమున కెడజేసె నహాహా
జగతీజములతేనె సరవి నిండగజేసి
మొగిలి చెట్లకునేల తగజేయ డాయెన్
ఘనవిద్యలు గలవారికి ధనమీయక కేవల
జనులకెల్ల భాగ్యమెనయంగ జేసెన్
ధనముగల్గిన వారవనిత కొసగినే
ననుభవింతునో గాగ తనివిదీరగను
శ్రీమంతుగానన్ను జేయకను దారిద్ర్య
దామోదరుని జేయ తగవౌనె దెలియ.

౧౦౫. దరువు - ఏకతాళం - కాఫీరాగం

రంగనాయకా! కావేరి రంగనాయకా!

కస్తూరి రంగనాయకా! మన్నారు రంగనాయకా!
వారిజాత శ్రీవైకుంఠ వాసా! జాతరూపచేలా! రారా!
నన్నేలుకోరా!

వారధి గంభీరా! భక్తపారిజాత! మేరుధీర
రారాపు సేయకు రంగనాయకా! —శ్రీరంగనాయకా

గంగాధర వినుత! కనకాంగద రత్నభూషణా!
సంగరాంగణభీమ! —రంగనాయకా

అంగాజసన్నిభ మోహానాంగ! భవభంగ! సారంగ
పోషణ! దేవ! —రంగనాయకా

సరసిజాత వజ్ర మీన శంఖ చక్ర చిహ్నాలలిత
చరణయుగళ దేవ ! —రంగనాయకా

తరణికంటి పుటభేదన పరిపాలక ! శేషశయన వరద !
నరహరి రూపా ! —రంగనాయకా

# బ్రహ్మచారి వేషం

మాత్ర-ద్వి-47. శ్రీరంగధాము డాశ్రిత రక్షకుండు
కారుణ్యమున భక్త కామితార్థంబు
సమకూర్చుటకు బ్రహ్మచారి వేషంబు
నమరగా ధరియించె నది యెట్టులనిన
ఫాలప్రదేశంబు వక్షస్థలంబు
పోలంగ భుజమూలములు మొదలైన
పదిరెండు తావుల ప్రచురంబు గాను
వెదురాకు పోలిక వేడుకతోడ
తిరుమణి పట్టెలు దీరిచినడుమ
కరమరుదుగ హేమకాంతియు గలుగు
తిరుచూర్ణ రేఖలు దీర్చి శంఖంబు
సరిపోల్చ దగిన భాస్వత్కాంత మందు
జలజాక్ష మణిగణ సహితంబు లగుచు
తులసి పూసలపేర్లు తోడ్తోడ నుండ
సరభసంబున తెల్ల జన్నిదమొకటి
ఇరవున శోభిల్లు చుండగ క్రొత్త
పవపుగోచి ధరించి పగడపుచాయ
నెసగెడు ముంజయు నెలమితో గట్టి

రంగుగా నవరత్న రంజితంబైన
బంగారు గిన్నియ భక్తుని కొఱకు 10
వారకామినికీయ వలెనని దలచి
చేరువ గొలిచుండు సేవకజనుడు
కలవర పడకుండ గడచిన దాని
తెలియక యుండ నాత్మీయ పదార్థ
తెలియక యుండ నాత్మీయ పదార్థ
చోరుడై యెవ్వరు జూతురో ; యనుచు
సారెకు నలికెడు చందంబు దోప
కోరి హస్తమున గైకొని తిన్నగాను
వారకాంతామణి వాటికి జేర, 14

౧౦౬. తెరవెళ్లెదరువు - అటతాళం - కల్యాణిరాగం

బ్రహ్మచారి వచ్చె నపుడు భూసురు లెన్న బ్రహ్మచారి

బ్రహ్మచారి వచ్చె నపుడు బ్రహ్మవాదు లతడె పర
బ్రహ్మమని మనసులందు భావించు చూనుండ! —బ్రహ్మ

హాటక గర్భేశ! శాతకోటిపాణి ముఖ్యదేవ
కోటులది యాశ్చర్యమనుచు మాటిమాటికి
దలచుచుండ —బ్రహ్మ

కోరికతోడ శ్రీవైకుంఠమున సంచరించు శౌరి
వారకాంతవాటి జేరవచ్చెనని మునులెన్న —బ్రహ్మ

ప్రేమతో హామిళ్లపల్లి ధాముడైన శ్రీహరి-భక్తుని
కామితార్థ మీడేర్పగా! వామన రూపముతోడ! —బ్రహ్మ

మాత్ర-తేట. ఈ విధంబున తనయింటి కేగుదెంచి
నిలిచి యున్నట్టి వటుని యా నీరజాక్షి

చూచి వెరగంది యీతడిచ్చోటికేల
వచ్చెనవి యెంచి యా విప్రవరునకవియె, ౧౦౬

౧౦౭. వేశ్య-దరువు-ఝంపె తాళం-దర్బారికానడ రాగం

ఎవరివాడవు భూసురేంద్రా! నీవు వివరింపుమా
సుగుణసాంద్రా! —ఎవ
నీనామధేయ మేమయ్యా! మాకు, నెయ్యంబుతో
బలుకవయ్యా —ఎవ
ఏమికార్యమున నీవేళా! నీవు, యిచ్చటికి
వచ్చితివిలీలా! —ఎవ

బ్రహ్మ-సీ. వనజాతనేత్ర నేవచ్చిన సంగతి
తెలియ బల్కెదవిను తేటగాను
ఈ పుటభేదనం బెడబాయ కెప్పుడు
నుండుదు నేనిత రుండగాను
వేడుకతోడుత విప్రనారాయణ
శిష్యుండనై యుందు సిద్ధముగను
నరవరులెన్నగా నానామ ధేయంబు
శ్రీరంగ డందురు చెలువముగను

తే. అవనిలోన యనర్ఘ మైనట్టి దివ్య
వస్తువంపించె మీకు విశ్వాస మెపుడు
గలిగి యుండగవలెనని తలచియిపుడు
భరిత సద్గుణ సాంద్రుండు బ్రాహ్మణుండు ౧౦౮

౧౦౯. దరువు - అటతాళం - శ్యామరాగం

కొమ్మా! నామాట వినవమ్మా! మా గురుడంపె నమ్మా!
ఈ పసిడిగిన్నె - కొమ్మా!

కోరా! నాణేము దెలియువార, లె, వ్వారైనలేరా!
యుండీన నిందు జేరా! రారమ్మనుచు జీరి, వారిపలు
మారూను కవిసి విచారము సేయుము —కొమ్మా!

చేరా! బ్రహ్మచారులకైన, దొరుకని దాని నీతోనా!
పలుకు మనిరియె గాన, నేనిచ్చుటికి కడాని గిన్నెగొని
మూనాక వచ్చితి వైనముగాగొను —కొమ్మా!

వేశ్య-వ. బ్రహ్మచారీ! ఆ పాత్ర నిటులిమ్ము. ఈ తాంబూలమును చేకొమ్ము.

బ్రహ్మ-తే. బ్రహ్మచారికి మీరలీ వస్తువులను
నీయగారాదు మేము గ్రహింపరాదు
మాకు నివియేల నీవును మంతనమున
తిరిగి గైకొని పొమ్మ పందియము మాని ౧౦౭

వేశ్య- తే. పుడమి లోపల క్రొత్తగా వడుకపెండ్లి
కొడుక వైవచ్చితివిగాన కోర్కెదీర
నొసగితిమి మీరలొల్లక యున్న గురుని
కైన నిమ్మది మాకు లక్షణము సుమ్మి ౧౦౮

బ్రహ్మ-తే. బ్రహ్మచారులు మీరలీ వస్తువులను
వారికిమ్మని యిప్పుడు బలుకగాను
నాలుకెట్లాడె నిదియు మనంబునందు
దలచ నపచార మొదవును ధరణిలోన ౧౧౦

వేశ్య - ఆట. బ్రహ్మచారి యంచు బలికెదు మాయింట
విట వతంసుడగుచు విడెము సేయు

బ్రహ్మ. అతివ! యీ రహస్య మంతరంగము నందె
యుండనిమ్ము సుమ్ము యొండులేక. ౧౧౧

వేశ్య-ద్వి-48. మాయింటి లోపల మంతనంబునను
పాయక మాచిన్ని పడుచును జూచి
ఓగెము లేక నిటుండిన నిదియు
బాగ యుండదటంచు పలికి నంతటనె
తననంటి నంచు చిత్తమున భావించు
కొనియెనో? గాని మాకుం దెల్పదాయె
ఇన్ని దినంబు లిల్లెడబాయ కున్న
మన్ననయైనను మది దలంపకను
ఒకరి తోడుతనైన యుచితంపురీతి
ఒకమాట జెప్పకయును జనెనపుడు
ఇంత కోపంబైన నెలాగు పనులు
చింతింపగా నగు ? జెప్పుమా నీవె !
ఇట్లు వర్తించు వాడెన్నగా జదువు
యెట్లు జెప్పునోగాని యిది విచిత్రంబు
ఇచ్చటనుండి పోయినది మొదలుగ
మచ్చికతోడుత మాచిన్న పడుచు
చిన్న బోయినదని చెప్పి మీగురువు
గ్రన్నన తోకొని రమ్మ వేగంబె !

బ్రహ్మ. ఏనెట్లు బలుకుదు నీమాటలన్ని
మీ నడవడులెల్ల మీకును దెలియు
గాని మాకేలను కంజాతపాణి
మానుగా నిదివిన్న మాకపచార
మౌను గావున మీరె యనుకూల ముగను
మానక తెల్పగా మంతనంబునను
చెలికత్తె నంపించి చిత్తమింపొంద
పిలిపించు కొండు మీ ప్రియములుమీకె !

గాక యన్యులకు ప్రకాశంబు లగునె
ప్రాకటంబుగ శృతుర్ పఠియించు కొనుచు
మీ ఋణంబును దీర మైలెన పసిడి
కోట నాచే బంచి కోరికదీర
వనజాతలోచను వర్ణించు కొనుచు
వనములో నున్నాడు వామాయతాక్షి ! 16

సూత్ర - అవి చెప్పి బ్రహ్మచారి వెళ్ళుటయు.

కం. శ్రీరంగ నాయకుని స
త్కారుణ్యం బేమి సెప్ప గనుంగొంటే ని
ద్ధారుణి శ్రేష్ఠము గాగను
వారనతీ మందిరంబు వర్ధిలజేసెన్. ౧౧౨

వ - అంత.

కం. అ త్తరళేక్షణ యిదిమే
లు త్తడి సొమ్మానొ ? లెస్స పోలించంగా
ని త్తడియౌనో ? యనితవ
చి త్తమున దలంచి యంత శీఘ్రము తోడున్. ౧౧౩

వ. కళాదువిం బిలువం బంచిన.

# సొన్నారి వేషం

తెరలో -

శ్రీకాంతా కుచకుంభయుగ్మ — పునరావృత్తి

౧౦౯. తెరవెళ్ళేదరువు - త్రిపుటతాళం - కాఫీరాగం.

వచ్చె కళాదుడు సభకు, రమణీ మణులు, మెచ్చాగ తనశిల్ప
ప్రభకు — వచ్చె

వచ్చె కళాదుడు అచ్చాపు బంగారు పచ్చాలు ముత్యాలు
పరికించు దక్షుడు —వచ్చె

సన్నత్రాసు కల్లెసంచి నీలి వన్నెల వరగల్లు మంచి
పొన్ను మచ్చులు రవల తెన్ను పెచ్చులు గొన్ని ఎన్నిక
బరణిచే సన్నుతిమీరగ-వచ్చెకళాదుడు సభకు

వేశ్య - కం. దండము పంచానన కుల
మండిత! ఇది మేలి మానా! మరిగాదా! ఖరా
కండిగ దెల్పుడు మామది
కొండొక సంశయములేక కొలు దీరునటుల్. ౧౧౪

మాత్ర - వ. అని వేశ్యమాత వి|పుండంపిన గిన్నెం జూపించిన జూచి.

సొన్నా-కం. ఇది దలచిచూడ చొక్కపు
పదియారో వన్నెగలుగు బంగారమయో
సుదతీలలామ మీకె
ట్లొదవెను తెలియంగ బలుకు
ముచితముగ గాగన్. ౧౧౫

వ. ఇందు శంఖు చ|క చిహ్నంబు లేర్పడియున్నవి ఇయ్యది
శ్రీరంగనాయకుల సొమ్ము.

వేశ్య - ఆట. మాదు దేవదేవి మధురవాణియు వేడ్క
చోళ భూమిపాలు మోహిలనాడి
పాడుచుండ నొక్క భాగ్యవంతుడు కాన్క
గా నొసంగె మాకు కరుణ తోడ. ౧౧౬

మాత్ర - వ. అని చెప్పి తాంబూలంబొసంగి యతని వీడ్కొలిపి కావేరిం
బిలువంబంచిన.

# కావేరి వేషం

ద్వి - 49. పరగంగ చెంగావి పావడమీద
పిరిమించ వలిపంపు చీరసింగులును
నేల జారగగట్టి నిటలంబు నందు
పోలంగ కుంకుమ బొట్టు బెట్టియును
గొప్పముక్కరయు ముక్కున గీలుకొలిపి
కొప్పున వాసించు కుసుమముల్ దురిమి
దండ తాయెతులు నందముగా ధరించి
దండిగా ముత్యాల తాటంకములను
వలయాది భూషణావళులెల్ల బూని
వలనొప్ప కావేరి వచ్చెనావేళ. ౧

తెరలో -

శ్రీమామిళ్ళపురీ నిశాంతుడగు — పునరావృత్తి

౧౧౦. తెరవెళ్ళేదరువు - అటతాళం - శ్యామరాగం.

కావేరి వచ్చె నపుడు - ఈ వాడ లోకి, - కావేరివచ్చెనపుడు

కావేరివచ్చె నపుడు కీపి తోడుతాను,
లావణ్య వతియైన దేవదేవి బంపగాను —కావే

పమ్మతిగా ముత్తియమ్ముల హారముల
నెమ్మేన ధరియించి నీరజాక్షి తాననగ —కావే

అంగాన లందారుజూడ బంగారు సొమ్ముల
రంగూగ ధరియించి శృంగార వేషమున —కావే

సూత్ర - కం॥ తెలియక నాతని నీచుగ
బలికితి బంగారుపిట్ట బాపండతనిన్
బిలిపించగ వలెనని మది
దలచియు కావేరి జూచి తగ నిట్లనియెన్. ౧౧౩

వేశ్య - ( కావేరితో )

ద్వి - 50. మన దేవదేవికి మరులయి యున్న
వనజాత సంభవ వంశుని జూచి
కల వాడటంచు నిక్కము నమ్మలేక
నిలు వెళ్ళుమనిన పోయెను నిటుగాన
బోటిరో నీ నేరుపులు ప్రకటించి
తోట లోపలికేగి తోకొని రమ్మ.

వ. అతండు బంగారు గిన్నెను నంతరించినవాడు తత్సహాచర్యం బులైన పైడిపళ్ళెరంబులు మొదలైన వెన్ని సంపాదించి యుండునో? అతని జనకుండు మండంగుడి యనుపురంబున లక్షాధికారి గావలయు, ఇప్పటివేళ కొలది భిక్షుకవేషంబు ధరియించి యున్నవాడు, అటుగావున నీవువెళ్ళి లాలించి కొనిరమ్మ.

కావే. అట్లేనమ్మా! నీ యిష్ట ప్రకారం అతన్ని వేగమె లోకొని వస్తాను. (పరిక్రమించి)

తేట - దేవదేవిని జూసి భూదేవుడిచట
వనము చెంగటికిప్పుడు వచ్చెనంచు
వెదకగా నేను వచ్చితి వెలదులార!
చూపగదరమ్మ మీరలు సొంపుగాను ౧౧౪

చ. తిరుమణి పట్టెనామములు దిద్దిన ఫాలము గల్గువాడు శ్రీ
హరి చరణాంబుజాతము లహర్నిశమున్
భజియించువాడు నుం

దర ధవళోప వీతమును తామరపూసలపేర్లు భవ్య కం
ధరమున గల్గువాడు వనితామణి !
వైష్ణవ ముఖ్యుఁజూపరే ! ౧౯౯

ప్రతీ - వ. ఇదుగోనమ్మా ! ఇక్కడ ఒకాయన ఉన్నాడు.

కావే - (విప్రనారాయణునితో)

ద్వి - 51. ఓ ఱాపనయ్య నీవూరక నిచట
మాఱాగ నున్నావు మది చింతలేక
ముదిమది దప్పిన ముసలిది యేమి
వదర సవెల్లను పాటి బట్టెదరె
అదియె సత్యంబని యణుమాత్రమైన
మదిలోన దలతురే మాటికి రీతి
నలుగు చుండెడివాడ వైతివే యేల
వలచితివేల ? వనితను నిట్లు
వలపించితివి, నీవు వచ్చిన వెనుక
పలుమాటలేల భావంబున నిన్నె
వలవరించుచు నుండు పవలు రేయనక !
జలమైన ముట్టదు చపలాయతాక్షి
హారముల్రైవ దాహారంబు మీది
కోరిక యును లేదు కొప్పున మల్లె
పూలమాలికలు సొంపున జుట్టుకొనదు
జాళువా సొమ్ములు సవరించుకొనదు
చెలులతో మర్మంబు జెప్పదు రామ
చిలుకలు బలుకగా చెవిజేర్చి వినదు
తల్లి పామరమున దగ్గర జేర
నల్లుడు వచ్చెనా ? అని తత్తరించు

చందమామను గని చాల తపించు
కందర్పు సుమసాయకంబుల కులుకు
ఏమి తోచదునిక నేమని యందు
స్వామి నీవిప్పుడు సంతసంబుగను
చముదెంచి మాచెలి చనువున గాంచి
నెనరున లాలించి నేర్పు తోడుతను
మేలైన బంగారు మేడ లోపలను
పూల తపానునంద పుష్పాస్త్రి కేళి
యేలుదుగాని నీ విపుడు రావయ్యా
జాలంబు సేయక జగతీసురేంద్ర.

౧౧౧. దరువు - ఆటతాళం - అలకామోదరాగం.

అలుక యెంతసేపో! నాతో తెలియ బలుకు మెనయ
కలికి మరు ములుకులకు బెళికి నిన్ను దలచుచున్న —దలుక
చెలిమి కలిసియున్న చెలితో, చలము సేయ నేలయా
కులుకుగుబ్బ లెదనునాట గ్రుచ్చి కౌగిలీవయా! —అలుక
జాలమేల నిన్ను బాసి తాళలేదయా
పూలపాన్పునందు మరుని కేళి నేలుకోవయా —అలుక

౧౧౨. విప్ర - ఉత్పలార్థం

అమ్మనదల్చెనా? నను నయంబున బిల్చెన! నన్ను వేగమే
రమ్మనెనా? ఇకేమనె? తిరంబుగ నాయెడ ప్రేమగల్గెనా?
బొమ్మలు దేవటంచునను చుల్కన జూడదుగా లతాంగి, చి
త్తమ్ము తీరెల్లాను సెలవిమ్ము - నిను నమ్మినాను సుమ్ము!
లలితాంగి చిత్తమ్ము సెలవిమ్ము!

౧౧౩. దరువు - ఆటతాళం - ఆనందభైరవి రాగం

సమ్మాతి తోడ మీయమ్మ నన్నేమానె, కలువకంటీ
ఇమ్మాగ నింటికి రమ్మానెనా యేమె ? కలువకంటీ
ఈవేళ నా దేవదేవి బిలిపించేనా ! కలువకంటీ
ఏ విధముగానను నేమి సూచన జేసె కలువకంటీ
చెలువొంద మాకు కావలసిన దానవు కలువకంటీ
తెలియ గోరెద తేటతెల్లముగా బల్కు కలువకంటీ

కావే - తేట. అమ్మరమ్మని వల్కె మాయక్క నిన్ను
గనక మండిన దిని మొక్క కల్పనూయె
ననుచు భావించి వేగ రమ్మనుచు నన్ను
పనిచె పోదాము పదవయ్య బాపనయ్య. ౧౨౦

విప్ర - ఆట. దేవదేవి నన్ను నీవేళ రమ్మని
పిలువమనియె ననుచు బలికినదియు
సత్యమనగ వచ్చు జనని రమ్మన్నది
నమ్మరాదు నా మనంబు నందు ౧౨౧

సూత్ర - వ. అని దోలాయమానసుండై కావేరి వెంటన్‌జని యట వేశ్యాలయం
బున దేవదేవి కవాటంబు బంధించుకొనియుండుట గని.

౧౧౪, విప్ర-దరువు - ఏకతాళం - అలకామోద రాగం

సఖియను జూపరె చెలులారా ! మీకు చాలా
పుణ్యము చెలులారా !
వంచన యేలనె చెలులారా ! పిలి పించిన వచ్చితి
చెలులారా !
హితువుసేయరే చెలులారా ! సార వతి సెలవై నది
చెలులారా !

౧౧౫. సంవాదం - చెణుకు - అట తాళం - ఆనంద భైరవి రాగం

విప్ర. కావేరి బిలిచినను వచ్చితి, తలుపేల మూసితిరి
తడయకను చెప్పరే !

చెలి. తెలియ బలికెద ధరణిదేవ ! పలికసాని
సెలవు లేనిది యెట్లు తలుపు దీసెదను

విప్ర. దేవదేవికైన తెలియంగ జెప్పరే నావిధంబంత
మన్ననతోడ మీరు

చెలి. మీరెవ్వరో ? యూరిపేరేమొ ? మాతోడ
నారూఢిగా దెల్పరయ్య ! ఈవేళ

విప్ర. చేరి మామిళ్ళపలి శౌరి నెప్పుడు మదిని
కోరి తలచే విప్ర నారాయణుడను

చెలి. అయితె ఈవేళమా యమ్మ సెలవిచ్చినది
యేతేర వలయుమా యింటి లోపలికి

దేవ - (ఎదురుగా వచ్చి)

౧౧౬. చెణుకు - ఆదితాళం - కాఫీ రాగం

స్వామి ! చలమేమి ! నామదిలో నిన్ను నమ్మి
యున్నందుకు

ప్రేమలేక యిట్లుండగాను మంచిదిగాదు —స్వామి

మరుడు కిన్కతోడ చెఱుకు వింటిపిరుల
శరముల సంధించి గురిగ నేయగసాగె —స్వామి

చిలుకాలు కలకల బలుకాగ చెవులకు
ములుకు లాయెను మది నళుకుజెందె నయ్య —స్వామి

సీ. నాయింటి నెడబాసి నడచిపోవగ నీకు
పాదంబు లెట్లాడె భవ్యచరిత
అణు మాత్రమైన నా యందున తప్పులు
కనిపించెనా మీకు కంబుకంఠ
కారణమే గాని వారు వీరను కొనే
మాటలు మనకేల మంజుగాత్ర !
వసుధలోపల మొగవారికి ధర్మ మె
క్కడిదను నీతివాక్యంబు లిపుడు

తే - సత్యమాయెను నీ యందు సాటివార
లెవ్వరైనను కనుగొన్న నిదియు విన్న
చోద్యమంచును చులకన జూచుచుండ
భవ్యగుణ సాంద్ర ! ధరణీ సువర్వచంద్ర ! ౧౨౨

వేశ్యమాత—(వచ్చి)

ఆట - ఎవరి నెన్నిమాట లేను బల్కిన గాని
పాటి బట్టుకోరు బాపనయ్య
నవ్వ చుందురిలను నా మాట నిజమని
అలిగి పోను విహిత మౌనె నీకు ! ౧౨౩

సూత్ర-వ. అవిన పుత్రికామోహంబున జనని కాంతస్వాంతురాలయ్యెనవి భావించి, విప్రుండు సుఖంబుననుండె నంత, నిక్కడ -

సీ. అవసరం బరపియు నర్చకుల్ శ్రీరంగ
శౌరికి మధ్యాహ్న సమయ మందు
వేడుకతోడ నైవేద్య మర్పించేటి
కాలంబు నందు బంగారుగిన్నె
మునుపున్న చోట జూచిన లేక యుండిన
నిదియేమి యాశ్చర్య మొదవె ననుచు

యూహించి సందేహ మందినల్దిక్కు-ల
నిక్క-డ నక్క-డ నరసి జూచి

తే - దొరక కుండిన నెక్క-డ దోచకపుడు
నరుగు డెంచియు దేవాల యాధికారి
యైన జియ్యరు గాంచి భయంబు వొడమ
విట్టులని విన్నవించిరి గుట్టు గనగ. ౧౨౪

# జియ్యరు వేషం

తెరలో -

శ్రీ మామిళ్ళపురీ నిశాంతుడు —— పునరావృత్తి

తెరవెళ్లే దరువు - ఏకతాళి - మోహన రాగం

జియ్యరు వచ్చెను సభకు చెలు వెయ్యెడ గులుకగ దనకు
జియ్యరు వచ్చెను చయ్యన సేవకు
అయ్య వచ్చెనాని యడుగు లొత్తగా - జియ్యరు
నెయ్యము మీరగ నెరజాణలు తై
తయ్యని ముంగట జెయ్యగ నాట్యము - జియ్యరు

# పూజారి వేషం

తెరలో -

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ —— పునరావృత్తి

౧౧౮. తెరవెళ్లేదరువు - అటతాళం - మోహనరాగం

పూజారి యేతెంచెను ఆలయమందు తేజాము కడుమించేను-
పూజారి యేతెంచె రాజిల్లు గుడిలోన

కలుగ జాలనిది గల్గెనని జియ్యరుకు దెల్పు - పూజారి
పూజా - (జియ్యరయ్యతో)

కం. దండంబు జియ్య రయ్యా
దండిత రిపువర్య మీకు దండంబయ్యా
ఉండుండి దేవళంబున
కొండొక విషయంబు బుట్టె కొనుమూ వినతిన్. ౧౨౫

౧౧౯. *దరువు - అటతాళం - ఆనందభైరవి రాగం*

ఈదేవళంబున నెన్న డిట్లాలేదు జియ్యరయ్యా-ఇప్పు
డే దొంగ వచ్చెనో! ఏమి దెలియరాదాయె జియ్యరయ్యా
కారాణమేమి బంగారు గిన్నెబోను జియ్యారయ్యా
వారినిగూర్చి విచారించ వలెనయ్య జియ్యరయ్యా
తలచాగ నెవరి చిత్తంబెట్టు లుండునో జియ్యారయ్యా
తెలియాదు తలంచారి బిలిచి యడుగరయ్య జియ్యరయ్యా.

ద్విప - 52. మనవిని వినుడయ్య మా జియ్యరయ్య
కనుగవ కెంజాయ గనపడ నేల
బంగారుగిన్నె యేర్పడ నిప్పుడేము
రంగమోహిల చేరంగని గంటి
మింతలోనే దొంగలెవ్వరు వచ్చి
రంతిపురంబున కని సంశయించి
గొల్లల నంబుల గుడిపనివారి
నెల్లను బిలిపించి యీ లోపలికిని
యెవరు క్రొత్తలు వచ్చిరీ జాడమీరు
వివరింప కుండిన వేధ జేయింతు
ననివల్కి యిక సాత్వికా లాపములును

పనికిరావని కోపమును మదిబూని
కోలాహలము జేసి కొట్టుదు కట్టి
డేల చేసిరి భయం బింత లేదనుచు
ఎంత గర్జించిన యెంత దిట్టినను
ఎంత గొట్టిన జాడ యే మాత్రమైన
కనిపించకున్న వేగమె యిచ్చటికిని
పనిగొని వచ్చితి పలుమాట లేల
తలవరి బిలిపించి తగవు బెట్టింపు
డిల దేవశాద్రవ్య మెటుబోవు నయ్యా

జియ్య - వ. ఎవ్వరక్కడ ! తలవరిని బిలువుడు

## తలవరి వేషం

తెరలో -

శ్రీ మామిళ్ళపురీ నిశాంతుడు — పునరావృత్తి

౧౨౮. తెరవెళ్ళేదరువు - అటతాళం - కాఫీరాగం

తలవారి వచ్చె నపుడుం జియ్యారు కడకు — తలవారి
తలవారి వచ్చేను తను జూచి జారూలు
చోరులు- మది కళవళ మంద —తల

ఓరసిగను జల్తారు చెఱంగులు
జాముడులు సింగారాము గన్పడు —తల

ఘుఘుఘల్లుమను నుంగరముల కోలయు
ఝుళిపించుచు నా సమయము నందు —తల

తల - క. గిడిగిళ్ళు జియ్యరయ్యా
వడివడిగా నన్ను బిల్వ బంచినట్టి యా
మిడిమేలపు పని యేమని
కడువడి నేదీర్తు జెప్పగావలె నిపుడే! ౧౨౦

౧౨౧. జియ్యా - ఉత్పలార్థం

రంగని పేరువాడవు నిరంతరమున్ హృదయంబు లోపలన్
రంగని పాదపంకజ మరందము గ్రోలుచు నుండువీవు శ్రీ
రంగని సొమ్ము పద్మజ సురప్రభులై నను ముట్టనట్టిచో
బంగారుగిన్నె బోయె నౌరా! చిత్రంబు చాలా
గుడిలోన చోరులు నెవ్వరౌరా!

తల-దేవరా! నేనిపుడే దానిజాడ గనుంగొనెదను.

౧౨౨. ఏలలు - త్రితాళం - కల్యాణి రాగం

మన్నే వారా లిపుడు పైడిగిన్నె జాడా దేకాయున్న
మన్నెరికము సాగాదింకాను ఓ ఓ సరదార్లారా!
తిన్నగాను వెదకు చుండూడీ!

ఖిల్లే దారులారా! పైడీ గిన్నెజాడ దేకయున్నా
డుల్లు సుమ్మీ! మీ మీ గ్రాసాలు-జాగ్రత్త తోడ
నెల్ల చోటులాను జూడుడీ.

నేడే వేళకైనా పైడీ గిన్నెజాడ దేకాయున్నా
చూడుడీ మీహోలు దెలిసెమ, ఓ ఓ రౌతులారా
తోడు తోడా వెదకు చుండూడీ

ప్రాకారాము గవనులందు చౌకిదారు లారాగిన్నె

దేకయున్న బాగా యుండాదు కావూన నిక వ
రాకు మానీ వెదకు చుఁడూడి !

**సూత్ర. అవి యతండు పురంబునగల సౌన్నారుల నేకాంతంబునం బిలిపించిన వారు వచ్చి.**

సౌన్నా-విభావరీవృత్తం

సలాము దేవరా! తలారి ధీవరా !
ఖిలాపు లేమిటి! బులావు లెందుకు ?
తలాషు జేతురా ! ఖులాస జూతురా !
కలీజ నిండుగా ! దిలాస జూపుడీ ! ౧౨౩

తలా-పంచచామరం-

కళాదవర్య రంగధాము కాంచనంపు గిన్నెయే
కులంబు మర్త్యుడై నగాని కొంచబోయె నాతడున్
దలంచి విక్రయించ మిమ్ము దట్టుగాన నిప్పుడా
పలకుణంపు పైడిగిన్నె జాడజూచి తెల్పుమా ౧౨౪

౧౨౩. చెణుకు - ఆటతాళం - శ్యామ రాగం

రంగని పాదములు మదిలో నిల్పుమా, ఆ
బంగారుగిన్నె జాడ దెల్పుమా !
చెలువూగ నీనేరుపు జూచి మెచ్చేదా ! నీకు
జల్తారు కమ్మల శల్ల నిచ్చేదా !
దాచాక చెప్పుమా ! మా కీ చందాము నేడు నీ
చాతుర్యము లన్ని గందాము —రంగని

సౌన్నా-తేట. అయ్య వినవయ్య యిప్పుడా కుందనంపు
గిన్నె వెలయాలి యింటిలో నున్నదయ్య

ఏకత బున నెరిగించి తిష్ఠమైన

నడ గవయ దేవదేవిని నతిరయమున ౧౩౯

సూత్ర. అని తెలిపినతలారియతని కుడుగరవిచ్చి పంపి మరునా డరుణోదయంబున.

ద్విప - 53. గండ పెండేరముల్ కాలి గగ్గెర్లు
దండగడియంబులు తఱచుగా బెట్టి
బల్లెముల్ పైజాలు బాకులు కుఱుచ
చల్లాడములు కుడిచేతుల బూని
భటజనుల్ కొంద రార్భటము సల్పుచును
చటులోగ్రమైన రోషంబు తోడుతను
కుడి యెడమల నడ్వ కోరమీసంబు
వడివేసి దువ్వుచు హహ్వారే యనుచు
చలదయః ప్రతి కోజ్వల దండములను
ఘలుఘలు మనుచుండ కరమున బూని
సరదార్లు కొందరు చనుదెంచు చుండ
ఇరవొంద చికిలి సేయించిన మంచి
విచ్చుకత్తులు ఝళిపించుచు నుండ
గ్రచ్చర కొందరా గ్రహమున రాగ
కరమొప్ప హనుమంత కాసెగట్టియును
చెరగులు నేలపై జీరాడు చుండ
ముక్కు పైనుండి కన్బొమ్మల దనుక
చిక్కటి నామంబు చిన్నగా దీర్చి
తమ్మట కాహళ ధ్వనులు నెల్లెడల
గ్రమ్ముచు చదలంటగా మ్రోయుచుండ
ముందుగ కొందరి ముఖ్యుల వారి
మందిరముల కంపి మార్గంబు నడువ
పురజనులేమి యద్భుతమిది యంచు
నరుదందు చుండగా హర్మ్యంబులెక్కి
వాడల వాడల వారలందరును

శోధు గూడుక విది చోద్య మటంచు
కనుగొను చుండగా గ్రామంబు లోన
జనములేపవి యొనర్పంగ బోయినను
చేతులాడక తలంచిన నేరిమీద
యేతీరుగాను పరీక్ష యయ్యెడినా
గాని యిదంత రంగవిమాయ సుమ్మి
మానవులకు విట్టి మహిమలు దెలియ
వని బుధులెన్న నేమన నెట్టులౌనా
మనకేలనవి పెర మర్త్యులుండగను
వార కాంతామణి భవనంబు నకును
ధీరత తోడ నేతెంచె తలారి ౧౨౯

వ. అంత నాభటులు దేవదేవి యిల్లు శోధించి గిన్నియనుగొనివవి తలారి ముందటం బెట్టిన నవ్వేశ్యమాత యిట్లనియె.

వేశ్య-ఆట. ఏమిపాపమెరుగ మీగిన్నె మాచిన్న
దానికొక్క బోడ దాసరిచ్చె
పట్టె నామములను బెట్టుక మాయింట
వవ్వ శించినాడు వానిదెండి! ౧౩౦

సూత్ర. అని చెప్పినన్ భటులు విప్రనారాయణుం దెచ్చిన.

తలా - ఉ. దండము దండమయ్య విహితవ్రత!
సత్య తపోగరిష్ఠ మో
తొండరడిప్పొడి! యిపుడు తోటపనుల్
దగ జేసికోక, ఘా
దండలు రంగనాయకుని దండ సమర్పణసేయకిట్లు నీ
వుండుట భావ్యమౌనె వికచోత్పలనేత్రల
యిండ్ల పంచనన్. ౧౩౧

ఉ. రంగని సేవబాసి యిటు రాదగునా? ఒకవేళ వచ్చితే
నంగనతోడ పొందనగునా! యెటులైన నహర్నిశంబు నీ
సంగతి నుండవచ్చునె విచారములేకను దానిమీద నీ
బంగరుగిన్నె దొంగిలుట భావ్యమెనీకు
ధరాసురోత్తమా! ౧౩౨

తే. తగని కార్యంబొనర్చిన జగతిలోన
నెంత ఘనులైన దాని సహించబోరు
గాన నిక మంచిమాటల తోన గదలి
జియ్యరయ్యల కడకు వేంచేయ రయ్య. ౧౩౩

సూత్ర. అని పరిహాసోక్తులాడుచు తోకొనిజని తలవరి విప్రనారాయణుని జియ్యరు కొప్పించిన నతండు వేశ్యమాతంగనుగాని.

జియ్య-ఓసారనాతి! మీ యింటికిగిన్నె యేవిధంబున జేరెనో చెప్పవే!

వేశ్య-ద్వి-౬౪. ఏమి జెప్పుదునయ్య నేడాది నుండి
యేమి మరులొగాని యీతని తోడ
మా దేవదేవి నేమంబు తోడుతను
నేది విచారింపకీ ప్రకారమున
నిరతంబు తోటలోనికి బోయియుండు
పరిచర్య లొనరించు ప్రాలు మాలకను
జనుదెంచి యింట భోజన మొనరించు
వినుడు నీతనిసొమ్ము విడెమైన నెరుగ
మితడు భిక్షాన్నంబు లెత్తుకవచ్చి
ప్రతి వాసరంబు భక్షించుచు నుండు
ఈరీతి నుండెన యెట్లు సంసార
భారము వహియించ వలెనని నిన్న
మా చిన్నదానికి మరిబుద్ధి జెప్పి

దాచక నితని మాధామంబు వెడలి
పొమ్మని బల్కిన పోయి తానొక్క
బమ్మచారితొ బంపె పైడిగిన్నియను
వెలలేని సొమ్ము నీవిధమున గాంచి
పిలువ నంపితిమి కావేరితో నితని 9

విప్ర - తేట. శిష్యు లుండుట నీభూమి సీమ జనుల
కెల్ల దెలియదె! గురిజేయ నింతెచాలు
నింక వేమాట లేటికి యిది నిబద్ధి
యైన గిన్నియపని నిజంబనగ వచ్చు. ౧౩౪

వేశ్య-సీ. తనవలె ద్వాదశ స్థలముల తిరుమణి
తిరుచూర్ణ రేఖలు దిద్దినాడు
తులసి పూసలపేర్లు నలినాక్ష సరములు
వక్షఃస్థలంబున వైచినాడు
పిల్లసిగయు నొక్క తెల్లజన్నిదము కౌ
ళిల్లు వాడొంగోచి బెట్టినాడు
పవడంపు నునుదీగ భంగిభాసిలు ముంజ
కటిభాగమున లెస్స గట్టినాడు
నలుపు నెమ్మేను నసుచాయ గలుగువాడు
చెలువుగా రంగడని పేరు జెప్పినాడు
గురువు బంపించెనని పైడికోర మాకు
యిచ్చిపోయెను నింక నే నేమనందు. ౧౩౫

తేట. నల్లనివి నీళ్లు తెల్లని వెల్లపాల
టంచు నుండితి మితని మాయలు నెరుంగ
నీతడొక కైతవంబున నిల్లు జెఱుప
దలచి దేవరగిన్నంపె దెలిసె నేడు. ౧౩౬

తేట. భయముచే చిన్నివడుగేమి పలుకునో య
టంచు తమ యింటిలోపల నుంచివచ్చి
శిష్యుడే లేడటంచును జెప్పె నిలను
కల్ల నిజమయ్యె ననుట నిక్కంబుగాదె! ౧౩౭

సూత్ర. అవినవివి జయ్యరు దౌవారికులనుబంచి ధర్మాధికారిని బిలిపించిన నతండు వచ్చెనట వెటువలెను.

# ధర్మాధికారి వేషం

తెరలో.

శ్రీకాంతా కుచకుంభ యుగ్మ — పునరావృత్తి

౧౨౪. తెరవెళ్లేదరువు - త్రితాళం - హంసధ్వాని రాగం

వచ్చెను ధర్మాధికారి, న్యాయ వరులకెల్లను హితకారి!
సచ్చరిత్రుల నెల్ల సదమల గతితోడ
రక్షించుటకు తానే రక్షకుడై మిగుల. —వచ్చెను
ధర్మసూక్ష్మము గొప్ప దాని, తెలియ
తరముగాదు నజున కాని-
నిర్మాల మతితోడ నిఖిల శాస్త్రంబుల
మర్మాము లెరిగిన మాధవ రూపుడు —వచ్చెను

జియ్య - (ధర్మాధికారితో)

తేట. వందనము జేతునయ్య ధర్మాధికారి
ధర్మసూక్ష్మంబు గలిగె నీ సమయమందు

తేటతెల్లంబుగా దాని దెలుపుదు వని
నిన్ను బిలిపించి నారము నేర్పరివని. ॥నా॥

౧౨౫. చెణుకు - అటతాళం - శ్యామరాగం

జగతిలో ధర్మశాస్త్రజ్ఞు లందరు తగవు
జెప్పరయ్య శాస్త్రులార
సార వేదాంత విచారి బ్రహ్మచారి చోరుడన్న
యపచార మంటారా
వారకాంత యింటి కేరీతి జేరెబం గారుడన్న
విచారించ వలెనయ్యా
జనులెల్ల నన్య మనకుండాగ మీరు మనసున
నూహించి మరి దెలుపరయ్యా-జగతిలో.

సీ. జగతిలో నితడగ్ర జన్ముడా మిదట
వైష్ణవుం డదిగాక బ్రహ్మచారి
ధర్మశాస్త్ర విచార తత్వజ్ఞు డుభయ వే
దాంత ప్రవర్తకు డైన వాడు
శ్రీరంగ నాయకు సేవకై పూవుల
సరులు గట్టుట మాని యరుదుగాను
వార కాంతామణి వశుడయి రేబవ
లిట్లుండ ధర్మమౌనే దలంప

తే. దాని కొలికయి దేవతా ధనమటంచు
దలచకపరంజి గిన్నె దొంగిలుక వచ్చె
నక్కటా! యింత యన్యాయమయ్యె నంచు
పలికియును చౌక సేయరే! దలచగాను. ॥నా॥

౧౨౬. దరువు - అటతాళం - మోహన రాగం

దేవూని సొమ్ము తిరిగి చేరేను యింక
భావింప నే నెవరి నేలా యనను,
ఈ వాదమేల మనకు కోవెలలో రంగని
సేవ వేళాకువచ్చె చిత్తము సంతసిల్ల —దేవూ

ధర్మ సహాయకులు-

ఆట. దేవధనము వచ్చితే నేమి యిది విచా
రించ కూరుకున్న నెంచ గాను
దొంగ వేరుపడదు ముంగల మీయాజ్ఞ
చెల్ల కుండునయ్య జియ్యరయ్య. ౧౪౦

సూత్ర. అనిన జియ్యరు ధర్మసహాయకులంగాంచి దీనిని మీరు విచారింపుడన నంత
ధర్మాధికారి యిట్లనియె.

ధర్మా-ద్వి-55. హరిహరీ యీ ధర్మమధిక సూక్ష్మంబు
అరయగా దుర్లభమైన యింకొక్క
తెలుగు విచారించి తెలసిన యంత
నెలలేక పల్కెదనయ్య వినుండు
పడాదినుండి యీ యింతి తోడుతను
వేడుక తోడుత విహరింపు చుండ
ధనయీయ లేదని ధామంబు వెడల
ననిచిన వెనుక రమ్మందురే మరల
కావున నిపుడు బంగారంపు గిన్నె
కోవెలలో జొచ్చి కొనివచ్చి యిచట
వారకాంత కొసంగ వలయు నటంచు
వారందర పుడేక వాక్యంబు గాను

జీయరు తోడుత జెప్పిరి గాన
నే యపచారంబు లేమిటి కిచట
మన కేల నీతని మరియొక పురికి
జనుమంచు చెబుదమీ సమయంబు నందు. 8

సూత్ర. అని చింతించి విప్రనారాయణుం గాంచి విన్నవించు కొనదలంచినది విన్నవించుకొమ్మనిన నతండు.

విప్ర-సీ. ద్రౌపదీ మాన సంరక్షణం బొనరించు
పోలిక కరిరాజు నేలుకరణి
ప్రహ్లాదు నాపదబాపి పాలించిన
లీల కుచేలు లాలించుపగిది
తలితో విభీషణు దయచేసినట్టి చం
దంబుగా నన్ను మన్నింపవయ్య
లేని దొంగతనంబు గల్పించినారు యీ
యపకీర్తి లేకుండ జేయవయ్య
ఆదు కొనవయ్య గోవింద హరి ముకుంద
అవ్యయా నంతరూప కోట్యర్క తేజ
భక్తజన నికురంబక పారిజాత
మంగళా కరనామ శ్రీరంగధామ. ౧౪౧

౧౨౩. కీర్తన - అటతాళం - ఆనందభైరవిరాగం

రంగధామ శ్రీవాసుదేవ! రంగధామ
రంగధామ సారంగ పోషకా! అనంగ జనక
హేమాంగద భూషర
ధాంగ జితాసుర పుంగవ! గరుడ తు రంగ!
శుభాంగ! భుజంగ తల్పకా

పాలిత నిర్జరజాల! సద్గుణ పాల పాణిధృత శైల
దర్పణ కపోల!
దైత్యకుండాల మృగేంద్ర! ఘ నాలక జాల!
ధరా లలనాధిప!
జాతరూప మణిజాత వలయ కం జాతపత్ర సంజాత విభామర
జాతవినుత రవిజా తట తాండవ జాత ముదాన్విత
పాతక హరణా!
పల్లవ సుందర హల్లకపాణి తల్లజ నవసుమ భల్ల జన్యజిత
మల్లి రమా హృత్ఫుల్ల నలినదిన వల్లభ
శ్రీమామిళ్ల పురాధిప —రంగ

సూత్ర. అవి వినుతించుచున్న సమయంబున భక్తజన మనోరథదాయియైన శ్రీరంగశాయి వేంచేసెనట యెటువలెను.

# శ్రీరంగస్వామి వేషం

సీ. బృందారకులు మహా నందంబు తోడుత
కుసుమ వర్షంబులు గురియు చుండ
సొంపుగా గంధర్వ కింపురుషాంగనల్
గీతముల్ బాడగా ప్రీతితోడ
అఖిల మహామును లానంద మగ్నులై
సన్నుతుల్ సలుపగా సంభ్ర మముగ
జయజయ మని సిద్ధ చారణుల్ సాధ్యులు
పొగడుచు నుండగా నగణి తముగ

అంబు నిధులెల్ల స్వచ్ఛంబులై చెలంగ
నభము నందున దేవ దుందుభులు మ్రోయ

సకల జనముల కోరికల్ సఫలమంద
శ్రీరమాపతి సభకు వేంచేసె నపుడు. ౧౪౨

౧౨౮. తెరవెళ్ళే చెఱుకు - త్రిపుటతాళం - కాఫీరాగం

వచ్చె రంగస్వామి హా! వచ్చు పిల్తుని తల్లి ధరణియు పార్శ్వ
ములు జనుదేరగా !
అచ్చరలు తా తయ్యనుచు నృత్యములు సేయుచు నుండగా
ముచ్చటలు దీరంగా నిర్జర మునులు సన్నుతి సేయగా !
హెచ్చరిక దెల్పుచును చారణు లివలావల నడువగా-వచ్చె
హరిహయుడు వైశ్వానరుండును, తరణి పుత్రుడు నైఋతీ
వరుణు డనిలుం డర్ధనాధుడు, పురహరుండును గొల్వగా
సురలు కిన్నరవరులు విద్యాధరులు బొగడుచు నుండుగా
తణచుగా భేరీ పణవ ఝాంకరణములు కడుమ్రోయగా -
— వచ్చె

సూత్రవతి నాధుండు బంగరు వేత్రమును ధరియించియు
ధాత్రి ముందరనడువ ఋషులును స్తోత్రములు దగసేయగా
శాత్రవులు భయమంది చూచి దిశాంతములకు నరుగగా
చిత్రముగ మామిళ్ళపల్లి నృసింహుడై తా సొంపుగా
— వచ్చె

సూత్ర-వ-ఇట్లు ప్రత్యక్షం బైన శ్రీ హరి దివ్యమంగళ విగ్రహంబు నేత్రానందకరంబుగా సందర్శించి పులకాంకిత శరీరుండై, సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి, విప్రనారాయణుం డిట్లని వినుతించె -

చూర్ణిక -

శ్రీమదిందిరా సుందరీ కనక కలశోపమ పయోధర యుగళ
లిఖిత కుంకుమ పత్రికా భంగనైపుణ నఖరజాలా! తపనీయ చేలా

సరసిజసంభవ పురందర ప్రముఖ నిఖిల బృందారక సందో
హోత్తమాంగస్థిత
హాటకకోటీర సంధానిత మందార కుసుమ మరంద సేక
విభాసిత హార కులిశ
జలజ చక్ర రేఖాలంకృత పాదకంజాతం, దూరీకృత
దురిత జాతం,
అభీరాంభోజనయన కుశేశయకలిత కాంచన కాండ విభాసిత
చామర
ప్రభూత ప్రభంజన చలితచికురం సన్నుత సంయమినికరం,
వజ్ర వైడూర్య గోమేధిక పుష్పరాగ శాతకుంభ స్తంభ
గోపుర ప్రాకార విరాజిత మామిళ్ళపల్లి నగరనిశాంతం భక్తజన
వనవసంతం
సంతత సంస్తూయమాన నీలగ్రీవం, శ్రీ నృసింహదేవం,
నిరంతర మహం భజామి. ౧౨౪

ప్రతీ - తేట. స్వామి మీ రెవ్వరీ సభాసదన మునకు
నెవ్వరిని బ్రోచుకొఱకునై హితవు తోడ
నిపుడు వేంచేసితిరో యానతీయు డయ్య
మేము ధన్యులమైతిమి మిమ్ము జూచి ౧౪౪

# శ్రీరంగావతరణం

శ్రీరం-ద్విప. శ్రీరమణీమనః ప్రియుడైన యాది
నారాయణుడు తన నాభి పద్మమున
జనియించి నటువంటి చతురాస్యు కరుణ
కనుగొని జగములు గలిగించు నేర్పు

గలుగు నీవిది పూజ గావింపు మనుచు
పలికి కల్పాదిని పట్టుమటంచు
మమ్ము నొసంగె విమానంబు తోడ
సమ్మతితోడ నా జలజ గర్భుండు
మనువునకిచ్చె నా మనుజవల్లభుడు
తనయుడౌ నిక్ష్వాకు ధరణీశ్వరునకు
నొసగిన పిదప నయోధ్య లోపలను
వెసకొన్ని దినములు వేంచేసి యుండ
రామచంద్ర వసుంధరా వల్లభుండు
ప్రేమతోడ తను విభీషణుండడుగ
యిచ్చిన గైకొని యేగుచు నుండ
మచ్చికతో చోళమనుజ నాథునకు
వరమిచ్చినదియు భావంబున దలచి
స్థిరముగా నతడేలు దేశంబు నందు
విలసిల్లు నుభయ కావేరీ ప్రవాహ
జలమధ్యమున చాల సంతోషముగను. 10
శ్రీరంగమునను భాసిల్లు చుండెదను
శ్రీరంగనాథుడ శ్రిత రక్షకుండ ! 11

తేట. ఇలను మద్భక్తుమీద పరీక్ష వచ్చె,
గాన సందియ మించుక గల్గకుండ
నందరికి దెల్పవలెనని యధికమైన
ప్రేమ తోడుత వచ్చితి వేగనిపుడు. ౧౪౫

సూత్ర. అని మరియు భగవంతుండి ట్లనియానతిచ్చె.

ద్విప - 57. పరమ భాగవతుండు వైరాగ్యశాలి
పరతత్వ సంవేది భవ్య శీలుండు

కరుణాన్వితుండు సాత్త్విక ప్రధానుండు
ధరణీసురుండు మద్భృత్యుడీ తనికి
సరివారుగలరె యీ జగతీ తలమున
విరవాంద వితవిపై నేలాగు దొంగ
తనము గల్పించియు తగవు జెప్పితిరి
ధవమున్న దొకచోట తలచి చూచినను
అనుమాన మొకచోట ననుమాట నిజము
కవిపించె నిక్కడ గనుక ధర్మంబు
నెరుగక ధర వచియించిన జాల
దురితంబు గల్గునందురు నీతివిదులు
అటుగాన మీకు మహాపచారంబు
ఘటియించె నీ మహా కలుషంబు లెల్ల
ఖండనంబై పోవగా పీతనికివి
దండంబొనర్పుడు.

శ్రీరం ధరణిపై నేను
దీలమూలంబును దెలిపెద వినుడు

# విప్రనారాయణుని పూర్వ చరిత్ర

మానుగా మద్వన మాలికాంశమున
జనియించినట్టి వైష్ణవ ముఖ్యుడితడు
ఘనముగా నప్సరః కన్యాంశయైన
దేవదేవియు వీరి తెలగెట్టులనిన
నే వినిపింతును నిక్కంపురూపు
ఒకనాడు దుగ్ధపయోనిధి చెంత
నకలంక రత్న సింహాసనంబునను

చెలువొంద గూర్చుండి శ్రీరమాసతిని
తిలకించి యో సుదతీమణి ! వినుము
విజితేంద్రియుండయి వేడ్కతో నన్ను
భజియింపు చుండెడి పావనమూర్తి
విప్రనారాయణు విమలాంతరంగు
నప్రతర్క్యంపు మోహంబున ముంచి
వెరవొప్ప దేవదేవికి విటు జేసి
తిరుగాడ జేసెద దృఢముగా జూడు
నని పల్కియుండితి నందుకై నేనె
యొనరించితిని నీ ప్రయోజనంబంత
ధనమీయకున్న నీతని సఖ్యమేల
నని యిల్లు వెడలి పొమ్మన్నను పోయి
చింతిలుచుండ వీక్షించియు నేను
మంతనంబున రత్నమయమైన పసిడి
గిన్నె కోవెలను లాగించుక పోయి
పిన్న వటుండనై వెలయాలికిని నే
నిచ్చితి నాసొమ్ము నేనెవ్వరికిని
యిచ్చిన మీకేల యీ విచారంబు ?
పరమాను రక్తినే పల్లవ సతుల
మరుకేళి లాలించు మాడ్కి నితండు
మా యనుమతిని నీ మదవతి తోడ
కాయజు కేళిలో గలసి క్రీడించె
కావున నిదియు నాగమతుల్య మగుచు
పావన మయ్యుండు భావింపగాను

# ఫలశ్రుతి

ఈ కథ వ్రాసిన హితవుల్లసిల్ల
చేకొని చదివిన స్థిరతరంబుగను
వారి మనంబుల వాంఛించు నట్టి
కోరిక లెల్లను కొనసాగ జేతు
ఈచరితంబును నా స్థలంబునను
నాచంద్రతారకమై యొప్పు గాత ! 27

సీ. అస్మత్ప్రియుండిత డాళ్వార్లలోన నం
తర్భూతుడై ధరాతలము నందు
ప్రఖ్యాతి గాంచును ద్రావిడుల్ తొండర
డిప్పొడి యనుచుందు రొప్పుగాను
వీరు పాడినపాట వేదతుల్యంబుగా
పావనమై యుండు భాసురముగ
ఈతనితోడ పన్నిద్దరు శ్రీవైష్ణ
వోత్తముల్ నను బాయకుండు రెపుడు

ఎవ్వరైనను భక్తితో నీతనికిని
పూజ లొనరింపు చుందురో భూతలమున
వారి చిత్తంబు లందుండు వాంఛలెల్ల
నేనె యొనరింపు చుందుదు నిశ్చయముగ ! ౧౪౭

సూత్ర - వ. ఆవియానతిచ్చిన శ్రీరంగవింగని విప్రనారాయణుండిట్లని స్తుతించె.

విప్ర-సీ. ఘన యవ్వన మదాంధ కారంబుచేత శం
కాతంక మంతరంగమున లేక

ఇచ్ఛ వచ్చినరీతి నే విహరించితి
నిట్టి దురాచార మెల్లనీవు
లోగొని నన్ను నల్వురిలోన శ్రేష్ఠుని
గా నొనర్చితివి నిక్కంబు గాను
నీ దయారసమును నేనెంతగాను వ
ర్ణించుచు సకల లోకంబు లందు

అబ్బురము జెంద గోవింద హరి మురారి
అవ్యయా నంతరూప కోట్యర్కతేజ
భక్తజన నికురంబక పారిజాత
మంగళాకర నామ శ్రీరంగధామ ౧౪౬

తే. క్షీర వారాశియందు లక్ష్మీ కుచముల
తులసివనమున దగ త్రిపాద్భూతియందు
నధివసించిన గతి మన్మనోంబు జమున
నుండి నన్నేలుకోవయ్యా యురగ శయన ౧౪౭

శ్రీర - తేట - పూలమాలికలను నన్ను పూజసేసి
నందువలనను మాకు నానంద మయ్యె
రూఢిగా నస్మదీయ సాయుజ్య పదవి
నీకు లభియించు నింక సందియము లేల ౧౪౮

సూత్ర. అంత శ్రీరంగని కొలువుంగని దేవదేవి మధురవాణి యిట్లని వంవదించిరి.

౧౪౯. దరువు - ఆదితాళం-భీంప్లాస్ రాగం.

దేవ- ఈ మోహనాకారు డెవరె ఓ యక్కరో!
మధు- ప్రేమాత్మోవిను రంగధాముడే ఓ చెల్లెలా!
దేవ- ఈవలావలి కాంతలెవరె ఓ యక్కరో!

మధు- దేవేరులు లక్ష్మిభూదేవులే ఓ చెల్లెలా !
దేవ- ఉరమూన రవిదీప్తి యున్నదేమే అక్కరో !
మధు- వరగ కౌస్తుభరత్న పతకమె చెల్లెలా !
దేవ- కటిసీమ తటిదాభ కాంతియేమె అక్కరో !
మధు- వటువైన బంగారు పటమె ఓ చెల్లెలా !
దేవ- పన్నగ పాన్పుపై యున్నదేమె అక్కరో !
మధు- చెన్నమీరగ నాదశేషుడే ఓ చెల్లెలా !
దేవ- శిమూన నేమో భాసిలుచున్న దక్కరో !
మధు- గురుతారముగ రత్నకోటీరమే చెల్లెలా !
దేవ- లీల నాభినడుమ బాలుడెవరె యక్కరో !
మధు- నాలుగు మోముల నలువాయె చెల్లెలా !
దేవ- కరకంజముల నేమో కనిపించు నక్కరో !
మధు- సరభసంబుగ శంఖుచక్రాలె చెల్లెలా !
దేవ- ఇన్నాళ్ళు చూడలే దితవి నో యక్కరో !
మధు- మన్నాఃతోడ ప్రసన్నుడయ్యె నేడు చెల్లెలా !

*దేవ - దరువు ఆటతాళం కల్యాణిరాగం.*

ఏమి నోము ఫలమమ్మా అక్కయ్యా ! రంగ
ధాముని గనుగొంటి మక్కయ్యా !
సురలాకు నగుపడని వాడే అక్కయ్యా ! మనల
కరుణ బ్రోవ నిందువచ్చెనే అక్కయ్యా
శ్రీ వైష్ణవుని ప్రాపుచేత నక్కయ్యా రంగనిసేవ !
మనకు ప్రాప్తమాయె నక్కయ్యా !

౧౩౭. ఇద్దరు - దరువు-అటతాళం-కాఫీరాగం

వాలవాల వాలవాల, వాల లాడుదమో ! చెలులార !

చిరుగజ్జె లందెలు చరణముల | మోయ నరుడూగ నృత్య
మాడుచును - వాల

సరిగమ పదనిస స్వరముల తోడుత,పరమాను రక్తిగ
బాడుచును - వాల

రంగాని చెంగాట బంగారు పూవుల, సంగాతిగా నెగ
జల్లుచును, -వాల

కుంకుమ కరయుగ వంకమూలబూని, పొంకాముగా మీద
బోయుచును - వాల

మెప్పైన వాసన లొప్పుచు నుండేటి పుప్పొడి నెమ్మేన
గప్పుచునూ - వాల

సూత్ర - వ. అంత.

సీ. ఆదినారాయణుం డా సమయంబున
జనములందరు జూడ పరభసమున
విప్రనారాయణు విగ్రహంబున ప్రవే
శించిన నాశ్చర్య చిత్తులగుచు
దండ ప్రణామముల్ దగ నొనరించి య
ప్పరమ వైష్ణవుని వద్భక్తి తోడ
రహిమించగా బ్రహ్మరథమున నుంచియు
బ్రాహ్మణ సభయు సంభ్రమము తోడ

కోరి జయ్యరు ముందరి కొమ్ము బట్ట
పురము వేగించిరప్పుడా భూసురుండు
రంగనికి దండమొనరించి రమ్యము గను
ముదము తోడుత తిరువాయి ముడి పఠించె. ౧౫౦

వ. తదనంతరంబు.

ఆట. అపుడు దేవదేవి నాదర ణంబున
పిలువబంచి చాల ప్రేమతోడ
అంబుజాతనేత్రు ననుమతి తోడుత
యిష్టముగను జియ్య రిట్టులనియె. ౧౫౧

జియ్య - (దేవదేవితో)

కం. నీ వెంత ధన్యురాలవు,
భావింపగ పరమ భాగవతుని పదంబుల్
సేవింపగ గంటివి నీ
కీవెలదులు సాటియె మహీస్థలి లోనన్. ౧౫౨

కం. రంగని యనుమతి నైనది
బంగారపు గిన్నెగొమ్ము బ్రహ్మా దులకున్
సంగతిగాని మహా ప్రభు
వంగన నిను కరుణజేసె నధిక ప్రేమన్ ౧౫౩

సూత్ర. అని పలికి స బహుమాన పూర్వకంబుగా వస్తు మాల్యా భరణాదులతో బంగారుగిన్నె కొనంగి దేవదేవిం గౌరవించిన-

దేవ. కం. సరసిజ నేత్రున కీ బం
గరుగిన్నియకంటె మిగులగా నేమిత్తున్
తిరువారాధనకై నే
స్థిరభక్తిన్ దీనినిడి భజంచుచు నుందున్ ౧౫౪

సూత్ర. అని క్రమ్మర దేవదేవి యా బంగారుగిన్నియ శ్రీరంగని కర్పించె నంత నానమయంబున చెలులు మంగళహారతిబాడిరట నెటువలెను.

౧౩౧. అందరు - మంగళహారతి-త్రితాళం-శ్యామరాగం.

శ్రీరంగనగర విహారా! రమా చిత్తచోరా! కౌస్తుభ
మణిహారా!

శృంగార మన్మథాకారా ! సురారి కాంతార కుఠారా !

 నీహారాద్రి ధీరా !

మంగళం - మంగళం-రంగా-నీకు-మంగళం మంగళం

నీలవర్ణ ధవజాల తూల వాతూల జాతగో

పాల పద్గుణాల వాల ! భక్త సురపాల, దైతేయ విపాల

 సుశీలా ! - మంగళం



కాండజాత సంభవాండ, ఖాండవాఘ పిచండ, ఖండిత

 శత్రుకాండా, మణి

కుండల మండిత గండభాగ వేదండ రాజపాల, కుండలి

శయనా ! - మంగళం

తామరసోద్భవ ముఖామర, స్తోమ వినుత దివ్యనామ శ్రీ

మామిళ్ళపల్లి మందిర సంచార, సామగాన లోల ! సదయ

- నృసిం.హా

మంగళం, మంగళం, రంగా నీకు, మంగళం మంగళం.

# సంపాదకుని గూర్చి

నం : ప్రభవ మార్గశిర నవమి 31-3-1927.
చినతండ గ్రామం, అచ్చంపేట తాలూకా, మహబూబ్‌నగర్ జిల్లా.

తాపితరులు : వేంకటాచార్యులు, మాణిక్యాంబ.

ద్యాభ్యాసము : పెన్నాడ పెద్ద అమ్మయ్యగారివద్ద సంస్కృతాంధ్రభాషలు జ్యోతిష విద్యాభ్యాసం. 1924 నుండి 1971 వరకు నాగర్‌కర్నూలులోని వాటియు ఉన్నత పాఠశాలలో తెలుగు అధ్యాపకత్వం. 1971 నుండి పాలెంలోని శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ భాషా కళాశాలలో ఉపన్యాసకులుగా నున్నారు.

పద్యాని చక్కనైన వచనరచన చేయడం, ఏ అంశంపైనా అనర్గళంగా ఉపన్యసించేవి జీవితం నే కవిత్వం, చరిత్ర - పరిశోధనలో మక్కువ అనడానికి, 'మహబూబ్‌నగరం లోని కవిపండిత లేఖకులు' శీర్షికతో 'సంశోధన' పత్రికలో అముద్రితంగా న్న రచన వీరి సునిశిత పరిశీలనకు తార్కాణం.

జిజ్ఞాసువు, ప్రతిభావంతుడు, సాహిత్య వ్యవసాయైకధీవి.

—శ్రీరంగాచార్య

---

ప్రచురణలు

1) ఆర్యాశతకం — చిత్రపది
2) చక్రతీర్థ మాహాత్మ్యం — స్థల చారిత్రక కావ్యం
3) మాతృశ్రీ విలాసం — ఎల్లూరి నరసింగకవి కృతి పరిష్కృతం

ముద్రితాలు :

1) పాండురంగ శతకము — నాగర్‌కర్నూలు స్వామిపై
2) తిరుమలేశ శతకము — తెల్లరాళ్ళ స్వామిపై
3) మహాక్షేత్రం-మామిళ్ళపల్లి — ప్రాచీన క్షేత్ర చరిత్ర

చన కావలసినవి :

1) దుర్గాభర్గ శతకములు
2) శ్రీ మత్ప్రతాపగిరి ఖండం ( కావ్యం )

ఇంకా గేయాలు, వ్యాసాలు పరిష్కృత కృతులు అనేకం

---

Printed at : PADMA POWER PRESS, Kutbiguda, Hyderabad-27.